ఆంధ్రవిశ్వకళాపరిషత్తు

వారి

1958 వ సంవత్సరము

పోటీలో

బహుమతి

పొందిన

గ్రంథము

సా రమ్యా నగరీ మహాన్ సనృపతిః సామంతచక్రంచతత్
పార్శ్వేతస్యచ సా విదగ్ధపరిష త్తాశ్చంద్ర బింబాననాః
ఉద్రిక్త స్సచ రాజపుత్రనివహా స్తే వందిన స్తాఃకథాః
సర్వం యస్యవశా దగాత్స్మృతిపథం కాలాయ తస్మై నమః

# గృహరాజు మేడ

గృహరాజుమేడలోపల సింహాసనముపైఁ గోమటి వేమారెడ్డి కూర్చుండియుండెను. ప్రక్క నెవ్వరునులేరు. ఒకసేవకుఁడైనలేఁడు. వేమారెడ్డి తలవంచికొని యేదియో యాలోచించుచుండెను. అతఁడప్పుడప్పుడు మొగమెత్తి ముందునకుఁ జూచుచుండెను. అతని మొగమున గంభీరమైన యాలోచనముద్ర ముడివడియుండెను. ఆ ముడిలోని చిక్కులన్నియు విడదీయఁబడరాకయున్నట్లు కన్పించుచుండెను. అతఁ డాకసములోనికిఁ దీక్ష్ణముగ నొకక్షణము చూచును. మఱల మొగమువంచును. పదిక్షణములాగి మఱలనాకసములోనికిఁ జూచును. ఆకసములో నాచూపు లెంతదూరము ప్రసరించునో? ఎంతదూరము ప్రసరించునో చెప్పుటకు నీయాకసమున కొకహద్దున్నదా? అసలీయాకాశమన్నపదార్థమే విచిత్రమైనది. ఇదిమనకెట్లు తెలియుచున్నది? చూచినకొలఁది యిదియేదియో యనంతభావమును నవ్యక్తభావమును మేల్కొల్పుచున్నది. ఆభావము మనసంతయు నాక్రమించుకొని తెలియరానియొక యావేదనము గల్గించుచున్నది. కోమటి వేమునకిట్టి భావము తఱచుగా నొంటరిగానున్నప్పుడు గల్గుచుండును. అతఁడా భావము ను ద్రోసివేయలేఁడు. ఆభావమన్న నతనికిభయము. అది వచ్చినచో యితరాలోచనములను నితరభావములను దూదిపింజలవలె నెగురఁగొట్టివేయును. అతఁడు గృహరాజుమేడలోఁ బ్రవేశించుసరికి నింకనాల్గుగడియల ప్రొద్దుండెను. అతఁడాసింహాసనముపై నప్పటినుండియు, గూర్చుండియే యుండెను. అప్పటినుండి యాలోచించుచునే యుండెను. అతఁడెంతకాలమునుండి యాలోచించుచుండెనో యతనికే

తెలియలేదు. మలుసంజకెంపుచాయలు గోడలపై ముత్యాలజాలరులఁ బ్రతిఫలించుట యతనికిఁ దెలియలేదు. నల్లని చీకటిముత్తములు నీడలువారుటయు నతఁడెఱుఁగఁడు. ఒక పరిచారికవచ్చి దీపమువెలిగించుటనాతఁడు గ్రహింపనేలేదు. అతఁడట్లే యింతకాలమునుండియుఁ గూర్చుండి యాలోచించుచుండెను. అతఁడు హఠాత్తుగాలేచి ద్వారమునఱకు నడచివచ్చి రెండుచేతులతోడను ద్వారబంధమును బట్టుకొని యాకసములోనికిఁ జూచెను. అతనిచూపులకుఁ జీకటికెరట్లడ్డమురాలేదు. అతనిచూపు చివళ్లు దూరమున మెఱయుచున్నయొండు రెండు నక్షత్రములకాంతులతో ముడివడి యతనికిఁ గొంచెము సమయస్మృతి గలిగించెను. ఆకల్గించుటతో నతనిదృష్టి యావరించుచున్న చీకటులను గుర్తుపట్టెను. అతనికిఁ జాలనాశ్చర్యమయ్యెను. ఈచీకట్లు తన దృష్టిపథమున కడ్డమురావేమి? చీకటిలో నేవస్తువును బ్రకాశింపదు గదా! ఈయాకాశముయొక్క యీయనంతత్వ మీయవ్యక్తభావము నీచీకటిలోఁగూడఁ బ్రకాశించుచునే యున్నవి. ఈ చీకటి యాకాశమంతయు నావరించిలేదా? ఆకాశమే యీచీకటి నంతయు నావరించియున్న దేమో? అతఁడా చీకట్లవంకఁ జూచెను. అవి క్రమముగా దట్టమగుచుండెను. అతఁడు రెండుమూఁడడుగులు ముందునకు వైచి పిట్టగోడ నానుకొని క్రిందికిఁజూచెను. క్రిందనంతయుఁ గీకారణ్యము. అతఁడు పైకిఁజూచెను. పైననంతత్వము. అతఁడు రెండుమూఁడుతడవలు పైకిఁ గ్రిందికిఁ జూచెను. అతనినోటివెంట నప్రయత్నముగ "నేలయంతయుఁ జీకటి యాకసమంతయు ననంతము. ఆయనంతత్వము నీచీకటి కప్పలే"దనుమాటలు బయలువెడలెను. దూరమున ముల్లగూరమ్మ గుడినుండి ఘంటారావము వీతెంచెను. హజారమున సేవకుఁడొకఁడు సమయనివేదనఘంట మ్రోగించెను. అప్పుడేయారుగడియలు ప్రొద్దు పోయినదా! తానచ్చటికివచ్చి పదిగడియలు. కోమటివేము

నకుఁ దాను బదిగడియలనుండి యాలోచించుచుండెనని దెలిసెను. ఇంత
సేపు తానేమి యాలోచించుచుండెను. ఆమేడపైకి వచ్చినప్పుడు తన
మనసులో రాజమహేంద్రవరపు ముట్టడినిగుఱించి యాలోచన ముండెను.
కాటయవేముని సాధించు నుపాయముల యాలోచనముండెను. కాని
యావిషయమును గుఱించిన యాలోచనమెప్పుడు మనసునుండి జారి
పోయినదో యాయాలోచన మొకదరి చేరినట్లుమాత్రము తనకు గుర్తు
లేదు. ఎప్పుడో యీ యాకాశము దీని యనంతభావము మనసు
నాక్రమించుకొన్నది. ఇప్పు డారుగడియల ప్రొద్దుపోయినది. ఈకాల
మంతయు నీయనంతత్వమును గుఱించి తానాలోచించెను గాఁబోలు.
ఏకభావమును గుఱించి మనసెంతసేపు కదులును? మనసు కదలికగదా
యాలోచనము! ఆయనంతత్వమునే మఱలమఱల ననుకొనుచు మనసు
నిలిచెనుగాఁబోలు! మనసాయనంతత్వము ననుభవించినది గాని దాని
మూలమునువిచారించలేదు. ఇంతకాలమును మనసు కదలలేదు. ఇంత
కాలమైనదనికూడాఁ దనకుఁదెలియలేదే! అప్పుడీకాలమున్నది గదా!
ఉన్నచో నెందుకుఁదెలియలేదు? తెలియుటలోనే కాలమున్న దాన
అసలీకాల మెట్లేర్పడుచున్నది? ఏమో యెట్లేర్పడుచున్నదో కాని
యిదియూరక జరజర సాగిపోవుచున్నది. ఓహో! యిదికంటిముందు
గిరగిర తిరిగిపోవుచు రేపునేఁడు నేఁడునిన్ననుగాఁ బరివర్తనము చెందు
చున్నది. ఈకాలచక్రము వెనుకకుఁ దిరుగుచు బ్రతుకంతయు వెనుక
నెచ్చటికో యొక యఖాతములోనికిఁ ద్రోసివేయుచున్నది. కోమటి
వేమునకు దనగతజీవితమంతయు గుర్తుకుఁ దగిలెను. తాను రాజ్యము
నకువచ్చి పదునైదేండ్లు దాఁటినది. తనకప్పుడే యిరువదియేండ్లు వచ్చి
నవి. కొండవీ డాక్రమించునప్పటికిఁ దనకు నలువదియైదేండ్లు. అంతకుఁ
బూర్వము పదునైదేండ్లు దాను జందవోలు రాజ్యమును బరిపాలించెను.
ఇప్పటికప్పుడే తానుదలపాగపైఁ దురాయిపెట్టిముప్పదియేండ్లయిది.

అంతకుఁబూర్వము దానుగుజ్జువాఁడు. తనకిరువదియేండ్ల వయసు వచ్చినప్పటినుండి పరాక్రమము నెఱపినవాఁడు. అనేకయుద్ధములలో విజయము సంపాదించి యనవేమారెడ్డిమన్ననఁ జెందినవాఁడు. అంతకుఁ బూర్వము పదియేండ్లు దాను విద్యాభ్యాస మొనరించెను. సంగీత సాహిత్యములు గురుశుశ్రూష మొనర్చి చక్కఁగా నేర్చెను. కవాతు ఖడ్గ విద్య మల్లయుద్ధము సరహస్యముగా నేర్చెను. అంతకుఁబూర్వము పది యేండ్లుబాల్యము. అంతకుఁబూర్వము? ఆప్రశ్నకు సమాధానము దొరకలేదు. ఆబాల్యమే సరిగా నతనికి గుర్తులేదు. ఏవియో నాల్గైదు సంఘటనలు మాత్రము లీలగా గుర్తున్నవి. విద్యాభ్యాసమునుండి తక్కినజీవితమంతయు మఱికొంత స్పష్టముగా గుర్తున్నది. కోమటి వేమున కతనిజీవితమంతయు విప్పినట్లు కన్నులయెదుటఁ గన్పించెను. దానివంకనతఁడు వెనుకకు మొదలంటఁ జూచుకొనెను. బాగుగనే యున్నది. ఇంతవఱకుఁ దనజీవితమంతయు జయప్రదముగనె గడచినది. అప్పుడప్పుడు దానపజయము పొందకపోలేదు. తన కవమానములు గూడఁ గల్గకపోలేదు. కాని యాయవమానములకుఁ దఱువాత శాంతి తాను జేసికొనఁగల్గెను. తనకవమానము ఘటించినవారిని దాను నిర్జించెను. వేఱయైన తనకాయవమానబాధ లేదు. తానవమానితుఁడై నట్లిప్పుడెవ్వఁడెంచును? ఎంచిన నెంచకున్న నదియవమానమే. అయి నను నదిగతించినదిగదా! గతించిన దవమానమైననేమి స... నేమి? రెండు నొక్కటియే. కావలసినది ప్రస్తుతస్థితి. భూ... తవర్తమానభవిష్యత్తు రెండునుగూడ భూతమునందుఁ బడిపోవును గదా! అప్పుడివిమాత్రము వానితో సమానముగావా? వానివలెనే భూతవర్తమాన భవిష్యత్తులందలి మానావమానములు తుల్యములేల కారాదు? కావచ్చును. కాని మనసున కట్లనిపించదు. ఆమనసు భూత

మెట్లైననేమి కాఁగలది చూచుకొమ్మనును. ఆభూతమీకాఁగలదానిని క్షణక్షణము మ్రింగివేయుచుండును. ఓహో! యీకాల మొక భూతము. ఈభూతమప్పుడే తనజీవితములోఁ జాలభాగము కబళించి వేసినది. తక్కినదిగూడ నిట్లే కబళించివేయును. ఇది ప్రోలయవేముని గబళించినది. అనపోతారెడ్డిని గబళించినది. అనవేముని గబళించినది. కొమరగిరిని గబళించినది. ఏమిటి? కొమరగిరిని గాలము గబళించినదా? తానుగాదన్నమాట. కొమరగిరి తన ప్రతాపమున కాపాడుతీ కాలే దన్నమాట. తాను గొండవీటినాక్రమించినది తన ప్రతాపముచేతఁ గాదా? అవునని యందఱనుచున్నారు. ఆస్థానకవులట్లేయన్నారు. కాని తనకిప్పుడిట్లుతోఁచుచున్న దేమి? తన్ను గొండవీటిసింహాసనముపైఁ బెట్టినది యీకాలమన్నమాట. తానిన్నాళ్ళు పొందిన జయములు గౌరవము లీకాలము విప్పిన సంఘటనలన్నమాట. సింహాసన మెక్కిం చినకాలము దానినుండి మాత్ర మెందుకు దింపలేదు? నిశ్చయముగా దింపియేతీరఁగలదు. మఱల హాజారమునుండి సమయనివేదనముగావింపఁ బడెను. ఇప్పుడేడుగడియల ప్రొద్దుపోయినది. వేమారెడ్డి మేడ మెట్లు దిగుచుండెను. తనకరువదియేండ్లు వచ్చినవి. ఇంతవఱకుజరిగిన దేదో జరిగినది. ఇదియంతయుఁ దనప్రతాప మనుకొన్నాఁడు. కాదని కాలమనుచున్నది. తాను గాటయవేముని సాధించవలె ననుకొన్నాఁడు. అతని తల బల్లెమునకు గ్రుచ్చి చూడవలెననుకొన్నాఁడు. కాని [illegible]ది నెఱవేరలేదు. అది నెఱవేరుట నెఱవేరకపోవుట తన [illegible] లేదన్నట్లు గన్పించుచున్నది. తన యధీనములో లేని దానికిఁ దనకేల? దానిగుఱించి తానింత బాధపడుటయేల? చివఱకీ బాధయే మిగులునది. బాధయొకటి బోధయొకటి యీరెండును జీవి తమునంతకు ఫలితములై కాన్పించుచున్నవి. తక్కినదంతయుఁ గాలా ధీనము. వేమారెడ్డి మేడదిగెను. అతనికాలికి భూమితగిలెను అబ్బ!

యీరాజకీయములగోల తాను బడలేదు. ఈయుద్ధ మొకదరి చేరిన బాగుండును. రాచవేమునకుఁ బట్టముగట్టి తాను నిశ్చింతగాఁ గాలము గడుపవచ్చును. ఈ కాటయవేమునితో వచ్చిపడినది. వీఁడు తన్ను నిద్రపోనిచ్చుటలేదు. వీనినెట్లైనను సాధించితీరవలెను. ఈసారి మాత్రము వీనిని వదలరాదు. కోమటివేముఁడు నడచుచుండెను. అతనికి ముందు విశ్వాసుసేవకులు రెండుప్రక్కల దివిటీలుపట్టి త్రోవ చూపుచుండిరి. దివిటీల వెల్లువెల్లగాఁ బారి నల్లని చీఁకటుల నొడళ్లులు చీల్చుచుండెను. ఈసారి గజరావు తిప్పనాయకుఁడు వెలుగోటి రాయపనాయకుఁడు కాటయవేముని తల తెచ్చెద మన్నారు. లేనిచోఁ దిరిగి రామన్నారు. ఈకాలము వారి ప్రతిజ్ఞ చెల్లించునా? కోమటివేముఁడంతఃపురమును సమీపించెను. అతఁడు గవనుమెట్లెక్కుచుండెను. అన్న దేవచోడుఁడు చాల పరాక్రమవంతుఁడు. ఈసారి యతఁడు రాజమహేంద్రవరమును బట్టుకొనుటయో రణరంగమునకు బలి యగుటయో తేలిపోవునున్నాఁడు. తనసైన్యమంతయు రాచవేముని యధీనమున నతనికి సాయముగాఁ బంపెను. వచ్చునప్పుడు కృతజ్ఞతగా నన్న దేవచోడుఁడు, నందికంతపోతరాజు కటారి రాచవేమునకిచ్చి పంపుదునన్నాఁడు. కోమటివేముఁడు గవను మెట్లెక్కెను. లోపల నుండి యొకపరిచారిక యారతి వెల్గించి యెదురుతెచ్చెను. "పోతరాజు కటారి తెచ్చి కాని గృహరాజుమేడ పూర్తిసేయుటకు వీలులేదు. గృహరాజుమేడ పూర్తియయ్యేనా? యంతకంటెఁ గావలసిన దేమున్నది? పాపము కొమరగిరి దానిని బూర్తి చేయవలెనని యెంత తాపత్రయపడెను; తుదకది తన చేతిమీఁదఁగాఁ బూర్తి కావలసియున్నది. గృహరాజుమేడ: గృహరాజుమేడ: దానిని దాను బూర్తిచేయును. కోమటివేముఁడు వెనుకకుఁ దిరిగి గృహరాజు మేడవంకఁ జూచెను. మేడపైని దీపపు వెల్గులు బంగరుసూదులవలెఁ జీఁకటిలోనికి బొడుచు

చుండెను. ఆచీఁకట్లా వెల్గులను నలమికొని నోరు తెరచి కబళించుచున్న ట్లుండెను. ఈకాలభూతము గృహరాజుమేడను బూ_ర్తిచేయించునా ?

ఆకాలము విప్పిన నల్లనిపడగలవలె జీఁకట్లు గృహరాజుమేడపై వ్యాపించెను. వేమారెడ్డి దీర్ఘముగా నిట్టూర్చి వెనుదిరిగి లోనికిఁ బోయెను. అతఁడు కాలుసేతులు గడిగికొని దుస్తులు మార్చుకొని సాయంతన శివపూజకుఁ గూర్చుండెను. అతఁడు ప్రాణాయామముపట్టి యాత్మయందు శివత్వారోపణము గావించుకొని మనసు నెదుట శివ మూ_ర్తిని నిలుప యత్నించెను. కాని యతనికది సాధ్యముగా లేదు. బలవత్ప్రయత్నమున మనసున శివుఁడురూపుగట్టినను నామూ_ర్తియందు సంతతధ్యాన ధార ప్రవహింపలేదు. ఆధ్యానమునకడ్డముగఁ గాటయ వేముడో కొమరిగిరియో మనసు నావరించుచుండిరి. పదిక్షణములైన తర్వాత ధ్యానము దుర్ఘటమై కోమటివేముఁడు కన్నులు తెఱచెను. తఱువాత నెదుటనున్న శివలింగముపై నతఁడు పూజాపుష్పముల నుంచి యన్యమనస్కుఁడై యర్చ ముగించెను. అతఁడుశివునకు నైవేద్య మిడి యారతి యెత్తి ఘంటమ్రోగించెనోలేదో యొక పణిహారిణి పరు వెత్తికొనివచ్చి 'అయ్యా! అయ్యా! మీకొఱకై తురగా రామయ్య గారు కబురుపెట్టినారు. అత్యవసరముగా నివేదింపవలసియున్నదట' యనిచెప్పెను. వేముఁడు తొందరపాటునలేచుచు శివప్రసాదమునుదీసికొ నఁబోయెను. కాని యతఁడు చేతిలోనికిఁదీసికొన్న పూవు క్రిందఁబడెను. అతఁడు దానిని మఱలఁ దీసికొని సిగలోఁ బెట్టికొని పణిహారిణితో నే నాలోచనమందిరమునకు వచ్చుచున్నానని రామయ్యగారితోఁ జెప్పు మని తాను దుస్తులను మార్చుకొనఁబోయెను. కోమటివేముఁ డాలో చన మందిరమునకు వచ్చునరి కచ్చటఁ దురగా రామయ్య సిద్ధముగా నుండెను. వేముఁడు వానిని జూడఁగనే "రామయ్యగారూ! ఇంత రాత్రివేళ కబురుపెట్టితిరేమి ?" యని యడిగెను.

రామయ్య :— మోటుపల్లి నుండి వేగువచ్చినది.

వేమునుడు :— మోటుపల్లినుండియా ? వేగా ?

రామయ్య :— అవును. ఆదిక్కున నరపతిసైన్యములు త్రోసికొని వచ్చుచున్నవట. కటకమువారు కూడ విజయనగరరాజునకు సాయమై వచ్చుచున్నారట.

కోమటివేమునుడు మాటాడలేదు. అతఁడూరక రామయ్యవంకఁ జూచుచుండెను. అతఁడు పదిక్షణములట్లే చూచి తరువాత నాకసములోనికిఁ జూచెను. అతని నోటివెంట నప్రయత్నముగ "నిదియుఁ గూడఁ గాలముకూర్చిన సంఘటన" యని వెలువడెను.

రా :— ప్రభూ ! తమరేమియో మాట్లాడుచుందురు. ఇదిచాల తొందరపడవలసిన సమయము.

వే :— నేనిప్పుడేమంటిని ?

రా :— కాలముకూర్చిన సంఘటనయంటిరి.

వే :— అంటినా ? అవునవును. రామయ్యగారూ ! కాలమంతయు నొకరీతి నడచునా ? మనకిప్పుడు చెడుకాలము సంప్రాప్తమైనది.

రా :— శివ ! శివ ! మహారాజులకు జయమగుఁగాక ! ముల్లగూరమ్మశక్తి యశుభములను నశింపఁజేయుగాక ! ప్రభూ ! మీరు నిర్వేదమంది ప్రయోజనములేదు. మహామంత్రి మామిడిసింగన్నగారు గూడ యువరాజువెంటఁ బోయిరిగదా ! ఇప్పుడు కార్యభారమంతయుఁ గేవలము మీపై నేపడినది. ఆలోచించి కార్యపద్ధతి సెలవిండు.

వే :— రామయ్యగారూ ! మహామంత్రి యుండిమాత్ర మేమి చేయును ? మనమెంతచేసినను నదియెట్లుజరుగవలెనో తుదకట్లేజరుగును. ఇదియిట్లు జరుగునని మనమనుకొంటిమా ?

రామయ్య :- ఆ ప్రక్క వెలుగోటి రాయపనాయనింగారు గూడ లేరు. వారును వారిదండనాథులు, గజరావు తిప్పనాయనింగారును యువరాజులతోనే పోయిరి. మోటుపల్లియొద్ద నొక్క మాదారెడ్డి గారేయున్నారు. నాకుఁ దోచినంతవఱకు నొక్కటియే చెప్పెదను నేటిరాత్రి తెల్లవాఱులోపల వడికాని నెవ్వనినైన నశ్వముపైఁ గొండపల్లి పంపవలెను. మనకు నగరరక్షణకై యున్న సైన్యమును మోటుపల్లికి దుమికించవలయును. తేపుసాయంతనమునకుఁ గొండపల్లినుండి యదనపు బలములు రాఁగలవు. కావున నన్నదేవచోడ మహారాజు కుమారులు సోమదేవచోడుల యాధిపత్యమున మనసైన్యమును నేఁడే యుచటికిఁ దరలించుట మంచిది. మోటుపల్లి చేయిజారిపోయినదా! మనము చేయగల్గినది లేదు. మీకు జ్ఞాపకమున్నదో లేదో పదమూఁడేండ్లక్రిందట విజయనగర సైన్యములు కొండవీటివఱకుఁ ద్రోసికొని వచ్చినవి. మోటుపల్లి మనచేతనుండఁగా వారు త్రోసికొనిరాలేరు. వచ్చినచో దక్షిణమునుండి చక్రబంధములో వారి నిరికించవచ్చును.

రామయ్య తనయుపన్యాసమును ముగించెను. కోమటివేముఁడీ మాటలనేమియు వినుటలేదు. అతఁ డాకసములోనికిఁ జూచుచు నాలోచించుచుండెను. అతని చూపులాయాకాశములోఁ బోయినంతదూరము పొడుచుకొనిపోయి తుదలు చిట్లిపోవుచుండెను. అతఁడట్లు చూచుచునే రెండుమూఁడు పర్యాయములు తలపంకించెను. రామయ్య! "ప్రభూ! నేను జెప్పినదంతయు మీరు వింటిరిగదా! తమ యభిప్రాయమును సెలవిం" డనెను. వేమారెడ్డి పలుకలేదు. రామయ్య రెండుమూఁడు సారులు ప్రభూ! ప్రభూ! అని గట్టిగాఁ బిలిచెను. వేమారెడ్డియొక్క యుదుటనఁ దనయాలోచనమునుండి బయటఁబడి "రామయ్యగారు! మీకుఁ గాలభావమునుగుఱించి తెలియునా? దానినిగుఱించి యెప్పు

డైన నాలోచించితిరా ?" యని ప్రశ్నించెను. రామయ్య ప్రభువువంక కన్నెత్తియుఁగాఁ జూచుచులేదు, నేనెప్పుడాలోచించలేదని జవాబుచెప్పెను.

వేమారెడ్డి :— ఇది చాలా విచిత్రమైన విషయము. పోనీ మీరీ యాకాశముయొక్క యనంతత్వమును గుఱించి యాలోచించితిరా ?

రామయ్య మఱియు విచిత్రముగాఁ జూచెను. అతఁడేమియు సమాధానము చెప్పలేదు.

వేమా :— మీరాలోచించలేదు. కాని యిదిచాలా విచిత్రమైన విషయము. ఈకాలభావమునకు ననంతత్వమున కేదో సంబంధ మున్నట్లునాకుఁ దోచుచున్నది. ఈరెండు నెచటనో ముడివడియున్నవి. ఆముడిని గనిపెట్టి జాగ్రతగా విప్పవలయును. ఆముడియేది ? యెక్కడ నున్నది ?

రా :— ప్రభూ ! మీరేదియో గహనమైన విషయము నాలోచించుచున్నారు. ఇదిచాలా గడ్డుసమయము. నెత్తిపై వచ్చి కూర్చున్న యపాయమును దాముగుర్తించినట్లు లేదు. ఆవిషయమును గుఱించి తఱువాత నాలోచించుకొనవచ్చును. ప్రస్తుత కార్యపద్ధతి సెలవిండు.

వేమా :— దానికేమి యది యెట్లో యట్లు జరుగును. కాని ప్రధానమైన విషయమిదియే. ఇదిమాత్రము తెగుటలేదు. ఇది తెగక తక్కినవెట్లు జరిగిననేమి ?

రామయ్య మఱలఁ దనయుపాయమంతయు నేకరువుపెట్టెను. కోమటివేముఁడు " మైన నొక్కటియే. మీయిష్టము ప్రకారమే కానిండు. సోమదేవచోడునితో నామాటగాఁ జెప్పి నేఁటిరాత్రియే పయనమైపొమ్మనుఁడు. కొండపల్లికియువరాజునకును వేగుపంపుడు " అనెను.

హఠాత్తుగా వేముని మనసు నేలపైకి దిగినందుకు రామయ్యా యచ్చెరువుపడెను. అతఁడు తలపై నుండి తట్టెడు బరువు దించినట్లు నిట్టూర్చు సెలవుదీసికొని వెడలిపోయెను. వేముఁడు "సోమదేవ చోడుఁడు త్వేపు పయనమైపోఁగలఁడు సోమదేవుఁడు తండ్రికి మించిన పరాక్రమవంతుఁడు. కాని కుఱ్ఱవాఁడు. నిండ నిరువదియేండ్లు లేవు. కావలసినజామాత. వేమాంబకేమో వానియందుఁ జూపునిలిచినదని రాణిచెప్పినది. సోమదేవుఁడు త్వేపు పయనమైపోవుచున్నాఁడు. కావలసినజామాత" యనుకొనెను. కన్యాకాంతఃపురమునుండి జాలిగా వీణావాదనము తెలిలివచ్చెను.

౨

మఱినాల్గు రోజులుగడచెను. ఈనాల్గురోజులనుండియు యుద్ధరంగములనుండి ప్రత్యేకముగాఁ జెప్పఁదగిన వార్త లేమియు రాలేదు. కొండవీడుపట్టణమును బరిరక్షించుటకు వలసినంత సైన్యము లేదు. తురగా రామయ్య నగరరక్షక బలమునంతయు సోమదేవచోడుని యాధిపత్యమున నానాఁటిరాత్రియే మోటుపల్లికిఁ బంపియుండెను. నగర రక్షణమునకుఁ గొండపల్లినుండి యదనపుబలములు వచ్చునని యెంచిరిగాని యచ్చట మాచారెడ్డిలేనందున నాబలములు గూడ లేవు. ఈనాల్గునాళ్ళలోఁ బరిస్థితులేమియుఁ దెలియక రాజకులమంతయు నుక్కిరిబిక్కిరయ్యెను. కోమటివేముఁ డూరక యాలోచనలతోఁగాలము గడపివేయుచుండెను. అతనికా నాల్గురోజులు క్షణమాశగా క్షణము నిరాశగాఁ గడచెను. ఆనాఁటిసాయంకాలమున నతఁడు తురగా రామయ్యతో గృహరాజు మేడలోఁ గూర్చుండి మంతనమాడుచుండెను. ఆసమయమున రాజమహేంద్రవరము యుద్ధరంగమునుండి వేగువచ్చెను. తురగా రామయ్య నగరువాకిటికిఁజని వార్తాహారునితోఁగూడ నిము

సముల మీఁదికి దిరిగివచ్చెను. వానివార్తప్రకారము గౌతమియొడ్డునఁ గాకరపర్తియొద్ద ఘోరమైన సంగ్రామము జరిగెను. రాజమహేంద్ర వరపు సైన్యములు ఓడిపోయెను. అన్నదేవచోడుఁడును వెలుగోటి రాయపనాయకుఁడును గజరావు తిప్పనాయకుఁడు కాటయ వేముని వెన్నడవిలి రాజమహేంద్రవరముపైకి నడచిరి. మాచారెడ్డి మాత్రము సైన్యములతోఁ గొండవీటికి వచ్చుచుండెను. అతఁడు మఱునాఁడు చేరఁగలఁడు. గజరావు తిప్పనాయకుఁడు మాత్రము శపథముపట్టి కాటయవేముని తలతోఁగాని తిరిగిరానన్నాఁడు. అన్నదేవ చోడుఁడు "రాజమహేంద్రవరమును రెండుమూఁడు రోజులలోఁ బట్టుకొందుము. జయము మనకు సిద్ధించినట్లేయని విశ్వసించియుండు" మని చెప్పుమన్నాఁడు. మహామంత్రి మామిడిసింగన్న యువరాజును వీడి వచ్చుట కిచ్చగింపక మాచారెడ్డిని ముందు పంపినాఁడు. ఈవార్త విని కోమటివేముని ప్రాణములు తెప్పరిల్లెను. అతఁడా వార్తాహరునికిఁ దన మెడలోని పచ్చలహారమును దీసియిచ్చెను. ఆనాఁడెల్ల నగరము నందుత్సాహము దీపించెను. ముల్లగూరమ్మ, ముత్యాలమ్మ, పోతరాజు, మహాలక్ష్మి, కాలభైరవుఁడు మొదలగు దేవతలందఱు ప్రతిదినముకంటె నిబ్బడిగాఁ బూజింపఁబడిరి. ఇన్నాళ్ళును నిద్రపోవుచున్నట్లున్న నగరమున నానాఁడించుక చైతన్యము గానవచ్చెను. కాని యొకమూలనుండి విషాదచ్ఛాయ లేకపోలేదు, కాకరపర్తి యుద్ధమున జయము లభించెనను నానందము సంపూర్ణముగా ననుభూతమైనదో లేదో మోటుపల్లి యుద్ధరంగమునుండి మఱియొక వార్త వచ్చి యాయానందమునందుఁ జేదుగలిపెను. అచ్చటఁ గొండవీడు సైన్యములును విజయనగర సైన్యములును వినుకొల్లునొద్ద మోహరించి యుద్ధము సేయుచుండిరట. చౌండప నాయకుని యాధిపత్యమున విజయనగర సైన్యములు మిగుల నుత్సాహముగాఁ బోరుచుండెనట. ఉభయపక్షములవారికి విపరీతనష్ట

ములు సంభవించెనట. అయినను నరపతిసైన్యము లెక్కకు మిక్కుటమగుటచే నానష్టమును గణింపక యుద్ధము తీవ్రతరము చేయుచుండె నట. మాదిరెడ్డి సైన్యములో నప్పుడేసగము నష్టమై సోమదేవ చోడుని యధీనమునం బంపబడ్డసైన్యమును యుద్ధరంగమునకుం దరలింపవలసి వచ్చెనట. ఇంక నాల్గురోజులలో సాయమందకున్న నెక్కటివారలను యుద్ధములోనికి దుముకించవలసి వచ్చునట. ఈవార్త కొండవీడున కందునరికి రాత్రిపదిగడియలప్రొద్దుపోయెను. చౌండపామాత్యుని పేరు వినునరికి కోమటివేమునకు గుండెతల్లడమయ్యెను. కోమటివేముడు కొండవీడాక్రమించు క్రొత్తలో నీచౌండపామాత్యుడు నరపతి సైన్యముఖమునం గొండవీటివఱకుం ద్రోసికొనివచ్చెను. అప్పుడు గజరావు తిప్పనాయకుని సాయములేకున్నచోం గొండవీడాతనిచేతం జిక్కియుండెడిది. ఇప్పుడా చౌండపామాత్యుడు మఱలవచ్చినాడు. కోమటివేమున కారాత్రి సరిగా నిద్రపట్టలేదు. కలతనిద్దురతో నాతడా రాత్రి వేగించెను. మఱునాడుదయమున నతడు స్నానాదులు ముగించుకొని యద్దమున మొగముచూచుకొనెను. అతని మొగము మిగుల బడలియుండెను. కన్నులు లోతునకుం బోయియుండెను. చెక్కిళ్ళు ముడుతలువడియుండెను. అతడు "నాయందు వార్ధక లక్షణములు సమృద్ధముగా గోచరించుచున్నవి. అబ్బ! భుజములపై నీ బరువు మోయలే" ననుకొనెను. ఈబరువునీవు కావలయునని తెచ్చికొంటివని యతని మనసులో నవభాసించెను. "నేనుగావలయునని తెచ్చికొంటినా"? యని యతడు మఱలం బ్రశ్నించెను. "అవును. అది యొకటియేమి! ఈయన్నియుం గావలయునని తెచ్చికొంటి" వని మఱల నవభాసించెను. కోమటివేముడు దీర్ఘముగా నిశ్శ్వసించి పూజామందిరమునకుం బోయెను. అతడు సమాధిలేని చిత్తముతో శివపూజ ముగించి మొగసాలకు వచ్చునరికి నతనికెదురుగాం దురగా

రామయ్య పరువెత్తుకొనివచ్చి "ప్రభూ! ప్రభూ! మాచారెడ్డిగారు పల్నాటికి పోవుచున్నా"రని వార్త చెప్పెను.

పదిగడియలప్రొద్దెక్కుసరికి మాచారెడ్డి రానేవచ్చెను. అతఁడు పరిస్థితులన్నియుఁ దెలిసికొని మిగులఁ గటకటఁబడెను. అతఁడు తురగా రామయ్యనుజూచి "మీరు సోమదేవునేల పంపితిరి? అచట మన మాచారెడ్డియున్నాఁడుగదా! వట్టి సైన్యములను బంపకపోయితిరా? తాత్కాలికముగా నాయకత్వమును వహించుటకు మీరుపోయిన బాగుండెడిదిగదా"యని పల్కెను. తురగా రామయ్య యేదియో చెప్పి తప్పించుకొనెను. "ఇచ్చట మహామంత్రి లేఁడాయెను. సైన్యమును బంపి నేనును లేకున్న నగరమేమికావలయును? ఈ నాల్గురోజులనుండి నగరమును వేయికన్నులతోఁ గాపాడుచుంటిని. మఱి దినదినము మన యూరు వచ్చు బికారిపండితులకు లెక్కలేదు. నేను లేకున్న సరాసరి వారికి రాజదర్శనమబ్బి బొక్కసమంతయుఁ గొల్లగొట్టఁబడును. అందుచే సోమదేవుని బంపక తప్పలేదు." మాచారెడ్డి చేయునదిలేక మోటుపల్లికి బయలుదేరెను.

మాచారెడ్డిరాక కొండవీటికి ధైర్యము తెచ్చెను. కోమటి వేముఁడునుఁ దురగా రామయ్యయు మునిఁగిపోవుననుకొన్న పుట్టి మెట్ట పట్టినట్లు సంతోషించిరి. ఆ సంతసముతో రేకెత్తిన యాస కోమటి వేముని చూపును నాకసమునుండి భూమికిఁ దెచ్చెను. కాకరపర్తి యొద్దఁ గాటయవేముని సేనలు విరిగి పాఱిపోయెను. అన్నదేవ చోడుఁడు రాజమహేంద్రవరమును ముట్టడించెను. గజరావు తిప్ప నాయుఁడు కాటయవేముని తలతోఁగాని తిరిగి రాననెను. అబ్బ! ఎన్నినాళ్ళకే కాటయవేముని పీడ వదలినది; తాను గొండవీటి సింహాసనము నెక్కినప్పటినుండియు పీఁడపిశాచమువలె బాధించుచున్నాఁడు.

ఒక్క-రాత్రి సరిగాఁ గంటినిండ నిద్రపోనిచ్చినాఁడుగాదు. వీనియొద్దడి తట్టుకొనుటకుఁ దలప్రాణము తోకకువచ్చినది. వీనికిని నీ విజయనగర పతులకున్న బాంధవ్యము మఱియుఁ బ్రాణాంతకమైనది. పడమర నుండి వారిని బుకికొల్పి వీఁడు తూర్పునుండి దఁడు వెడలి కొండవీటి నడ కత్తెరలోని పోకచెక్క-నువలె నెన్నిమారులు గత్తిరింపవలెనని చూచినాఁడు; ఆయన్న దేవుఁడు నీతిప్పనాయఁడు వీరిద్దరిసాయముండఁ బట్టి సరిపోయినది. నేటికీపిశాచము పీడ వదలిపోయినది. "లేదు నేటితోనే యీ పిశాచము పీడ ప్రారంభమైన"దని యెవరో యస్పష్ట వ్యక్తి యతనిమనసులోనుండి మాటాడినట్లయ్యెను. వేముఁడా కాన రాని యస్పష్టవ్యక్తిపైఁ గటకటపడెను. అతఁడు బిగ్గరగా "నీయి ష్టము వచ్చినట్లు నీవనుకొమ్ము. గజరావు తిప్పనాయఁడు కాటయ వేముని తల తేనే తెచ్చును. అప్పుడు విశ్వసింతువుగాని. వానితలను జూచినఁగాని నాకు విశ్రాంతిలేదు" అనెను. మఱల మనసులోనుండి "వానితల చూచినప్పటినుండి నీకు విశ్రాంతి యుండ"దని యవ భాసించెను. వేముఁడా యవభావమును లోనికి నదిమికొనెను. కాని యది సెలవేసెను. అతఁడు బిగ్గరగా "నీవేదో నాకమంగళమును నిర్దేశించుచున్నావు. సర్వథా యది యట్లు జరిగితీరదు. పరిస్థితు లన్నియు నాకనుకూలముగనే యున్నవనెను. మఱల మనసులో నుండి "నీవేది మంగళమనుకొనుచుంటివో యది కానేకాదు. నీవను కొనుచున్నది నిజముగా నమంగళము. దానిని నీ సేసేతులఁ బెంచు కొంటి"వని వినిపించెను. వేముఁడు నేను బెంచుకొన్నదమంగళమా? నేనేమిపెంచుకొంటిని? యని ప్రశ్నించెను. మఱల మనసులోనుండి "నీవు కాటయవేమునితో వైరము పెంచుకొంటి"వని జవాబువచ్చెను. వేమున కొడలుమండుకొనిపోయెను. "అవును నేను వానిపైఁ బగ పెంచుకొంటిని. ఆపగకిన్నాళ్ళును శాంతియన్నది దొరుకలేదు. నేఁడు

వానికేల చూచి శాంతి చెందఁగలము." కోమటివేముని కోపమునకు బెదిరిపోయి మనసులోని యస్పష్టవ్యక్తి మఱి మాటాడలేదు. వేముఁడు కవ్వించి కవ్వించి కాటయవేముని తలత్రొక్కెదను నీవేమందువని యడిగెను. కాని సమాధానములేదు. అతనికిఁ గోపము ధూమాయితమై మనసంతయుఁ జీఁకుని పూతవెట్టి మొదలంతయు నుడుకఁబెట్టెను. అతఁడు మందిరమునుండి గబగబ బయటికి నడచెను. అతఁడు గవనుదాటెనో లేదో తురగా రామయ్య మెరుఁగుగాఁ బరువెత్తుకొని వచ్చి "మహారాజా! మహారాజా! యువరాజువారు విజయియై తిరిగివచ్చుచున్నారట. కాటయవేమారెడ్డి తలను బల్లెమునకు గ్రుచ్చి గజరావు తిప్పనాయఁడింగారు తెచ్చుచున్నారట. కృష్ణానది రేవునుండి యిప్పుడే వార్త వచ్చినది. వారు పదిగడియల ప్రొద్దెక్కుసరికిఁ బట్టణము చేరఁగల"రని చెప్పెను. కోమటివేముఁ "డిదిగో వింటివా? యిదిగో వింటివా? కాటయవేముని తల వచ్చుచున్నది చూతువుగాని. ఆతల త్రొక్కిగాని స్నానము చేయ"నని గర్జించెను. తురగా రామయ్య "ప్రభువు వారెవరిపైనో కోపపడుచున్నారు. నేను తురగా రామయ్యను విజయము మనకేల లభించిన"దనెను.

కోవే:— రామయ్యగారూ! ఏన్నాళ్ళకీవార్త వింటిని! మీకీ రత్నహారమును బహూకరించుచున్నాను. ఊరంతయు నలంకారము చేయించి రాజమార్గములఁ గలయంపి సల్లించి ముత్యాలతోరణములు గట్టించి యువరాజుతోడి విజయలక్ష్మికి సముచిత ప్రవేశము గావింపుఁడు. గృహరాజుమేడ లెస్సగా నలంకరింపించి యా విజయలక్ష్మి వందుఁ బ్రవేశపెట్టి నాకుఁ దెలుపుఁడు.

రామయ్య:— మహాప్రభూ! అలంకరణమునకు వలసిన యాజ్ఞ లన్నియు నిచ్చియే వచ్చితిని. మీకీవార్త విన్నవించిపోవుదమని వచ్చినాను.

కో. వే :—అయినచోఁ బట్టపేన్గుపై బంగరు చౌడోలు కట్టి పట్టాశ్వముపై ముఖమల్లు పల్యాణమువేసి యువరాజున కెదుర్కోలు పొండు. ఊరిలోని వారాంగనలు భేరీమృదంగాది వాదనములతో విజయలక్ష్మి నెదుర్కొందురుగాక.

రామయ్య సెలవుదీసికొని వెడలిపోయెను.

పదిగడియల ప్రొద్దెక్కెను. యువరాజు రాచవేముఁడు సపరివారుఁడై పట్టణము సమీపించెను. తురగా రామయ్య యలంకృతములైన గజాశ్వములతో నట్టువరాండ్రతో వాద్యములతో వానికెదురుపోయి స్వాగతి నెఱపెను. యువరాజించుక డస్సియున్నను నతని మొగము మిగుల దీప్తిమంతముగా నుండెను. మహామంత్రి మామిడి సింగన్న యువరాజును జేయిపట్టుకొని పట్టపేన్గు నెక్కించెను. గజరావు తిప్పనాయఁడు పట్టాశ్వమధిరోహించెను. అతనిచేతిలోని బల్లెమునకుఁ గాటయవేముని తల గ్రుచ్చఁబడి యుండెను. తప్పెటలు మ్రోగుచుండగా సొన్నాయివాద్యములు సెలగుచుండఁగా నట్టువరాండ్ర యాటలతో వారందఱు పురప్రవేశము గావించిరి. త్రోవపొడుగున జనులెల్లరు బారులుతీరి నిల్చి యువరాజునకు జయజయధ్వానము లొనరించుచుండిరి. మేడలపైనుండి స్త్రీలు పువ్వులు గురిపించిరి. ఉత్సవము ముల్లగూరిశక్తి గుడియొద్దకు వచ్చెను. అచట నందఱును వాహనములపైనుండి దిగి దేవియెడ గౌరవము నెఱపిరి. ముల్లగూరమ్మకుఁ బదిగొఱ్ఱెల నచట బలిదానముగావించిరి. వీరముష్టివాండ్రు గండకత్తెర వేసికొనిరి. అమ్మవారికి నైవేద్యమై గుగ్గిలపుపొగ వేయఁబడి వారచ్చటనుండి కదలిరి. నైవేద్యమిడిన మీఁదుపుట్ల యన్నము నారెకులు వీరభటులకుఁ బంచియిచ్చిరి. తఱువాత పోతురాజు ముత్యాలమ్మవార్ల గుడులయొద్ద నిట్లే పూజలుగావింపఁబడెను. ఉత్సవము

గృహరాజు మేడను సమీపించెను. యువరాజు పట్టపేన్గు దిగి యచ్చట సిద్ధమొనర్పఁబడియున్న ముత్యాలబుట్టలు గైకొని రెండుగుప్పిళ్ళనిండ ముత్యములను దీసికొని జనసమూహముపై వెదఁజల్లెను. అట్లే దీనారములు వెదఁజల్లెను. నట్టువరాండ్రు క్రోవచూపఁగా యువరాజు గృహరాజు మేడయెక్కెను. తిప్పనాయకాదులు వాని ననుసరించిరి. కాటయవేముని తల బల్లెమునుండి యూడఁదీసి సింహద్వారమున కెదురుగా వ్రేలఁగట్టిరి. తఱువాత నందఱును యువరాజునకు జయధ్వానము గావించిరి. అందఱును మేడదిగి యెవరిదారిని వారేఁగిరి కాని యొక్క గజరావు తిప్పనాయఁడుమాత్ర మచ్చటనుండి కదలలేదు. అతఁడు పోవుచున్న తురగా రామయ్యను బిలిచి మహారాజుతో 'నేనిచ్చటఁ బ్రతీక్షించుచుంటినని చెప్పుఁడు. మహారాజు దర్శనము చేసికాని నేనింటికిఁబోనని చెప్పెను. తురగారామయ్య రాజమందిరమునకుఁ బోవుసరి కచట మహామంత్రి యుండెను. తురగా రామయ్య ప్రవేశించుట కించుక సంకోచించెను. మామిడిసింగన్న వానిని జూచి ఆ "రామయ్యగారూ! సంకోచించెద రేమి మీరు తప్పక రావలసిన సమయము. మీకొఱకుఁ గబురుపెట్టుదమనుకొంటి" ననెను. తురగా రామయ్య ప్రవేశించి "మహామంత్రివారు వచ్చిరి. నాబరువు తీరిపోయిన" దనెను.

మామిడిసింగన్న :— మీరు యుద్ధరంగమునకు సోమదేవ చోడుని బంపినసంగతి నాకుఁ గబురుపంపియుండవలసినది. పోనీ యచటికిఁ బోయిన మాచారెడ్డివారితోనైన వానిని వెనుకకుఁ బంపుమని చెప్పితిరిగాదు. అతనిని యుద్ధరంగమునకుఁ బంపినసంగతి యన్న దేవునకుఁ దెలిసిన నేమనుకొనును!

తురగా రామయ్య :— వానిని బంపక తప్పినదిగాదు. ఆ పరిస్థితి

యట్లనిపించినది. అయినను సోమదేవుఁ డసహాయశూరుఁడు. రెండవ యభిమన్యుఁడు. వాని కేమి?

మామిడిసింగన్న ప్రాణము చివుక్కుమనెను. అతఁడు "మీరు పోయి గజరావు తిప్పనాయనింగారిని నేను రమ్మంటినని త్వరగాఁ జెప్పుడు. అతఁడుపోయినఁగాని మోటుపల్లి మనకు దక్క" దనెను.

తురగా రామయ్యకు నేమి చెప్పవలెనో తోఁచలేదు. అతఁడించుక యాలోచించి "సింగన్నగారూ! అతఁడిప్పుడు గృహారాజుమేడపై నున్నాఁ" డనెను.

సింగన్న :— ఓహో కాటయవేముని తలకుఁ గాపున్నాఁడు గాఁబోలు. అచ్చట మీరుండి యాతనిని బంపుఁడు. తనవిజయముసంగతి ప్రభువులతో నిచ్చటనే మనవి సేయవచ్చును. కోమటివేముఁడు సంగతి గ్రహించెను. అతఁడు "సింగన్నగారూ! మన మేయచ్చటికిఁ బోవుదము. తిప్పనాయనింగారు ప్రతిజ్ఞ సెల్లించిన యుత్సాహముమీఁదనున్నారు. ఆయనను సముచితరీతి గౌరవింపనిచో నతఁ డవమానముగా నెంచును. మనమే పోవుద" మనెను. కోమటివేముఁడు మంత్రులతో గృహారాజు మేడయొద్దకు నడచెను.

తిప్పనాయకుఁడు మేడపైనుండి కోమటివేమునిఁ జూచి క్రిందికి దిగివచ్చి స్వాగతి నెఱపెను. కోమటివేముఁడు తిప్పనాయనిఁ గౌఁగిలించుకొని భుజముదట్టి సమ్మానించెను. అందఱును మేడపైకిఁబోయిరి. తిప్పనాయఁడు కాటయవేముని తలలాగి చేతితోఁ బట్టుకొని పైకెత్తి "యిదిగో! గజరావు తిప్పనాయఁడు, వెలుగోటి రాయపనాయనింగారి సామంతుఁడు వీరనారాయణులకు జగనొబ్బగండలకు నరియరాయ విభాళులకు, సర్వజ్ఞ చక్రవర్తులకుఁ, గొండవీటిసామ్రాజ్యధురంధరులకు శ్రీ పెదకోమటి వేమారెడ్డి మహారాజ సార్వభౌములకుఁ గాటయ

వేముని శిరసు గానుక పెట్టుచున్నాఁ" డని యాతనిచేతి కందిచ్చెను. వేముఁ డాతల చేతితోఁ బట్టుకొని వికటాట్టహాస మొనరించి "ఓహో! కాటయవేమా! యిప్పుడు నీ గర్వమంతయు నేమైనదిరా? నాతోఁ బగయన నేమనుకొంటివి? ఇప్పుడు నీ ప్రభువు కుమారగిరితో మొర పెట్టుకొనుచుండువుగాఁబోలు; కోమటివేముఁడు నా తలద్రొక్కి తన ప్రతిజ్ఞ సెల్లించుకొనెననియుఁ జెప్పుకొను" మని యా తలను నేలపైఁ బడవైచి త్రొక్కుటకు నెడమకా లెత్తఁబోయెను. కాని యతని మనసులో "నోయీ! యాగుమాగుము! ఇది నీకుఁ జాల నమంగళ" మని యస్పష్టముగా భాసించెను. వేముఁ డెత్తిన కాలు క్రిందికి దింపి మనసులోఁ దడుముకొనెను. "మఱల నా కడ్డము వచ్చుచుంటివి. నీవెవ్వరవు?" "నేను జెప్పునది వినుము. నేనెవ్వరని చెప్పుటకు నాకు నామరూపములు లేవు నే నూరక చెప్పితిని. విన్నచో వినుము. ఇది నీ కమంగళము". "నీవెవ్వరవో కనుపింపక వేధించుచుంటివి". "నేను నీకు మేలుచెప్పితిని" "నీ మేలు నేనడుగలేదు. నీవు పిశాచమువలె నన్ను భాధించుచుంటివి". "ఇన్నాళ్లును గాటయవేముఁడు పిశాచ మంటివి. నిజముగా నతఁ డిన్నాళ్ళును గాలేదు. ఒకవేళ నిన్నతఁడు బాధించిన నేటినుండి బాధించును. వానితలద్రొక్కుము నీకచ్చమైన బాధ మొదలగును. ప్రాణమున్న కాటయవేమునికంటె నిర్జీవమైన యీశిరస్సే నిన్నెక్కువ బాధించును". "నీవు నాకు విరోధివి. శత్రు పక్షమున మాటాడుచున్నావు. నీవు కాటయవేముని పిశాచమవా?" "ఓయీ! నీకుఁ బిశాచమన నేమియో యిప్పుడుచెప్పి లాభములేదు. అది నీకుఁ గొద్దిలోఁ దెలియఁగలదు."

వేమునకీ సంభాషణమంతయు క్షణములో జరిగినట్లు తోఁచెను. ఆతనిమొగమునఁ గలవరముతోఁచెను. మామిడిసింగన్న యాతని

మొగమును జాగ్రత్తగా నుపలక్షించి "ప్రభువుల ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరినట్లే. తలత్రొక్కుటయన్నదూరక లాంఛనప్రాయమేగదా! త్రొక్కినను ద్రొక్కకున్నను నొక్కటియే" యనెను. కోమటివేముఁడు దన్నుదాను సంబాళించుకొనెను. అతని మనసున బయటఁబడిపోతినని రోషము బయలుదేరెను. అది మనసంతయు నావరించి యతని కొడలు తెలియకుండఁజేసెను. ఆస్థితిలో నతఁడేమిచేసెనో యతనికిఁ దెలియ లేదు. గజరావు తిప్పనాయఁడతనిని బట్టుకొని "ప్రభూ! చాలు చాలు కాటయవేముని తల మీ కాలికిఁ గందుకప్రాయమైన" దనుచు బల ముగా నాపెను. వేమున కొడలు తెలిసి చూచుసరికి కాటయవేముని తల గోడమూల నొదిగియుండెను. ఆ తలలోనుండి యర్థనిమీలితమైన కన్నులు తీక్ష్ణములై చూచుచున్నట్లుండెను. పండ్లు బిగిసికొనిపోయి దవడలు లోనికినొక్కికొని మొగమంతయు నెఱ్ఱనై బొమలు ముడివడి ముక్కు తర్జనివోలె నిక్కవాడిచికొని కొఱకొఱ లాడుచున్నట్లు కన్పట్టెను. కోమటివేముఁడు రొజుచు మామిడిసింగన్నతో "దీనిని ద్వారబంధమునకు వ్రేలఁగట్టించి కాపుపెట్టించుఁడు. మోటుపల్లి నుండి మాచారెడ్డి వచ్చినతర్వాత దీని నాకసమునఁ గట్టించి గ్రద్దలకు బలిపెట్ట వలె" ననెను.

సింగన్న :— మహారాజా! మీరిప్పుడు వ్యగ్రులై యున్నారు. మీ రింటికిఁబోయి విశ్రాంతి తీసికొనుఁడు. కార్యపద్ధతి తిప్పనాయనిం గారితో నాలోచించెదను.

కో. వే :— నాకావేద మేమియునులేదు. నిశ్చయముగా మనకు జయములభించితీరగలదు. మోటుపల్లికిఁ జౌండపామాత్యుఁడు దండెత్తి నాఁడట. చౌండపామాత్యుఁడు గాదు. ఈశ్వరుఁ డెత్తి వచ్చినను మనము జయింపఁగలము.

సింగన్న :— ఇప్పుడు మనమచ్చుటికి నదనపు బలములు పంప వలయును. కై జీతగాండ్రను నెక్కటివారిని సన్నాహపెట్టుఁడని యాజ్ఞాపించితిని. మన కీపర్యాయముగూడఁ దిప్పనాయనింగారు సాయ పడవలెను. వెనుకఁ జౌండపామాత్యుని దిరుగఁగొట్టినది తిప్పనాయనిం గారే కదా!

తిప్పానాయఁడు :— చౌండపామాత్యుఁ డీపర్యాయము గూడ వచ్చినాఁడా! అయినచో నాకుఁ జెప్పలేదేమి? సైన్యములోఁ జాల భాగము రాయపనాయనిగారివెంట వెడలిపోయిరి. ఇపుడు నేనొక్కఁ డను బోయి యేమిచేయుదును? నావెంట సెలగోలవారలు మాత్ర మున్నారు.

సింగన్న :— కై జీతగాండ్రను నెక్కటివారను నేను సిద్ధము సేయింతును. అన్న దేవచోడమహారాజు కుమారుని సోమదేవచోడుని నక్కడికిఁ బంపినారఁట. అది చాల తెలివితక్కువపని. నాకిచ్చటికి వచ్చినతర్వాతఁ దెలిసినది. తమరచ్చటికిఁ బోయినఁగాని యిది సద్దు కొనుటకు వీలులేదు.

తిప్పానాయఁడు :— ఇంతవఱకుఁ బొరపాటుజరుగనిచో నేను సద్దుకొనఁగల్గుదును. నాచేతిలో నెక్కటివారులేరు. వారున్నచో నేను వెనుకాడవలసిన పనియుండదు. సరియే. నేను సాయంతనమే బయలు దేరిపోవుదును. ఎక్కటివారలను బంపుఁడని రాయపనాయనింగారికిఁ గబురువెట్టుఁడు.

తిప్పనాయఁడు కోమటివేమునివంకఁ జూచెను. వేమునిదృష్టి మూలపడియున్న కాటయవేముని తలపై లగ్నమైయుండెను. తిప్ప నాయఁడు "మహారాజా! నేను సెలవుదీసికొందుననెను. కోమటి వేముఁ డన్యమనస్కముగా నూకొట్టెను. మామిడిసింగన్న యొక సేవకుని

బిలిచి తలను భద్రపఱుపుమని యాదేశించెను. తిప్పనాయఁడు వెడలి పోయెను. మామిడిసింగన్న ప్రభువును బ్రబోధించి రాజమందిరమునకుఁ దీసికొనిపోయెను.

# 3

కోమటివేముని రాజమందిరమున డించి మామిడిసింగన్న వెడలి పోయెను. క్రోవ నడచినంతకాలము వేముని మనసు మనసులోలేదు. ఆ మనసునందు వట్టి పరిభ్రమణముతప్ప ననుస్యూతముగా సాగిన యొక యాలోచనలేదు. అతఁడెట్టులింటికిఁబోయెనో యెట్లు స్నానము చేసెనో శివపూజాదు లెట్లు నిర్వర్తించెనో యతనికిఁ దెలియదు. మన స్సాన్నిహిత్యము లేకయు నభ్యాసవశమున నతని శరీరమీ యన్ని పనులు గావించెను. శివపూజ నిర్వర్తించి యతఁడు మేడపైని చంద్ర శాలలోనికిఁ బోయెను. అప్పటికి సరిగాఁ బదునారు గడియల ప్రొద్ద య్యెను. అది కోమటివేముఁడు భోజనముసేయు సమయము. అతఁడు భోజనశాలకుఁ బోకుండ మేడపైకిఁ బోవుటఁగాంచి పరిచారికలు మిక్కిలి యచ్చెరువడిరి. అతఁడిట్లెప్పుడు నొనర్చియుండలేదు. సాధా రణముగా నతఁడు బ్రాహ్మముహూర్తము మొదలుకొని నాల్గుగడి యల ప్రొద్దెక్కునందాక పాశుపతదీక్షలోఁ గూర్చుండియుండును. అనంతరమతఁడు కొలువిచ్చి వచ్చి మఱల శివపూజాతత్పరుఁ డగును. పదునాఱు గడియలైనఁగాని శివార్చనము ముగియదు. అతఁ డా మడి బట్టలతోడనే గృహదేవతలకు బలులొసంగి భోజనము నిర్వర్తించును. నేటి ధోరణి దానికి విపరీతముగ నుండెను. నేఁడు పదిగడియల ప్రొద్దె క్కునందాక నతఁడు స్నానమే చేయలేదు. ఈ వింతప్రవర్తన మొద యము నుండియుఁ బరిచారికలు పసిగట్టుచునేయుండిరి. కాని వారెవ రును వేమునియొద్దకుఁబోయి భోజనము సేయుమని నివేదింపలేరైరి.

వేముఁడు సరాసరి చంద్రశాలలోనికిఁ బోయెను. అతఁడచట ముందుచావడిలో నొకగడియకాల మటునిటు తిరుగాడి తరువాతఁ బడకగదిలోనికిఁబోయి తల్పముపైఁ బరుండెను. ఇంతకాల మతని మనసులోఁ జెప్పరానియొక యావేదనము తప్ప మఱేమియు లేదు. అతఁడా యావేద మణచుకొనుటకు మిక్కిలి ప్రయత్నించుచుండెను. కన్నులు గట్టిగా మూసికొని దిండుపైఁ దలయుంచి పైనిఁ గుడిబుజము పెట్టి గట్టిగా నొత్తికొని మనసును నిలుకడచేసికొనుటకుఁ బ్రయత్నించెను. కాని లాభములేకపోయెను. కన్నులు మూసికొన్నంతసేపును నతని కన్నులయెదుటఁ గాటయవేముని తల వికారముగఁ గన్పించుచుండెను. చూచినకొలఁది దాని వికారము మరింత రూపుగట్టుచుండెను. కఱచుకొని పోయిన యా పండ్లు, తర్జనివోలె బిగిసి బెదరించుచున్న యా ముక్కు, నన్నిటికంటె మించి యర్ధనిమీలితములైన కన్నులనుండి వెలువడుచున్న యా చూపులు, నొక గాఢమైన ప్రతీకారవాంఛారేఖ యా మొగమంతట నుల్బణమై తోఁచుచుండెను. వేముఁ దానివంక గొంతసేపట్లే చూచెను. తన దృక్పథమునుండి దానినిఁ బాఱఁద్రోల నెంచెను. కాని యది పోలేదు. అతఁడు చేయునదిలేక కన్నులు తెఱచెను. తల్పముపైనుండిలేచి గదిలో నటు నిటు తిరుగాడెను. కాని మనసున నావేదమిసుమంతయుఁ దగ్గలేదు. కన్ను మూసినను దెఱచినను గాటయవేముని తలయొక్కటియె కన్నులకుఁగట్టినట్లు కన్పించుచుండెను. ప్రభు వెంతసేపటికి భోజనమునకురామి బానసీంద్రు విసివికొనుచుండిరి. ప్రభువువారి భోజనమైనసంగతి తెలిసినఁగాని మహారాణి భుజించదు. ఆవార్త తెలిసికొనిపోవుటకు మహారాణి మందిరమునుండి పరిచారిక వచ్చెను. బానసీంద్రు ప్రభువు భోజనముసేయనిసంగతి యామెకుఁ జెప్పిరి. ఆమెపోయి రాణికాసంగతి నివేదించెను. రాణి కారణమడిగెను. పరిచారిక నిరుత్తర యయ్యెను. రాణి మఱికొంత

కాలము ప్రతీక్షించెను. అప్పటికిని ప్రభువు భుజించినవార్త రాలేదు. ఆమె పరిచారికను గారణమేమియో కనుగొనిరమ్మని మఱలఁ బంపెను. పరిచారిక తిరిగివచ్చి ప్రభువు వింతప్రవర్తనము నెఱింగించెను. రాణి యాలోచించెను. ప్రభువు మిగుల మనస్వి. కాటయవేముని తలచూచి యాయన మనసు పరితాపపడుచున్నదేమో? ప్రభువులను బ్రబోధింప వలయునని యెంచి యామెయొక పరిచారికను గన్యకాంతఃపురమునకుఁ గబురువెట్టెను. కన్యకాంతఃపురమునుండి వేమాంబ రాణిమందిరమునకు వచ్చెను. రాణి వేమాంబకు సంగతియంతయుఁ జెప్పి "అమ్మా! నీవు కొంచెము సంగీతముపాడి మహారాజునకు విశ్రాంతి కల్పించిర" మ్మని పంపెను.

వేమాంబ మహారాజుమందిరమునకుఁ బోయెను. పరిచారిక వీణతో నామెననుసరించెను. వేమాంబ చంద్రశాలపైకిఁబోయెను. పైన గదితలుపు లోరగా వైచియుండెను. ఆమె లోనికిఁ జూచెను. లోన వేముఁడటునిటు పచారుచేయుచుండెను. వేమాంబ ద్వారబంధము కడ నిల్చి "నాన్నగారూ! నాన్నగారూ!" అని మెల్లగాఁ బిలిచెను. వేముఁడు పలుకలేదు. ఆమె కొంచెమూఁగి మఱలఁ బిలిచెను. కాని జవాబులేదు. ఆమె మెల్లగా లోనికేఁగి తండ్రిబుజముపై చేయియిడి 'నాన్నగారూ' అని మఱలఁబిలిచెను. వేముని మనస్సు బహిస్స్ఫృతి పొందెను. అతఁ డామెవంక విచిత్రముగాఁ జూచి యిదియేమమ్మా నీవిప్పుడు వచ్చితివనెను.

వేమాంబ :— ఊఱక యేవచ్చితిని. మీదర్శనముచేసిపోవుదమని వచ్చితిని. మీరేదియో తీక్ష్ణముగ నాలోచించుచున్నట్లున్నారు. నేను బోవుదునా?

వేముఁడు :— అక్కఱలేదమ్మా! నేనేమి యాలోచించుటలేదు. నీవేమైనఁ బనికల్గి వచ్చితివా?

వేమాంబ :— పెద్దపనియేమియు లేదు. ఏదియోయొక చిన్ని సందేహముగల్గినది. మీరు మిక్కిలి బడలినట్లున్నారు. భోజనము చేసినట్లులేరు. తఱువాత నివేదింతును.

వేముఁడు :— నేను భోజనముసేయలేదా? అవునవును. నాకిపుడు గుర్తువచ్చుచున్నది. అయినను నేఁడు నాకాకలిలేదమ్మా! నేడింక భోజనముసేయను.

వేమాంబ :— భోజనముసేయకున్న మానె. మీరుకొంచెము పాలైన ప్రాశింపుఁడు. బడలిక తగ్గును.

ఆమె పరిచారికను బిలిచి దుగ్ధము తెప్పించెను. వేమారెడ్డి కొంచెముపాలుత్రాగి యమ్మా! నీసందేహమేమియో చెప్పుమనెను.

వేమాంబ :— ఏమియునులేదు. మీ రిరువదిరోజులక్రిందట నాకు సంగీతపాఠములు చెప్పితిరి. అప్పుడు రెండువిషయములను జెప్పితిరి. ఆరెంటిలోనొకటి యనుభవమునకువచ్చినది. రెండవది యెంత యభ్యసించినను ననుభవములోనికి రాలేదు.

వేమారెడ్డి :— నీకుఁబాఠముచెప్పి యిరువదిరోజులైనదా? ఈ రాజకీయములతొందరలో నీపాఠముసంగతి మఱచియేపోతిని. నేనేమి చెప్పితినోకూడ నాకు గుర్తులేదమ్మా!

వేమాంబ :— రసరాగములకు మేళనముచేయుట యెట్లోచెప్పితిరి.

వేమా :— అవునవును. అది రెండువిధములు. ఒకటి ప్రత్యేక రసవ్యంజకమైన కీర్తనకు రాగ మేళనముచేయుట, ప్రత్యేకము రాగము నందేరసవ్యక్తికల్పించుట. ఈరెండుపద్ధతులనుగుఱించి చెప్పితినిగాఁదా!

వేమాంబ :- అవును. రసవ్యంజకమైన కీర్తనకు రాగమును మేళవించుట కుదిరినది, కాని వట్టి రాగమునందు రసమును మేళవించుట తెలియలేదు.

వేమా :- అమ్మా! దానినిగురించి నీకొకసారియే చెప్పితిని. రాగరసముల మేళనము సంగీతవిద్యలోఁ బరమరహస్యమైనది. దానిని గుఱించి నేను సంగీతచింతామణియందు మిపులఁ బ్రపంచించితిని. అందనేక భూమికలున్నవి. వానిని గ్రమముగా సాధనముచేయ వలయును. ఆసాధనకుఁ బోవుటకుఁ దొలిమెట్టు కీర్తనగతమైనరసమునకు రాగమేళనము. అది బాగుగా నభ్యసించిన వట్టి రాగమునందు రస మేళనము చేయవచ్చును. రాగమునందు రసానుభూతియే సంగీతవిద్యకుఁ జరమఫలము.

వేమాంబ :- నేనా తొలిమెట్టినాళ్ళనుండియు నభ్యసించితిని. కొంచెముపాడి వినిపింతునా?

ఆమె తండ్రివంక మెత్తగాఁజూచెను. వేముఁడామె సరళస్వభావమునకు మనసునందుఁ బులకించెను. అతని మనసులో సోమదేవ చోడుఁడు మెఱసెను. వేమాంబ వీణియను గల్యాణిరాగమునకు మేళ వించి యొకకీర్తన పాడెను. ఆకీర్తన యొకగోపిక శ్రీకృష్ణునికై చెలికత్తెను గబురంపుచుఁ బలికినది. కీర్తనయందలి యనునయార్థము విప్రలంభశృంగారమును దెలియఁజేయుచుండెను. గీతార్థమైన యా విప్రలంభమును గల్యాణిరాగము పొంగులార్చి చూపించెను. వేమాంబ మెత్తనిగొంతుకలో గల్యాణిరాగము క్రొత్తవిరుపులు విరిగి యొయ్యారముగా నుయ్యాల లూగెను. కీర్తనపాడుట యైపోయెను. ఆమె వీణను గ్రిందఁబెట్టి తండ్రిమొగమువంకఁ జూచెను.

వేమారెడ్డి :— చాలబాగున్నదమ్మా! చక్కగా నభ్యసించితివి. కీర్తనయందలి సాహిత్యము పస చెడకుండ రాగమెట్లుదుకవలెనో నీకు బాగుగఁ దెలిసినది. రసరాగముల మేళనమునం దిది తొలిమెట్టు. నీవిది యింకను బాగుగ నభ్యసింపుము. వట్టిరాగమునందు రసమేళనము తరువాతఁ జెప్పెదను.

వేమాంబ తండ్రియనుజ్ఞదీసికొని వెడలిపోయెను.

కూఁతుతోడి సంభాషణము వేముని మనసునకుఁ గదలిక తెచ్చెను. అతఁడు పోవుచున్న కూఁతునుజూచి పిల్ల మిక్కిలి యమాయికురాలు దాని మనసుమఃకాలమునందలి సన్నజాజిమొగ్గవంటిది. ఏమాత్రము కష్టమును సహింపలేదనుకొనెను. మఱల నతనిమనసున సోమదేవ చోడుని యుద్ధమునకుఁబంపుట తనది మిక్కిలి యవివేకము. మాచా రెడ్డి యట్లేయనెను. మహామంత్రియు నట్లేయనెను. తాను మిక్కిలి తప్పిదమే కావించెను. అతఁడు మిక్కిలి సాహసి. ఏమో యేదియెట్లు జరుగునో? అతఁడు తిరిగివచ్చునందాక నమ్మకములేదు. గజరావు తిప్పనాయఁడు పోవునంతవఱకుఁ జేయిదాటకుండెనా భయములేదు. నిజముగా గజరావు తిప్పనాయఁ డొకఁడు ప్రతివిషయమున దేవునివలె నడ్డుపడుచున్నాఁడు. పాపమతఁడు ప్రతినసెల్లించిన మొదటియుబ్బు తీరకుండఁగనే యుద్ధరంగమునకుఁ బోవలసినవాఁడయ్యెను.” ఆ తలఁపు వచ్చుటతోడనే మఱలఁ గాటయవేమునితల యతనియెదుటఁ బ్రత్యక్ష మయ్యెను. మఱల నతనిమనసులో నావేదనము ప్రారంభ మయ్యెను. వేమాంబయున్న కొంచెముకాలము నతనికి విశ్రాంతి యొదవెను. ఇప్పుడు వేమాంబ వెడలిపోయి యతఁ డొంటరియై యతని మనసు తత్పూర్వపరిస్థితికి వశమయ్యెను. కోమటివేముని కొంటరితనము భరింప రానిదయ్యెను. అతఁడు మేడమెట్లయొద్దకుఁబోయి యొకసేవకుని బిలిచి

సమయమెంతయైనదో కనుఁగొని రమ్మనెను. సేవకుఁడు హజారము నకుఁబోయి నిముసములమీఁదఁ దిరిగివచ్చి యింక నాలుగడియల ప్రొద్దుమాత్రమే మిగిలియున్నదని చెప్పెను. అది సరిగా వేముఁడు పురాణశ్రవణముచేయు సమయము. రాజకీయముల తొందరపాటువలన నతఁడు రెండుమూఁడునెలలనుండి కవిపండితగోష్ఠి యొనరించుటలేదు. అప్పుడప్పుడు తీఱికచేసికొనిమాత్రము వేమాంబకు సంగీతపాఠములు చెప్పెడివాఁడు. వేముఁడు స్వయముగాఁ గవి. పండితుఁడు. అతనికి శాస్త్రచర్చలకంటెఁ గవితాగోష్ఠులకంటెఁ బురాణశ్రవణమునందభిలాష యెక్కువ. ఆస్థానమునందు విద్యాధికారిపదవియందున్న శ్రీనాథుఁడు నిత్యమాయనకుఁ బురాణము చదివి వినిపించును. వేముఁడా సేవకునితో శ్రీనాథయ్యగారిని భారతము దీసికొనిరమ్మని చెప్పుమనిపంపెను.

గడియకాలములో శ్రీనాథుఁడువచ్చెను. వేముఁడు సగౌరవముగా వాని నాహ్వానించి కూర్చుండఁజేసెను.

వేముఁడు :— నాకీ రెండుమూడునెలలనుండియు విశ్రాంతిలేదు. మనము పురాణగోష్ఠిచేసి చాలరోజులైన దనుకొందును.

శ్రీనాథుఁడు :— ప్రభువులు కార్యాంతరమగ్నులై యుండుట విని దర్శనము సేయలేదు.

వే :— శ్రీనాథయ్యగారూ! ఈ బాధనుండి బయటపడుటకు నా మనసు తహతహపడుచున్నది.

శ్రీ :— నిజమాలోచించిన నంతే. ప్రభువులకు సంగీత సాహిత్యములందున్న యాభ్యాసికసుఖము మాయెల్లరకుఁ దెలిసినదే.

వే :—ఈ రాజ్యపాలము వట్టి యాభిమానికసుఖమే. నిజముగా దీనియందేమున్నది. నేను రాజను, మహారాజను. వానిని జయించితిని

వీనిని జయించితి ననుకొనుటతప్ప మఱేమియును లేదు. ఆ యనుకొన్నంత కాలము మనసునందు దురభిమానము పొంగునారి, గర్వమట్టుకట్టి శరీరమునకు పూదకమై సుఖమనిపించును. ఆ యభిమానమునకు దెబ్బ తగిలెనా యాయనుకొనుట యనుకొనుటయై యాసుఖము దుఃఖమై పోవును.

శ్రీ :-ప్రభువులు చక్కగాఁ జెప్పితిరి. రాజ్యపాలనమునందుఁ దమ మనసు విముఖమగుచున్నది.

వే :-శ్రీనాథయ్యగారూ! నేనీబాధనుండి బయటపడుటకుఁ దొందరపడుచుంటిని. ఈ మోటుపల్లియుద్ధము తేలిపోయిన బాగుండును. దానికొఱకుఁ జూచుచుంటి నింతే.

శ్రీ :-అవును. నేనువింటిని. మహామంత్రి మామిడిసింగన్నగారు మొన్న నాతో నన్నారు. యువరాజువారికిఁ బ్రభువులు పట్టము గట్టు నుద్దేశముతో నున్నారటగాదా? అది చాల బాగున్నది. కాటయవేముని తలతీయించుటతో మఱలఁ గొండవీటి రాజ్యము సింహాచలపర్యంతము విస్తరించినట్లే, పడమట విజయనగరరాజుల నొత్తుట యొక లెక్కలోనిదిగాదు. శత్రువన్న నిజముగాఁ గాటయ వేముఁడొక్కఁడే. ప్రభువులతని తలతీయించి ప్రతిన సెల్లించితిరి.

ఆమాటలు విని వేమారెడ్డికెందుకో తాను బాపకార్యము చేసితిననిపించెను. "అవునవును నేను వానితల తీయించితిని. నేనువాని తలతీయించితి"నని యతఁడు రెండుమూడు తడవలు తలయాడించి నిట్టూర్చెను. శ్రీనాథుఁడు వేముని మొగమువంకఁజూచెను. వేముని మొగము వాడియుండెను. కన్నులు లోతునకుఁ బోయియుండెను. శ్రీనాథుఁడు ప్రభు వేదో మానసికముగా బాధపడుచున్నాఁడని

గ్రహించి తాని దెచ్చిన గ్రంథమును విప్పి పుటలుత్రిప్పుచు 'నేభాగ మును జదువుమన్నా' రని యడిగెను.

వే :— అది యేపర్వము ?

శ్రీ :— శల్యపర్వము.

వే :— అయిన భీమదుర్యోధనుల గదాయుద్ధము చదువుఁడు.

శ్రీనాథు డాభాగమునుదీసి రెండుగడియలు శ్రావ్యముగాఁ జదివి వినిపించెను. భీమదుర్యోధనుల గదాయుద్ధమైపోయెను. దుర్యోధనుఁడు తొడలువిఱిగి భూమిపైఁ బడియుండెను. భీముఁడు కోపమాపలేక దుర్యోధనుని తలదన్నెను. ధర్మరాజు భీముని 'నది మిగుల పాపకార్య' మని మందలించెను. ఆఘట్టము విన్నంతకాలమును వేముని మొగమున విచిత్రభావపరంపర మెఱసెను. శ్రీనాథుఁడు చదువుటయాపి వేమునివంకఁ జూచెను. వేముని కనుఁగొలకుల నీరు నిల్చియుండెను.

అప్పటికి సాయంతనము గావచ్చెను. ప్రొద్దెక్కిలుతోలుచుండెను. శ్రీనాథుడు సెలవుదీసికొని వెడలిపోయెను. వేముఁడట్లే పదినిముసములు గూర్చుండి తఱువాత లేచి యటునిటు తిరుగుచు నాలోచించుచుండెను. అవునవును. అది మిగుల పాపకార్యమే. ఆదుర్యోధనుఁడు తొడలువిరిగి పడిపోయెను. అతఁడు మిగుల నిస్సహాయస్థితిలో నున్నాఁడు. వానితల తన్నినను దన్నకున్న నొకటే. తన్నకుండుట యౌదార్యమును సూచించును. తన్నుట క్రోధమును సూచించును. క్రోధము క్రౌర్య కారణము. క్రౌర్యము పాపకారణము. నిజముగా నట్టిపని చచ్చిన పామును జంపుటవంటిది. ధర్మరా జుదారుఁడుగాన నింతవిచారించెను. నేనింత విచారించలేకపోతిని. నామనసు న గాటయవేమునిపైఁ గోపమున్నది. ఆకోపముచే వానితల త్రొక్కుదునని ప్రతినపట్టితిని. ఆప్రతిన

చెల్లించుటలోఁగూడఁ గోపమే చూపించితిని. భీముఁడు నట్లేచేసినాఁడు. ఒకప్రతినపట్టితిమి. దానికిఁ గోపము కారణము గావచ్చును. దానిని జెల్లించుటలో నుత్సాహముండవలెనుగాని కోపముండరాదు. ఉత్సాహముండుటధీరోదాత్త లక్షణము. కోపము ధీరోద్ధత లక్షణము. కావున భీమాలంబకమై రౌద్రరసమే ద్యోతకమగుచున్నదిగాని వీరరసముగాదు. నేనింత రసవిచారమును జేసితిని. ఈ సాహిత్యమునుగుఱించి యింత చక్కఁగా విచారించినవాఁడు మఱియొకఁడు లేఁడని ప్రసిద్ధిపొందితిని. పండితులందఱు నేనువ్రాసిన సాహిత్యచింతామణిని ప్రామాణికముగా గ్రహింతురు. ఇట్టినేను గాటయవేమునితల తన్నుట మిక్కిలి యనుచితము. వానితలపన్నినపాపము మనసునుండి నేనెట్లు కడిగివేసికొందును? అతఁడునేను జిన్నప్పుడు మిక్కిలిస్నేహితులము. ఒక కంచమునఁదిని యొకమంచమునఁ బండితిమి. నేనునతఁడు కుమారగిరి మువ్వురము నొక్కగురువుకడ విద్యాభ్యాస మొనరించితిమి. ఒక్కగురువుకడ సంగీతము నేర్చితిమి. ఒక్కగురువుకడ సాహిత్యము నేర్చితిమి. విలువిద్యయు ఖడ్గవిద్యయు నొక్కగురువుకడనే నేర్చితిమి. అనవేమారెడ్డిప్రక్క, యుద్ధములలో మువ్వురముగలిసి పోరాడితిమి. మేము మువ్వురము విఱిచికొనిపడిన గజపతి కరులదండు, నరపతి నరులదండు, నశ్వపతి గుఱ్ఱములదండు విఱిగిపాఱిపోయెడివి. మామువ్వురనుజూచుకొని యనవేమారెడ్డి మిక్కిలి పొంగిపోయెడివాఁడు. 'నాయనా! యీ రెడ్డిరాజ్యమంతయు మీరుమువ్వురు, కందుకూరి కోమటిరెడ్డితో నల్వుర భుజములమీఁద నాధారపడియున్న' దనుచుండెడివాఁడు. ఆ కందుకూరి కోమటిరెడ్డికి మాకును జిన్నప్పుడు పడుచుండెడిదికాదు. యుద్ధములలో మేము మువ్వుర మొక్కప్రక్కపోరాడిన నతఁడింకొకప్రక్క పోరాడెడివాఁడు. వేమారెడ్డి మాకున్న విరోధమును బసికట్టి మా మువ్వురను గలిపి యాతనిని వేఱుగాఁ జెప్పుచుండెడివాఁడు. మేము నల్వురము

గలిసియుండవలెనని సూచించుచుండెడివాఁడు. కాని యీయొక్క సంఘటనతోఁ గాటయవేమునకు నాకుఁ జెడినది. ఆయన వేమారెడ్డి యీగృహరాజుమేడను మొదలుపెట్టుకున్నను బాగుండెడిది. ఆనాఁడు ముల్లగూరమ్మవారి ప్రభ యూరేగించితిమి. కోమటిరెడ్డి నందికంత పోతరాజు కటారిని బట్టుకొని ముందు నడచుచుండెను. మేము మువ్వురము ముష్టీంద్రచేత సాము చేయించుచు నుత్సవమునకుముందు నడచుచుంటిమి. ఉత్సవము పోతరాజుగుడిని సమీపించినది. అచట నాదొడ్డారెడ్డితో వచ్చిపడినది. మొదటినుండియు నీ దువ్వూరి రెడ్లు మాలో మాకుఁ గలహములు పెట్టవలయునని చూచుచుండెడి వారు. పైకి వట్టి కోడిగమున్నట్లు మాట్లాడెడివారు. ఆ దొడ్డారెడ్డి నన్ను గొమరగిరిని కవ్వించెను. "అరే! మీ యిద్దరిలో నెవ్వఁడు గెల్చునో చూడవలయునురా! ఒకవరుసచేయండి" యన్నాఁడు. కాటయవేముఁ డూరకుండవచ్చునా! అతనిమనసులో నట్లున్నదని నాకంతవఱకుఁ దెలియదు. "కొమరగిరియు నతఁడు సేయుటయేమి? కొమరగిరి వీరన్నపోతారెడ్డి కుమారుఁ" డన్నాఁడు. దొడ్డారెడ్డి "పోనీ! నీవును గోమటివేముఁడును జేయుం" డన్నాఁడు. కొమరగిరి రాజకుమారుఁడైనచో నేనుమాత్రముగానా? నాకొడలు మండుకొని పోయినది. "నేను నాపక్షమున గజరావుతిప్పనాయని నిల్పెద"నంటిని. కాటయవేముఁడు దనపక్షమున నల్లాడరెడ్డిని నిల్పుదునన్నాఁడు. తిప్పనాయఁడును నల్లాడరెడ్డియుఁ గత్తిసాము చేసిరి. పాకము ముదురకుండఁగనే యావరుస ముగిసినది. తఱువాత ముల్లగూరమ్మ గుడియొద్దకు వచ్చునరికి వారిలో వారేమాలోచించికొనిరో! ఈపర్యాయము కాటయవేముఁడేవచ్చి బరిపై నిలువఁబడెను తిప్పనాయని కొడలుమండుకొని పోయి యతనితోఁ దలపడెను. తిప్పనాయఁడతనిచేతితోఁ గత్తి నెగుఱఁగొట్టి నిముసములోఁ దిరిగి తనబరిమీఁదికిఁ బోయెను. దొడ్డారెడ్డి

కాటయ వేమునికిఁ దనక త్తిగిరవాటువై చెను. వేముఁడు గొండాటముగాఁ గత్తికలుపుచునే యెడమకాలితోఁ దిప్పానాయనికాలు మెలిపెట్టెను. తిప్పనాయఁడతఁడట్లు సేయునని యెట్లూహించును? అతఁడు క్రిందఁ బడెను. కాటయవేముఁ డతని చేతిలోఁ గత్తి నెగులఁగొట్టెను. ఆ దుర్వ్యారిరెడ్లందఱును జప్పట్లు చరచిరి. అది మొదలు. అప్పటినుండి వచ్చిపడినది. తిప్పనాయఁడప్పుడు పట్టిన ప్రతిన. ఆవిరోధమింతదూరము వచ్చినది. కాటయవేముఁ డప్పటినుండి నన్ను నిద్రపోనిచ్చినాఁడుగాదు. న్యాయమునకు నాతప్పేమియులేదు. ఇంతకును గారణసామగ్రి యంతయు దానియంతట నదికూడివచ్చినది. ఎంతస్నేహమునకంత విరోధమన్నట్లు పరిణమించినది. అవునవును మేమిద్దఱమును ప్రాణస్నేహితులము. ఆ స్నేహముకంటె నీవిరోధమే యెక్కుడైనది. నాచేత వానితలఁ దన్నించినది. అవునవును. నేను వానితలఁ దన్నితిని. తలఁదన్నితిని. ఇంతదూరము రావలసినదిగాదు.

"ఇంతటితో నాఁగుననుకొంటివా? ముందున్నదిముసళ్ళపండుగ" కాటయవేమునితల బొమలు ముడివైచి తీక్ష్ణముగాఁ జూచుచు వికారముగ నవ్వెను.

## ౪

మఱి వారముదినములు గడచెను. ఈ వారముదినములలో మామిడిసింగన్న వెల్లటూరునకుఁ గబురంపి యొకకోటివారలను గైజీతగాండ్రను ప్రోగుజేసి మోటుపల్లికిఁ బంపెను. రాజమహేంద్ర వర యుద్ధరంగమునుండి తిరిగివచ్చెడు సైన్యముల నెప్పటికప్పుడు మోటుపల్లికి దుమికించెను. ఈ వారముదినములలో నతనికి క్షణమైనను దీఱికలేకపోయెను. ఒకనాఁటి సాయంతనవేళ రాజమహేంద్ర వరమునుండి యొకవార్త వచ్చెను. అన్నదేవచోడుఁడు రాజమహేంద్ర

వరము నాక్రమించుకొని కాటయవేముని కొమరుఁడు కొమరగిరిని బందీగా బట్టుకొనెనట. కాటయవేముని వియ్యమగు నల్లాడరెడ్డి గొప్ప సైన్యమును బ్రోగుచేసి రాజమహేంద్రవరము మఱల నాక్రమింపఁ జూచుచుండెనఁట. అతఁడు గజపతితోఁగూడ రాయబారములు నెఱపుచుండెనఁట.

అంతవఱకు రాజమహేంద్రవరయుద్ధమునందు విజయము లభించి సందులకు సింగన్న మహానందమందుచుండెను. అతనికిని గాటయవేమునికిని బ్రాణవిరోధము. కాటయవేముని తలగొట్టించి సింగన్న యతనిపైఁ బగతీర్చుకొనఁగలెను. ఇంతపగకుఁగారణము కాటయవేముఁడతనికి వంశపారంపర్యముగ వచ్చు మంత్రిత్వమును దొలఁగించుట. మంత్రి సింగన్న పూర్వులు ప్రోలయవేమునినాఁటినుండి వంశానుక్రమముగ మంత్రిత్వము నెఱపిరి. మామిడిసింగన్న యనవేమారెడ్డి చనిపోయినతఱువాతఁ గొండవీటిరెడ్లకు సంభవించిన కుటుంబకలహములోఁ గోమటివేముని పక్షమునఁ జేరెను.

కొండవీటిరెడ్లందఱకును మూలపురుషుఁడు ప్రోలయ. ప్రోలయకు మాచయ, వేమారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి, మల్లారెడ్డి యని యైదుగురు కుమారులు. వారందఱునుగూడి రెడ్డిరాజ్యమును నిర్మించిరి. పెద్దవాఁడగు మాచారెడ్డికిఁ గోమటివేమారెడ్డి మనుమఁడు. రెండవవాఁడగు వేమారెడ్డికిఁ గొమరగిరిరెడ్డి మనుమఁడు. ఈకొమరగిరిరెడ్డికిఁ గాటయవేమారెడ్డి బంధువు. కొమరగిరికతఁడు మేనత్తకుమారుఁడగుటయేగాక యాతనిచెల్లెలగు దొడ్డాంబను వివాహమాడెను. కొమరగిరికి ననవేమారెడ్డి పినతండ్రి. అతని కాలముననను నతనియన్నయుఁ గొమరగిరి తండ్రియునగు పీరాన్న పోతారెడ్డి కాలమునఁగూడ మామిడి

సింగన్న తండ్రియన్నయుగూడ వారియొద్ద మంత్రిత్వమును వహించెను. కాటయవేముఁ డెంత చెప్పినఁ గొమరగిరియంత.

మామిడిసింగన్న తన్ను మంత్రిత్వమునుండి తొలఁగించినందు లకుఁ గాటయవేమునిపై వైరముపూని యాతనితల తీయింతునని ప్రతిజ్ఞ చేసెను. కోమటివేమారెడ్డి సింగన్నను దెచ్చి తనకు మంత్రిగాఁ జేసికొనెను. సింగన్న తన చాకచక్యమంతయు వినియోగించి కందు కూరు రెడ్లను గోమటివేమునిపక్షమునకుఁ ద్రిప్పఁగల్గెను. కందుకూరును గోమటిరెడ్డి పరిపాలించుచుండెను. ఈ కోమటిరెడ్డి ప్రోలయ సంతాన ములోఁ దుదివాఁడగు మల్లారెడ్డికి మునిమనుమఁడు. కోమటివేమారెడ్డి గుండుగొలనియొద్దఁ గుమారగిరి నెదిరించినపుడు సింగన్న కందుకూరు రెడ్లను బ్రేరేచి దీవిసీమ నాక్రమించుకొనునట్లు చేసెను. కొమరగిరి రెండుప్రక్కలనుండి యెదిరింపవలసినవాఁడయ్యెను. అదిగాక రాజ మహేంద్రవరమునఁ బరిపాలించుచున్న కొమరగిరి కుమారుఁడు వీరాన్న పోతు హఠాత్తుగా మరణించెను. కొమరగిరికిఁ గుమారుని మరణము పిడుగుపాటై కొండవీటిని వదలి రాజమహేంద్రవరమునకుఁ బాఱి పోయెను. కోమటివేముఁడు కొండవీటిసింహాసనమెక్కి తనతమ్ముఁడగు మాచారెడ్డిని గొండపల్లియందు నిల్పెను.

తఱువాతజరిగిన కొన్ని సంఘటనములు కందుకూరి రెడ్లతోఁ గోమటివేమునికి విరోధము దెచ్చిపెట్టెను. కందుకూరిరెడ్లు కొమరగిరి పరిపాలనకాలమునఁ గొండవీటికి సామంతులు. ఆ కారణమును బురస్క రించుకొని కోమటివేముఁడు దనకు వారు కప్పము చెల్లించవలె ననెను. కోమటిరెడ్డి యిది యంగీకరింపలేదు. "కొండవీటిరాజ్యము కుటుంబ మంతయుఁగలిసి స్థాపించినదని నీవే చెప్పితివిగదా! నీవలెనే మేమును బ్రోలయ కుటుంబములోనివారమే. మీతాత మాచయ చందవో

ములు బరిపాలించినట్లే మా ముత్తాత మల్లారెడ్డి కందుకూరును బరిపాలించినాఁడు. ప్రోలయ వేమారెడ్డికి మీ తాత యెట్టివాఁడో మా తాతయు నట్టివాఁడే. కాఁబట్టి మేము గొండవీటికి సామంతులముగా” మన్నారు. కోమటి వేముఁడు “ మా తాత మాచారెడ్డి ప్రోలయ సంతానములో జ్యేష్ఠుఁడు, కాఁబట్టి రాజ్యాధికారము మాకోవకే సంక్రమించును. అదిగాక మీరెల్లను గొమరగిరికి సామంతులేగదా! ఆ కొమరగిరిని బాఱఁద్రోలి న్యాయముగా నాకురావలసిన రాజ్యమును నేనాక్రమించుకొంటినిగాన మీరు నాకును సామంతులే” యని వాదించెను. దానితో మొదలైనది కలహము. అది చినికి చినికి గాలివానయయ్యెను. మామిడిసింగన్న యా వైరమును బ్రబలకుండఁ జేయఁజూచెనుగాని లాభము లేకపోయెను. కోమటి వేమారెడ్డి కందుకూరి రెడ్లను దీవిసీమ నుండి పాఱఁద్రోలెను. కందుకూరి రెడ్లు విజయనగర రాజుతో సంధి చేసికొని కోమటి వేమారెడ్డికిఁ బ్రతీకారము సేయ నదను వేచియుండిరి.

విజయనగర రాజులకును గాటయ వేమునకును బంధుత్వముగలదు. విజయనగర రాజగు దేవరాయని చెల్లెను హరిహరాంబను గాటయ వేముఁడు వివాహమాడెను. ఆ కారణమునఁ గాటయ వేమునితో యుద్ధము సంభవించినపుడెల్ల గోమటి వేముఁడు విజయనగర రాజుల నెదుర్కొనవలసిన వాఁడయ్యెను.

మహామంత్రి మామిడిసింగన్న తనబుద్ధిబలమంతయు వినియోగించి యటు నన్నదేవచోడునియు నిటు వెలుగోటి రాయపనాయనిసాయము సంపాదింపఁగల్గెను. వెలుగోటి రాయపనాయకుఁడు పల్నాటిసీమకుఁ బ్రభువు. అతనికిని గొమరగిరికిని బలవద్విరోధముగా నుండెడిది. అతఁడును నతని సామంతుఁడైన గజరావు తిప్పనాయఁడును మొదటినుండియుఁ గోమటి వేమారెడ్డిపక్షము. కొండవీటిని జయించు

టకుఁ గోమటివేమునకు వారు మిక్కిలి సాయపడిరి. వేమారెడ్డి కొండ వీటి సింహాసనమెక్కినతర్వాత మామిడిసింగన్న రాయపనాయఁడు గప్పము కట్టనక్కఱలేకుండఁజేసి పూర్వస్నేహమును దృఢతరము గావించెను. రాయపనాయకుఁడు గొండవీటికిపుడు నామమాత్రపు సామంతుడు.

అన్న దేవచోడుఁడు ప్రోలవరమునకు రాజు. అతనితండ్రి చోడ భక్తిరాజు రాజమహేంద్రవరమునుగూడఁ బాలించెను. కాటయ వేమారెడ్డి వానినిజయించి రాజమహేంద్రవరము నాక్రమించుకొనెను. అన్న దేవచోడుఁడు రాచకొండ దేవరకొండ వెలమదొరల ప్రాపుతో మఱల రాజమహేంద్రవరమును నాక్రమించుకొనవలెనని ప్రయత్నము సేయుచుండెను. రాచకొండ దేవరకొండ వెలమలకును గొండవీటి రెడ్లకును గుటుంబవైరముండెను. అందుచే వారన్న దేవునికి సాయ పడుచుండిరి. మామిడిసింగన్న యన్న దేవునితో రాయబారములు నెఱపి స్నేహితుని గావించుకొనెను. గొప్పసైన్యమును యువరాజు నాధిపత్యముక్రింద వెంటఁదీసికొని రాజమహేంద్రవరముపైకి నన్న దేవునికి సాహాయ్యముగ నెత్తిపోయెను.

సింగన్న దృష్టిని రాజమహేంద్రవరముపై నుండి వెనుకకు మళ్ళిం చుటకు విజయనగరరాజగు ప్రౌఢదేవరాయలు చౌండపామాత్యుని యాధిపత్యమున గొప్పసైన్యమును మోటుపల్లికిఁ బంపెను. కందు కూరి రెడ్లు వానికి సాయమువచ్చిరి.

మామిడిసింగన్న యీ మోటుపల్లి యుద్ధమునుండి బయట పడుట యెట్లాయని యాలోచించుచుండఁగా గోరుచుట్టుపై రోఁకటిపో టన్నట్లు రాజమహేంద్రవరమునుండి యిప్పుడీవార్త వచ్చెను.

ఈ వార్త విని మామిడిసింగన్నకు మనసులో రాయపడిన ట్లయ్యెను. అతఁ డించుకసేపు తీక్ష్ణముగా నాలోచించి హఠాత్తుగా లోనికిఁబోయి వేషమునుమార్చుకొని రాజమందిరమువంకకు నడచెను. నడచున్నంతకాల మతఁ డేదియో యాలోచించుచు మధ్య మధ్య తల యూఁచుచుండెను.

అతఁడు రాజమందిరమును జేరుసరికి నచటి ప్రతీహారి యొకఁ డెదురువచ్చి వేమారెడ్డి యచట లేఁడనియు రెండుగడియలకుఁబూర్వమే గృహరాజు మేడవైపు పోయెననియుఁ జెప్పెను. మామిడిసింగన్న గృహరాజుమేడవైపు నడచెను.

సింగన్న గృహరాజుమేడపైకిఁ బోవుసరి కచ్చట వేమారెడ్డి సింహాసనముపైఁ గూర్చుండియుండెను. ప్రక్కగా శ్రీనాథుఁడు పెద్దియజ్వయుఁ గూర్చుండియుండిరి. పెద్దియజ్వకు నెనుబదియేండ్లవయసుండ వచ్చును. ఆయన గొప్పజ్యోతిషికుఁడు. ఆయనమనిసికొంచెముపొడవరి. ఆయనముఖమున నొకయతిలోకమైన తేజస్సు సమావిష్టమైయుండెను. ఆముఖమునందు మిక్కుల నాకర్షకములైనవి యాయన కండ్లు. ఆ రెండు కన్నులు రెండునక్షత్రములు. ఆకన్ను లెప్పుడును దీక్ష్ణముగాఁ జూచు చున్నట్లే యుండును. ఆచూపులలో నేదియోయొక యనంతావ్యక్త భావము వెల్లివిరియుచున్నది. మహారాజాయనతో నేదియో ముహూర్తమునుగుఱించి మాట్లాడుచుండెను. మామిడిసింగన్ననుజూచి కోమటి వేమఁ డాప్యాయముగ నాహ్వానించెను. మామిడిసింగన్న పెద్దియజ్వను బాగుగా నెఱుంగును. పెద్దియజ్వయన్న నతనికి మిక్కుల గౌరవము.

మామిడిసింగన్న కూడ జ్యోతిషమున గొప్ప పండితుఁడు. జ్యోతిశ్శాస్త్రమున సోమసిద్ధాంతమునుగుఱించి యతఁ డొక గొప్ప

గ్రంథమును రచించెను. ఆగ్రంథమును జూచి పెద్దియజ్వ మామిడి సింగన్నను మిపుల మెచ్చుకొనెను.

మామిడిసింగన్ననుజూచి పెద్దియజ్వ మందహాసము చేసెను. సింగన్న గారాయనకు నమస్కరించి కూర్చుండెను.

సింగన్న :— మీరేదియో మాట్లాడుచున్నట్లున్నారు. మధ్య వచ్చి నే నంతరాయమును గల్పించితిని.

కో-వే :— ఏమియును లేదు. ఏదియో ముహూర్తమునుగుఱించి మాటాడుచుంటిమి. మనము వారమురోజులనుండి కలిసికొనలేదు. కావున మీకుఁ జెప్పుటకుఁ బడలేదు. కాటయవేముని తల కొట్టి తెచ్చిన తర్వాత గృహరాజుమేడను బూర్తిచేయుద మనుకొంటిమిగదా! అన్నదేవుఁడు రాజమహేంద్రవరము నాక్రమించుకొనఁగనే నందికంత పోతరాజు కటారిని బంపును. అది రాఁగానే మనము గృహరాజుమేడను బూర్తి సేయించవలయును. దానికై ముహూర్త మాలోచించు చుంటిమి.

మామిడిసింగన్న నిట్టూర్చెను. అతఁడు పెద్దియజ్వవంకఁజూచి "తమ రేమి సెలవిచ్చితి" రనెను.

పెద్దియజ్వ :— మీరును జ్యోతిషమునఁ బండితులేగదా! మీ రేమి చెప్పెదరో చెప్పుఁడు.

మామిడిసింగన్న కొంచెము సేపు కనులుమూసికొని యాలోచించి పెదియజ్వవంకఁ జూచుచు "నిప్పటిలోఁ సరియైన ముహూర్తములు లేవనుకొందు" ననెను.

పెద్దియజ్వ :— అవును. చైత్రమాసమీలోపల ముహూర్తములులేవు చైత్రశుద్ధత్రయోదశినాఁ డొకఁడున్నది. అదిమూఁడు నెలలు

దాఁటినతఱువాతిమాట. ఆ ముహూర్తమునుగూడ నేను సంపూర్ణముగా విచారించలేదు. ఇంకను జాలకాలమున్నదికదా! తఱువాత విచారింపవచ్చును.

సింగన్న :— అవును. తఱువాతఁ జూచుకొనవచ్చును. అప్పటికి మనపరిస్థితులుగూడఁ జాలవఱకు ననుకూలపడును.

పెద్దియజ్వ యేదియోమాటాడఁబోవుచుండెను. కోమటి వేముఁడు హఠాత్తుగాఁ "పెద్దియజ్వగారూ! అసలు గృహారాజుమేడ పూర్తియగు నవకాశమున్నదా?" యని యడిగెను. పెద్దియజ్వ పది క్షణములు కనులుమూసికొని ధ్యానమగ్నుఁడయ్యెను. ఆకాలమున నతని ముఖము విచిత్రముగా మారెను. అతఁడు తలయాడించుచుఁ కనులు విప్పి యిట్లనెను. "గృహారాజుమేడ తప్పక పూర్తియగును. కాని కాలముతీసికొనును. పూర్తియగుటమాత్రము నిక్కువము. మధ్యచాల నడ్డంకులు గల్గునట్లుమాత్రము తోఁచుచున్నది. ధర్మాన్న వేమారెడ్డి వారు దీని నేముహూర్తమున మొదలుపెట్టిరోగాని యప్పటినుండియు దానికన్నియు నడ్డంకులే కల్గుచున్నవి. అవునవును. నాకిప్పుడు గుర్తు వచ్చుచున్నది. నాకప్పటికి ముప్పదియేండ్ల ప్రాయముండెను. నేను దొలుతగా ధర్మాన్న వేమన్నగారిని దర్శించుటకు వచ్చితిని. వారు గృహారాజుమేడనుగుఱించి యపుడు నన్నడిగిరి. నాకిట్లే చెప్పినట్లు గుర్తు. "మహారాజా! యీమహారాజు మనసులోఁబుట్టిన యూహము నేటికిఁ దమచేతిమీదుఁగాఁ బూర్తియగుచున్నది. అది పూర్తియగుట మాత్రము నిక్కువము. కాని యేవో యవాంతరములున్నవి. అవి యన్నియు సరిగా మనసునకుఁ దోఁచుటలే" దనెను.

కో-వే:—అయినచో నేఁబదియేండ్లక్రిందటనే ధర్మాన్న వేమన్నగారి మనసులో గృహారాజుమేడ గట్టవలయునను నూహ పుట్టినదన్న

చూటు. ఆయూహ నాయూన చాలకాలము దాఁచుకొనెను గాఁబోలును నాకిరువదియైదేండ్ల వయసువచ్చినప్పుడు గృహరాజుమేడ గట్టుట కాయన తొలిప్రయత్నము గావించెను.

పెద్దియజ్వ :— కాదు. కాదు. నేనాయనదర్శనము చేయుటకుఁ బూర్వము పదియేండ్లక్రిందటనే యాయన తొలిప్రయత్నము గావించెను. ఆ పదియేండ్లలో నాయన యనేకయుద్ధములలోఁ జిక్కుకొనుట తటస్థించి యాప్రయత్నమునకు విఘాతముగల్గెను. ఆతొలిప్రయత్నము నకు ముమూర్తమెవఁడో సరిగా నాలోచించి నిర్ణయించలేదు. అందుచే నది ఫలించుట కరువదియేండ్లు పట్టినది. ఇంతకాలము పట్టునని నేనప్పుడే చెప్పితిని. పాపమాయన తనయూహను గార్యరూపములోఁ జూడవలయునని మిక్కిలి ప్రయత్నించెను. కాని దైవనిర్ణయ మిట్లున్నది.

కో:-వే :—అవును. ఆయన యెప్పుడు ననుచుండెడివాఁడు "నాయనా! ఈజడ్డిగాలబావియొడ్డున గృహరాజుమేడగట్టి యందుఁ బైయంతస్థువున నాదిలక్ష్మీకామేశ్వరీ యమ్మవారిని బ్రతిష్ఠింప వల యును. ఆమెకు రెండువైపుల ముల్లగూరమ్మవారిని బోతురాజును బ్రతిష్ఠింపవలయును. నందికంతపోతరాజు కటారిని మేడశిఖరమున బిగించి కాపుంచవలయును. అట్లుచేసినఁ దాను మనవంగసమున స్థిర ముగా నిల్చుననియుఁ గొండవీటిరెడ్డిరాజ్యము స్థిరపడుననియు నాయిష్ట దేవత కామేశ్వరీయమ్మవారు కలలోఁగన్పించి చెప్పినది. ఈమేడను గట్టించి మనమందఱము నామెను సేవించవలయును. మీ నలుగురు నాధారముగా నేనీమహాకార్యము చేయుటకుఁ బూనుకొంటి" నని. కాని యాయనజీవితమంతయు యుద్ధములతోనే గడిచినది. కొంచెము తెఱపియిచ్చి యా సంవత్సరము మేడస్తంభమునుమాత్ర మాయన

గట్టించినాఁడు. అది పూర్తియైనదోలేదో గజపతితో మాకుయుద్ధము సంప్రాప్తమయ్యెను. ఆయుద్ధముయుద్ధము నాల్గుసంవత్సరము లెడ తెఱపిలేకుండ సాఁగినది. దానినుండి యొడ్డుపట్టితిమి. ధర్మాన్న వేమన్న గారు మంచమెక్కిరి. మఱుసంవత్సరమాయన శివైక్యమును జెందెను. ఆయన తుదిమాట 'గృహరాజుమేడ'.

పెద్దియజ్వ :— మహారాజా! ఏకాలమున కేదియెట్లు జరగవల యునో యది దైవనిర్ణీతమైన విషయము. దానిని మానవుఁడడ్డుకొన లేఁడు. ఆమహారాజు ప్రయత్నమునకు దైవము కలిసిరాలేదు. అసలీ కాలమన్నదిబహువిచిత్రమైనది. ఆలోచించినకొలఁది దానిస్వరూపము మిగులవింతగా గోచరించును. అది గారడీవానిచేతిలోని మంత్రదండము వలె గిరగిర తిరిగిపోవుచు ననేక విచిత్రసంఘటనములను గనులయెదుట మెఱపించి చుట్టలుచుట్టివేయును. ఆ తళుకులో విరిసిన సంఘటనములు వట్టి యెండమావులు. వట్టివార్తమానికవిలసనములు. వట్టిభ్రాంతి. దానికిఁ జింతించి ప్రయోజనమేమున్నది? జ్యోతిశ్శాస్త్రముయొక్క పరమప్రయోజన మిట్టికాలస్వరూపాపగతియే. దానినిదెలియక చాల మంది యది ఋది యనుకొందురు. కాలస్వరూప పరిజ్ఞానమువలన జీవుఁడు ముక్తుఁడగును. కాలచక్రమునఁబడి పరిభ్రమించుటయే బంధము.

కోమటివేముఁడు పెద్దియజ్వవంక విచిత్రముగాఁ జూచెను. పెద్ది యజ్వ కన్ను లుజ్జ్వలములై మెఱయుచుండెను, వానియందేదో యొక మహానుభూతి యొక యనంతత్వానుభూతి దీపించుచుండెను. అది తానుబొందిన యవ్యక్తానుభూతికి నాకాశభావానుభూతికి సజాతీయ ముగా నుండెను. ఇదియేమి! ఈపెద్దియజ్వగారు తనమనసును వేధించు చున్న యీ మహావిషయమునుగుఱించి మాట్లాడుచున్నాఁడు. తా

నింతవఱకనేక జ్యౌతిషికులను జూచియుండెను. వారెవ్వరిట్లు మాట్లాడ లేదు. ఈపెద్దియజ్వగారుగూడఁబూర్వమెప్పుడు నిట్లు మాట్లాడలేదు. మహాపండితులవిద్య యెప్పుడెట్లు వికసించునో యెవరుచెప్పఁగలరు? వారివిద్యలోనెంతయో వారికే తెలియదు. కోమటివేముఁడు పెద్ది యజ్వవంక మెత్తగాఁ జూచి "మీవంటి రహస్యవేత్త లరుదుగా నుందురు. ఆ ప్రాచీనశాస్త్రములు మీవంటివారిచే నధీతములై వాని యందలి గంభీరార్థములు వెల్లివిరియును. తక్కినవారి యధ్యయన మంతయుఁ జిలుకపలుకులవంటి" దనెను.

పెద్దియజ్వ:— మహారాజా! దీనిలో మాగొప్పయేమియును లేదు. నిజమాలోచించిన నిదియంతయు మీయనుగ్రహము. రాజ పోషణమువడసివిద్యలు ప్రకాసించును. నేను డెబ్బదియేండ్లుజ్యోతిర్విద్య యందుఁ గృషిచేసితిననగా నదియంతయు మీరుగల్పించిన సదుపాయ ములవల్ల. ధర్మాన్న వేమారెడ్డివారు పచ్చలతాడిపట్టు సర్వాగ్రహా రము చేసియిచ్చిరి. మీరు కల్వపాముల నందమూరు గ్రామములు సర్వాగ్రహారములుచేసి యిచ్చితిరి. అన్నముకొఱకు వెదకికొనవసరము లేని పండితుఁ డేమిచేయును? నేను నదియే చేసితిని.

కో. వే:— తమబోటి విద్వాంసుల కగ్రహారములుచేసి యిచ్చుట జన్మాంతరీయకమగు పుణ్యవిశేషమువల్ల సమకూడును. మీకాయగ్ర హారము లన్నియు నిర్బాధముగఁ జెల్లుచున్నవా?

శ్రీనాథుఁడు:— ఆవిషయమై పనిగల్గియే పెద్దియజ్వగారు వచ్చిరి. ఈమధ్యతురగా రామయ్యగారేదో యగ్రహారములపైఁగూడఁ బన్ను వసూలుచేయవలసినదని యాజ్ఞపెట్టినారఁట. ఆయకాంగ్రహారి కులను బలవంతపెట్టుచున్నారు.

కోమటివేముఁడు మహామంత్రివంకఁ జూచెను.

మామిడిసింగన్న :— నేనీ వారమురోజులనుండియుఁ దురగా రామయ్యగారిని గలిసికొనలేదు. ఆయన యూరిలోనున్నట్లులేదు. ఆయనవచ్చినతర్వాత విచారించి యగ్రహారములపైఁ బన్నులభారము లేకుండఁ జేయవలయును.

కో. వే :— నేనును నాయన నీమధ్య కలిసికొనలేదు. పెద్దియజ్వ గారూ! రామయ్యగారిని గనుఁగొని మీపైఁ బన్నులభారములేకుండఁ జేసెదము.

శ్రీనాథుఁడును బెద్దియజ్వయు సెలవుదీసికొని వెడలిపోయిరి. వేముఁడు మహామంత్రివంకఁ జూచెను.

సింగ :— మహాప్రభూ! మఱల నల్లాడరెడ్డి రాజమహేంద్ర వరముపైకి సన్నాహపడుచున్నాఁడు. అతఁడు గజపతులతోఁగూడ రాయబారము నెఱపుచున్నాఁడట. ఇటు నరపతుల సాయము వారి కుండనేయున్నది. రాజమహేంద్రవరము చేయిజారిపోయినదా పరిస్థితి యంతయు మొదటికివచ్చును. ఈమోటుపల్లియుద్ధ మొకటి నెత్తిపైకి వచ్చికూర్చున్నది. ఈయుద్ధము మనలను బాగుగాఁ బట్టిచూచునట్లు న్నది. దినదినమును సైన్యములను బ్రోగుచేసి మోటుపల్లి పంపుచు నే యుంటిని. కాకరపర్తి యుద్ధమున మనకు జయములభించినను మిక్కుటముగా నష్టపడితిమి. మఱల నల్లాడరెడ్డితో యుద్ధము సంప్రాప్తమగు నట్లున్నది. గజపతి నిజముగా నల్లాడరెడ్డికి సాయమొనరించినచో నన్న దేవచోడుఁడు నిలువలేఁడు. అతనికి రాచకొండ దేవరకొండ వెలమల సాయమున్నది గాని యంతమాత్రమున నదిచాలదు. మనముగూడ నతనికి సాయముపంపవలయును. కాని మనము సాయముపంపుస్థితిలో లేము. కాఁబట్టి మనము బలవంతుఁడైన యొకమిత్రుని సంపాదించుకొన

వలయును. మనమింతకుఁబూర్వ మశ్వపతితోఁ గొంత రాయబారము నడపితిమిగదా! ఆ యశ్వపతితో నిపుడు సంధికుదుర్చుకొన్నచో బాగుండును. అపుడీ వెలమదొరలుగూడ నశ్వపతికి సామంతులుగాన వారియంతటవారు గలసివత్తురు. ఇట్లీ నరపతుల పదాతిబలమునకు నటు నాగజపతుల గజబలమునకు నీ యశ్వపతుల యశ్వబలము సరిపోవును.

కో. వే :— అవును. మీరు చెప్పినది బాగున్నది. మీకశ్వపతితో బరిచయమున్నదిగదా! మీరేపోయినచో నాకార్యము నెఱవేరును.

సింగన్న : నేనే బయలుదేరిపోవుదును. మాతమ్ముఁడు ప్రగడయ్యను రాజమహేంద్రవరము పంపవలయును. కుమారకొమరగిరిని నన్నదేవుఁడు బందీగాఁ బట్టుకొన్నాఁడట. అతనిని రాజమహేంద్రవరమున నుంచుట రాజనీతిగాదు. అతనినచ్చటనుండి కొండవీటికిఁ దెప్పించవలయును. అతఁడు మనచేతిలోనున్న నెందుకైన మంచిది.

మామిడిసింగన్న సెలవుదీసికొని వెడలిపోయెను. కోమిటివేముఁడట్లేకూర్చుండి యాలోచించుచుండెను. అప్పటికి సరిగా సంజచీఁకట్లు ప్రాలుచుండెను. వేమునిమనసు మామిడిసింగన్న యుపాయమువైపు కంటెఁ బెద్దియజ్వ మాటలవైపు పర్వెత్తెను. ఆ పెద్దియజ్వగారు కాలభావమునుగుఱించి చాలచిత్రముగా మాట్లాడెను! కాలము తళుకుక్కుమని యనేక విచిత్రసంఘటనలను మనముందు మెఱపించుచున్నది. ఆ తళుకులో విరిసినసంఘటనలు పట్టి యొండమావులు. కాలచక్రమునఁబడి పరిభ్రమించుట బంధము. కాలస్వరూప పరిజ్ఞానము వలన జీవుఁడు ముక్తుఁడగును'. అ కాలస్వరూపమేమి ? అది యెంతయాలోచించినను భూతభవిష్యద్వర్తమానాత్మకము గనే తోఁచుచున్నది. దాని మహాస్వరూపమేదియో మనసున కవభాసించుటలేదు. అది వర్తమానాత్మక

ముగనే యనుభూతమగుచున్నది. భవిష్యత్తగోచరమై యంధకారమై వర్తమానము తళుక్కుమని భూతము సురిగిపోవుచున్నది. ఈమూఁడింటి కొక సమానస్థితి గలదా? ఒక యేకరూపతగలదా? నిజముగానీవార్తమానిక విలసనములన్నియు నాపెద్దియజ్వగారు చెప్పినయెండమావులే. ఇవి యెండమావు లనుకొన్నను గనులయెదుట మిలమిల లాడుచు దాహమును బెంచుచునేయున్నవి. ఈ యెండమావులను దాఁటుట యెట్లు? అతఁడు సింహాసనముపైనుండి లేచి సింహద్వారమునొద్దకు నడచిపోయి ద్వారమును రెండుచేతులతోఁ బట్టుకొని ముందునకుఁ జూచెను. అతనిచూపులు తీక్ష్ణములై చుట్టుకొనివచ్చుచున్న చీఁకటి మొత్తములను దూసికొనిపోయి యేదియో సమాధానముకొఱకు నాకసములోఁ దారాడెను. ఆ చీఁకటినావరించిన యాకాశముయొక్క వెల్గులాతని చూపులతో మేళవించెను. ఇంతచీఁకటిలో నీయాకాశపు వెల్గేమి? ఈ చీఁకటిని గాలము తెచ్చిపెట్టినది. ఈ చీఁకటి యా యాకాశముపై నీడపాఱలేదు. ఈ కాలముయొక్క ప్రతిభ యీ యాకాశముపైఁ బాఱుటలేదా? అతఁడు క్రిందికిఁ జూచెను. క్రింద నంతయు నంధకారము. అవును. ఈకాలముయొక్క ప్రతిభ యీ భూమిపైనే యున్నది. అతఁడు క్రిందికిఁ బైకి రెండుమూఁడు సార్లు చూచెను. భూమియంతయుఁ జీఁకటి యాకసమంతయు వెల్గు. ఈచీకటిని వదలి యా వెల్గులోనికిఁ బోవుట యెట్లు?

కోమటివేముఁడు మేడమెట్లు దిగెను.

౫

కోమటివేమున కారాత్రి సరిగా నిద్రపట్టలేదు. అతఁడు చాల ప్రొద్దుపోవువఱకు నట్లే యాలోచించుచుఁ బరుండెను. ఆలోచించిన

కొలఁది యాసమస్య యతనికి మఱియు విచిత్రముగఁ గన్పించెను. తాను మొదట నాకాశముయొక్క యనంతత్వముచే నాకృష్టుఁడై యాయా కృష్టియందేదో మనసు పట్టని యొకమహానుభూతిని బొందినాఁడు. ఆ యనుభూతి సరిగా భయము గాకపోయినను భయము వంటిదిగఁ బోల్చుకొన్నాఁడు. ఆ యనంతత్వము ముందుఁ దనపరిమితత్వ మొక మహాపర్వతము ముందొక యణువై తాను విహ్వాలించి పోయినాఁడు. అతని మనసులో గృహారాజు మేడ పూర్తిసేయవలయునను నాలోచన మెప్పుడుగలిగినదో నాఁడే యిట్టి యనంతత్వభావనగూడ మొదలైనది. ఆగృహ రాజు మేడకును నీయనంతత్వ భావనకును నేదియో వ్యక్తముగాని సంబంధ మున్నట్లతని కప్పుడప్పుడు తోఁచును. గృహారాజు మేడను గుఱించిన యాలోచన మతని మనసులోనికి వచ్చినప్పుడెల్ల నీయాకాశ భావమతని నాకర్షించుచునే యుండెను. ఆయాకాశ భావము క్రమ ముగాఁ గాలభావమును గుఱించి యతనిలో నాలోచన రేపెను. ఈకాల భావము నాయాకాశముయొక్క యనంతభావము నెచ్చటనో ముడివడి యున్నవని యాముడిని విడఁదీయుటకై యతఁడు బాధపడుచుండెను. ఆనాఁటి సాయంతనము పెద్దియజ్వతోడి సంభాషణమూ సమస్యయం తనికిఁ గొత్తపరిచితిని గల్పించెను. ఈచిక్కును విడఁదీయుట కేప్రక్క నుండి దారమును బట్టుకొనవలెనో యతనికిఁ దోఁచలేదు. ఏదియో యొక ప్రక్కఁగొనవోలెఁ గన్పించి కొంతదూరము విడఁదీయఁబడి యా పట్టుకొని లాగినకొన కొనకాదని తేలి లాగినకొలఁది పెనవేసికొని పోవుచున్నది. ఇప్పుడు పెద్దియజ్వ మఱియొక కొన నందించి నాఁడు. ఆ కొనసుబట్టుకొని కోమటివేముఁడు తన తర్కమును మొదలుపెట్టెను. కన్నులయెదుటఁ గన్పించు దృశ్యమంతయు వట్టివార్త మానిక విలసనము. వట్టి యెండమావుల వంటిది. కోమటివేమున కీ భావమాలోచించినకొలఁదిని మిక్కిలి సొగసుగాఁ గన్పించెను. మిక్కిలి

సత్యముగాఁ గన్పించెను. కాని యీ సత్యము స్పష్టముగా ననుభవము లోనికి వచ్చుటలేదు. అది యాలోచనలోమాత్రము సత్యమై తక్కిన యప్పుడు దానియందు సుఖదుఃఖాద్యనుభూతి కల్గుచునేయుండెను. జీవికి నిజముగా బంధమన్న నీ సుఖదుఃఖాద్యనుభూతియే మో? ఈ యనుభూతి కారణ మేచటనున్నది? ఈ ప్రశ్నకు వేముఁడు సమా ధానము చెప్పికొనలేకపోలేదు. అతని కీవిషయమంతయుఁ గొట్టినపిండి. ఆ ప్రశ్న పుట్టినది. వెంటనే యతని సాహిత్యశక్తి సమాధానము చెప్పెను. జన్మాంతరీయకములగు కొన్ని వాసనలు చిత్తమునందున్నవి. ఆ వాసన లీసుఖదుఃఖానుభూతికిఁ గారణము. అతఁ డాసమాధానమును జెప్పికొనెనో లేదో యతనియెదుటఁ గాటయవేముని తల ప్రత్యక్షమై పకపక నవ్వెను.

వేమా :— ఎందుకు నవ్వెదవు?

తల :— నీవు చెప్పుకొన్న సమాధానమునకు.

వేమా :— ఆ సమాధానములో నవ్వఁదగిన దేమున్నది?

కాటయవేముని తల యీమాటలు పూర్వముకంటె నిబ్బడిగా విఱుగఁబడి నవ్వెను.

వేమా :— నీ వెందుకు నవ్వుచుంటివో నాకుఁ దెలియదు. ఆ సమాధానము నూటికి నూరుపాళ్ళు నిజము.

తల నవ్వుచు నేను నవ్వెదను. పగలఁబడి నవ్వెదను. ఒకొక్క ప్పుడు సత్యమే పలుకఁబడి నవ్వుపుట్టించును. ఒకొక్కఁడు సత్యము చెప్పుచుండఁగా నవ్వలేక పొట్ట చెక్కలై పోవు ననెను.

వేమా :— నేను సత్యము చెప్పఁగా నీకు నవ్వు వచ్చినది. నాకు నీపై మిగుల జాలి కలుగుచున్నది. నీవు నవ్వి పాపము నీ వికారము నంతయు బయట వేసికొన్నావు.

తల :— నామీఁద జాలి యని కోపము వెల్లడించుచుంటివి. నాకు మఱియు నవ్వు వచ్చుచున్నది. ఏభావముయొక్క స్వరూప మేదియో తెలియనివాఁడవు సాహిత్య చింతామణి వ్రాసితివి. నేను నవ్వి నామనసులో వికారము బయటపెట్టుకొనలేదు. నీమనసులోని వికారమే బయటపెట్టితిని.

వేమా :— నీ వూరక నన్ను జూచి నవ్వెదవు. నేను నిన్ను గాలిలోఁ గట్టించి గ్రద్దలకు బలివెట్టెదను.

తల :— అప్పుడు నేనింకను విఱుగఁబడి నవ్వెదను ఓయీ ! నీవు నన్నేమిచేయఁగలవు ? నీవు నన్నెంత హింసించినను నది నాకు సంతోషమే కూర్చును. నన్నునీవు గాల్చి మసిచేయుము. నేను మఱికొంచెము నలుపెక్కెదను. మఱికొంచెము వికృతమగుదును. నేను వికృతమైన కొలఁది నీమనసులోని వికారమును బయటికిఁదెత్తును.

వేమా :— నా మనసునకు నీకును సంబంధమేమి ? నన్ను బిశాచమువలె వేధించుచున్నావు. నా కన్నులయెదుటనుండి యావలకుఁ బొమ్ము. పుణ్యముండును.

వేమారెడ్డి కేదియో యస్పష్టముగా జ్ఞాపకమునకు వచ్చెను. ఆ యస్పష్టభావమును రూపు కట్టించుకొనుట కతఁడు మిక్కిలి బాధపడెను. ఆ తల యతనినిజూచి మిణుఁగురుపురుగులువోలెఁ గనులు మిలమిల లాడించి దవడలు లోనికిఁ దోసికొనిపోయిన నోరావులించి

చీఁకటిరాత్రి యురుములురిమి మెఱపులు మెఱసినట్లు నవ్వెను. వేమారెడ్డికి మనసులో భయము పొగరాజెను.

తల :— నీవు భయపడుచున్నావా ?

వేమా :— నేను భయపడుచుంటినని నీకెట్లు తెలియును ?

తల :— నేను బిశాచమువలె నున్నానని నీవనఁగా నేను బిశాచమును గాలేదా ? అందుచేత నీవు భయపడుచుంటివని తెలిసికొంటిని.

వేమా — నేను నిన్నుజూచి భయపడుట లేదు. నిన్ను నేను నాశనముచేసితిని. నిన్నుజూచి నాకు భయమెందుకు ?

తల :— నీ వబద్ధమాడుచున్నావు. చూడుము. నీవు నిజముగానే కారణము చెప్పితివో యా కారణమునకు సరియైన కార్యమును గాదనుచుంటివి. నన్ను నీవు నాశనముచేసితివిగదా ! అందుచేతనే భయపడుచుంటివి. పూర్వము నాపై నీకుఁ గ్రోధ ముండెడిది. ఆ క్రోధమంతయు నిప్పుడు భయముగా మాఱినది.

వేమా :— నీవు నన్ను జచ్చి సాధించుచుంటివి. నీకుఁ బున్నె ముండును. ఆవలకుఁ బొమ్ము.

తల :— ఓయీ నన్నుజంపి నీనెత్తికిఁ దెచ్చుకొంటివి. దానికి నే నేమిచేయను ?

వేమా :— అవును నేను నిన్నుజంపితిని. నీపీడ వదలిపోయిన దనుకొంటిని. యుద్ధములోఁ జచ్చినవారు వీరస్వర్గము పొందుదురు గదా ! నీవు పిశాచమ వైతివేమి ?

మఱలఁ గోమటి వేమునకుఁ బూర్వమువలెనే యస్పష్టముగా మనసులో నవభాసించెను. అయవభాస మెంత ప్రయత్నించినను రూపుగట్టలేదు. వట్టిబాధమాత్రమే మిగిలెను.

తల :— పాపము నీవేదియో గుర్తు తెచ్చుకొనుటకు బాధపడు చున్నావు. అది నీకు మనసులో నాడుచున్నది.

వేమా :— నీకు నామనసులోని యన్నివిషయములు దెలిసినట్లు న్నదే !

తల :— ఒక మనసులో నందువేమి ? నీనాళ్లనరములన్నియు లెక్కపెట్టిచెప్పఁగలను.

వేమా :— నీవు బ్రతికియున్నప్పుడు నీకింత ప్రజ్ఞ లేదే ?

తల :— నేను జచ్చిన తర్వాత నీప్రజ్ఞయంతయు నాకువచ్చినది. నేను బ్రతికియున్నప్పుడు నీలోదూరి లెక్క కట్టుటకు సాధ్యము గాక పోయినది. ఇప్పుడు నాకెల్లప్పుడు నీయందే నివాసము. నిన్నేడిపించ వలయు ననుకొన్నప్పుడు మాత్రము నేను బయటికి వత్తును.

వేమా :— నీవు నామనసులో సణఁగియున్న వాసనవా ?

ఆమాటకుఁ దల మఱలఁ బక్కున నవ్వెను. ఆ నవ్వుల తళ్తళ్ళలలో దాని స్వరూపము గాన్పించలేదు. వేమారెడ్డి కన్నులు దెఱచి గదియంతయు వెదకెను. దాని స్వరూప మెక్కడను గన్పించలేదు. కాని దూరమునుండి దాని నవ్వులు మనసులో మ్రోఁగుచున్నట్లుండెను. ఆనవ్వులమ్రోఁతనీటిలో నొకరాయివేయఁగా నదియడుగునకుదిగిపోయి పైన తేరిన బుడగలధ్వనివలె నుండెను. ఆ బుడగలారియు నారాయి తవిలి యడుగునఁ దేటికొన్న బురదనీటి యడుగుపొరలలోఁ గదలి కెలఁకు లైనట్లు కోమటివేముని మనసు లోలోపల నెక్కడో సిమసిమలాడెను. వేముఁడు కిటికీరెక్కలు తెఱచి బయటికిఁ జూచెను. అప్పటి కింకను దెలవాఱలేదు. చీఁకట్లు కపిరకపిరగా వ్యాపించి వెలియూరిన మబ్బు

కాంతి చిమ్ముకొనిపలుచఁబడినట్లు గన్పించెను. అప్పటికి సమయ మెంత యైనదో తెలియదు. వేముఁడు కిటికీలోనుండి యాకాసముపంక్కఁ జూచెను. ఆకసమున నొకప్రక్క తెల్లటి మబ్బొకటి దూది రాసి పోసిన ట్లుత్తుంగమై కన్పించెను. దానిప్రక్క నలివయాకాసము.

అతఁడు కిటికీరెక్కలు వైచి కనులుమూసికొని యాలోచింపఁ దొడఁగెను. కాటయవేముని తల యన్నమాటలన్నియు నతనికి విస్పష్ట ముగ గుర్తుండెను. ఆయన్నిమాటల నతఁడు పౌనఃపుణ్యముగా విచా రించుకొనెను. ఆమాటలన్నింటియందును నొక విపులమైన వివేకముద్ర యున్నట్లతని కనిపించెను. మంచి యారూ విచారణలన్నియు దా నెప్పుడో చేసికొన్నట్లతనికిఁ దోఁచెను. అందులో నతఁడు మఱచిపో లేనివి రెండు. ఒకటి సత్యము కొంచెము చెప్పుచుండగా నిప్పుల నవ్వు వచ్చునని. రెండవది కాటయవేముని జంపిన తర్వాత నతనిపైని కోప మంతయు భయముగా మాఱినదని.

హజారమున ఘంట మ్రోగెను. అప్పటికింకను నాల్గుగడియల రాత్రి మిగిలియుండెను. అది సరిగాఁ గోమటివేముఁడు నిద్ర మేల్కొను వేళ. అతఁడు లేచి నిట్టూర్చి తల్పము దిగి వెడలిపోయెను.

నాఁటి సాయంతనము కోమటివేమారెడ్డి గృహరాజుమేడలోఁ బురాణశ్రవణము సేయుచుండెను. ఆ సమయమునఁ బ్రతీహారివచ్చి పృథ్వీసెట్టి సవిరము యెల్లయ్య దర్శనముకొఱకు వచ్చెనని చెప్పెను. వేమారెడ్డి రెండుగడియల యనంతరము వానిని బ్రవేశపెట్టుమనెను. శ్రీనాథుఁడు పురాణము చదువుట యైపోయెను. వేమారెడ్డిశ్రీనాథుని వంకఁ జూచి శ్రీనాథయ్యగారు! ఆ పెద్దియజ్వగా రుండిరా యని యడిగెను.

శ్రీ :— ఆయన నేటి యుదయమే వెడలిపోయెను.

వేమా :— జ్యోతిశ్శాస్త్రములో నంతవానిని నేను జూడలేదు. ఆయన యాకాలమును గుఱించి చేసిన వ్యాఖ్య మీరు విన్నారుగదా!

శ్రీ :— ప్రభూ! ఆయన కదియంతయు ననుభవములోనున్న విషయము. ఆయన జ్యోతిశ్శాస్త్రమునుబట్టి వేదాంతము నన్వయించును. ఇంతేకాదు. ఆయన శివార్చనమునుగుఱించి చేయు వ్యాఖ్యానము తమరు తప్పకుండ వినియుండవలసినది.

వేమా :— అందు విశేషమేమి?

శ్రీ :— ఆ శివార్చనమునకును నీ కాలభావమునకును నాయన సంబధము గల్పించి చిత్రముగాఁ జెప్పును. ఈకాలమున కంతయు నాధారముగ నొక మహాకాలమున్నదట. అది శివరూపము. దాని నెఱింగి యర్చనము చేయవలయును. అప్పుడు జీవుఁడు కాలచక్రము నుండి తప్పించుకొనఁగలఁడు మన కనుభవములోనున్న కాలము మృత్యురూపము. మహాకాలుఁ డీశ్వరుఁడు మృత్యుంజయుఁడు. ఆ మహాకాలుని యనుగ్రహమున నీ మృత్యువును జయింపఁగలము. మార్కండేయుఁ డొనర్చిన శివార్చనలోని రహస్య మిదియే. దీనిని జ్యోతిర్విద్యాముఖమునఁ బెద్దియజ్వాగా రన్వయింతురు.

వేమా :— ఆ పెద్దియజ్వాగారు మఱల నెప్పుడు వత్తురు?

శ్రీ :— ఆయన మన యాస్థానమునకు వచ్చి పదియేండ్లు దాఁటినది. ఇపు డాయన మూఁడవపర్యాయము వచ్చినాఁడు. మఱల నెప్పుడువచ్చునో చెప్పుటకష్టము. అదిగాక యాయనకిప్పుడు బాగుగా వయసుమీరినది. ఆయన యెప్పుడును విరాగముగా మాట్లాడును.

ఆయన మాట్లాడినతీరునుబట్టి యాయన యిప్పటిలో మఱల రాఁడని నాకుఁ దోఁచినది.

వేమా :— ఆయన మీతో నేమనెను ?

శ్రీ :— "నా కుమారుఁడు రామచంద్ర జ్యోతిషికుఁడు. మీ రాతనియెడ నాయందువలెనే ప్రేమను జూపించుఁ" డని నన్ను గోరెను.

వేమా :— ఆ రామచంద్ర జ్యోతిషికుఁడు గూడఁ దండ్రియంత వాఁడు గావచ్చును. ఇంకను మూఁడు నెలలలో వసంతోత్సవములు వచ్చుచున్నవిగదా ! ఆ యుత్సవములకుఁ దండ్రికొడుకులను రమ్మని యాహ్వానముఁ బంపుఁడు. ఈ పర్యాయము వసంతోత్సవములలో దేశమునందున్న మహాపండితులెల్లఁ బాల్గొనవలయును. ఇది బహుశః నాచేతులమీఁదుగాఁ జేయు తుదిపండితపూజ యగును.

శ్రీ :— ప్రభువు లట్లనరాదు. ప్రభువులు యువరాజులకుఁ బట్టము గట్టినను జిరకాలము వర్ధిల్లుచు దర్శనభాగ్యమును మాకెల్లరకుఁ గలుగఁజేయఁగలరు.

శ్రీనాథుఁడు సెలవుదీసికొని వెడలిపోయెను. వేమారెడ్డి సేవకుని బిలిచి యాబలిజసెట్టిని బ్రవేశపెట్టుమని చెప్పెను. సేవకుఁడు సవిరము యెల్లయ్యను బ్రవేశపెట్టెను.

సవిరము యెల్లయ్య వీరబలిజ సమయమునకు నగరమునను్న ప్రతినిధి. ఆకాలమున వర్తకసంఘములకు సమయములనియు నగరములనియుఁ బేళ్లు. బలిజ వర్తక సంఘముల సమయములందురు. వైశ్య వర్తక సంఘముల నగరములందురు. ఈ బలిజ సంఘములో నుభయ నానాదేశీయులు గవరెలు, ముమ్మూర్తిదండులు నను భేదములు గలవు.

ఉభయనానా దేశీయులు, పరదేశీయులు నానా దేశీయులు గలిసిన సంఘము. 'చాలుమూలసమస్త పెక్కండ్రు,' 'యాభైయారు దేశాల సమస్త పెక్కండ్రు' ప్రసిద్ధిగూడ వీరు పిలువఁబడుదురు. గవరలు గవరేశ్వర స్వామిభక్తులు. వారొకతెగ. మమ్మారి దండులు మఱియొక తెగ. వీరు సాధారణముగ సాతు లనఁబడు ప్రయాణ వర్తక సంఘములను రక్షించుచుందురు. ఆసాతుల వలన భృతిపొందుచుందురు. ఇట్టి బలిజ వర్తకసంఘములు పదునెనిమిది గలవు. వీరందఱు పంచశత వీరశాసన నిర్మాతలు. వీరబలిజ సమయధర్మరక్షకులు, రణరంగరాములు, సంగ్రామ భీములు నని వీరి బిరుదులు. వారు ముప్పదిరెండు వేలానగరములందుఁ బదునెనిమిది మహాపట్టణములందు నఱువదినాల్గు యోగపీఠములందు నఱువదినాల్గు ఘటికాస్థానములందుఁ దమవ్యాపారమును సాగించుకొను చుందురు. వీ రేనుఁగులు గుఱ్ఱములు బండ్లు రత్నములు ముత్తెములు బంగారము వెండి కర్పూరము కస్తూరి చందనము పునుఁగు జవాది మొద లైన సర్వవస్తువులలోను వ్యాపారము చేయుదురు. సముద్రముపైఁ బోయి తరుణా, సీరి, తవాయి, గోవ మొదలగు దేశములతోఁగూడ వ్యాపారము సేయుదురు. వీరెడ్లపైన నెట్టినిగంతలు వైచి వాని మెడ లలో గణగణలాడు గంటలు మువ్వపట్టెడలు గట్టి వాని కొమ్ములకు వెండిపొన్నులు తొడిగి వానిపైనఁ దమసరకులను వైచి దేశమంతయుఁ దిరిగి యమ్ముకొనుచుందురు. తమసమయముల కపకారము గలిగించు వ్యక్తులను జంపు నధికారముగూడ వీరికిఁ గలదు. అట్టి యపకారులను జంపినవారికి వీరు సమయసుంకము లేకుండఁజేసెదరు. వారికి బిరుదు లిత్తురు. ధనమిత్తురు. వీరు సుంకములను గుత్తకుఁదీసికొనికూడ వ్యాపారము చేయుదురు. పసులపుల్లరి మొదలైన వానినిగూడ గుత్తవ్యాపారము చేయుదురు.

సవిరము యెల్లయ్య యీ పదునెనిమిది సమయములకు గొండ వీటఁ బ్రతినిధిగా నుండెను. అతఁడు వచ్చుటతోడనే ప్రభువునకు వినయముగా నమస్కారముచేసెను. కోమటివేముఁడు వానిని సాదరముగాఁ గూర్చుండఁజేసెను.

వేమా :— యెల్లయ్యగారూ! మీ వ్యాపారము లన్నియుఁ జక్కగా సాగుచున్నవా? మోటుపల్లి యుద్ధములోఁ జిక్కుకొనుటచే మీ కేమైన చిక్కులు తటస్థించినవా?

యెల్లయ్య రెండుమూఁడుమారులు క్రిందకీ బైకీ జూచి "చిత్తము చిత్తము. తమరు పాలించుచుండఁగా నింతవఱకు మా సమయములకు నెట్టిచిక్కును దటస్థించియుండలేదు. ధర్మాన్న వేమన్నగారి పాలనమును వలెఁ దమ పాలనమునుగూడఁ బ్రజలందఱు వేనోళ్ళఁ బొగడుచున్నారు. మీ రాజ్యమున సుంకములు తక్కువై ప్రజాధనము కొల్లగొట్టఁబడుట లేదు. మేము తెచ్చు వస్తువులలోఁ జాల భాగము మీ రాజ్యములోనే ఖర్చగుచున్నవి. తక్కిన రాజ్యములలో మాకింత వ్యాపారము లేదు. నేనిప్పుడు మీయొద్దకు రెండుపనులమీఁద వచ్చితిని. ఒకటి వసంతోత్సవములు వచ్చుచున్నవిగదా! ఈ పర్యాయము మీకుఁ గావలసిన కర్పూరము గొజ్జఁగినీరు కస్తురి మొదలైన సమస్త వస్తువులు మేమే సమకూర్పఁగలము. నగరములవారికి మీ రీ పర్యాయము బేర మీయవద్దు. క్రిందటి వసంతోత్సవములకు బేరమంతయు వారికే యిచ్చితిరి. ఈపర్యాయము మా కిప్పించవలయును.

వేమా :— నగరముల ప్రతినిధి యవచి తిప్పయసెట్టి నాయొద్దకింకను వచ్చియుండలేదు. ముందు మీరే వచ్చితిరి. మహామంత్రి యూరలేఁడు. వచ్చినతర్వాత దానివిషయమై యాలోచింతము. మఱి రెండవపని యేమి?

యెల్లయ్య :— మఱేమియును లేదు. తమ సుంకకరణాలు మాపై నిమ్మళ్ళ పన్నులధికముచేసినారు. తమరు రాజ్యమునకు రాఁగానే దిగుమతులపైనున్న సుంకములను దీసివేసినారు. ఇప్పుడు సుంకకరణాలు పూర్వ సుంకముగింటె రెట్టింపు రావలయునని పట్టుపట్టుచున్నారు. పసుల పుల్లరి మేము ప్రతిసంవత్సరము నొకేవిధముగాఁ గట్టుచుంటిమి గదా! యిప్పుడు తమ సుంకకరణాలు నగరముల వారికి మూకుఁ బోటి బెట్టి పాటకుఁ బెట్టెద మనుచున్నారు.

వేమా :— మీరు చెప్పుచున్నది చాల వింతగానున్నది. సుంక కరణాల కట్టి యాజ్ఞ లెవరిచ్చిరో మీరు కనుగొంటిరా?

యెల్లయ్య :— తురగా రామయ్యగారు తమ కట్టి యాజ్ఞల నిచ్చిరని వారు చెప్పుచున్నారు. ప్రభువువారు మాపై దయయుంచి యీ సుంకపు బరువును దగ్గింపవలయునని మనవిచేయుటకు వచ్చితిని.

వేమా :— ఎల్లయ్యగారూ! నేను దురగా రామయ్యగారితో మాటాడి వ్యవహారమును సరిచేయుదును. మీరు పదిరోజులు పోయిన తర్వాత రండు.

సవినయము యెల్లయ్య సెలవుదీసికొని వెడలిపోయెను. వేమున కిదియేమియు నర్థముగాలేదు. తురగా రామయ్యగా రాగ్రహారికులపైఁ బన్ను వేసిరని పెద్దియజ్వగారు చెప్పిరి. ఈ సవినయము యెల్లయ్య యిప్పుడిట్లు చెప్పుచున్నాఁడు. ఈయన ప్రవర్తన మేమియు నర్థమగుట లేదను కొనుచు నతఁడు మేడదిగి యేఁగెను.

౬

మఱునాఁడు కోమటి వేముఁడు తురగా రామయ్యగారి కొఱకుఁ గబురు పెట్టెను. కాని తురగా రామయ్య యూరిలో లేఁడు. అతఁడు రాజ్య

మునందలి మాయకాంగ్రడ వ్యవహారములను బరిశీలించుటకుఁ బోయి యుండెను. అతఁ డేయూరనుండెనో యెవరికిని దెలియదు. అతఁడప్పుడే కొండవీడు విడిచి పదిరోజులయ్యెను. కోమటివేముఁ డతనికొఱకు మఱి మూఁడు నాల్గునాళ్లెదురుచూచెను. కాని యతనిజాడలేదు. ఈమూఁడు నాల్గునాళ్లలో మఱియిద్దరుముగ్గురాగ్రహారికులువచ్చి తురగా రామయ్య తమ యగ్రహారములపైఁ బన్నెక్కువ యీయవలయునని బలవంతము చేయుచున్నాఁడని శ్రీనాథయ్యగారిని ముందువెట్టుకొని ప్రభువుతో మొఱవెట్టుకొనిరి. నల్లురైదుగురు సేద్యగాండ్రు ప్రభువు మొగసాల వఱకుఁ బ్రభువుతో విన్నవించుకొందుమని వచ్చి యచ్చటి ప్రతీహారులచే నడ్డగింపఁబడిరి. ఆ సమయమున రాజదర్శనమునకు వచ్చుచున్న శ్రీనాథుఁడు వారిసంగతి విచారించి ప్రభువుతో మనవిచేసెను. ఈయన్ని వార్తలు కోమటివేముని మనసునకుఁ జికాకుగల్గించెను. అతఁ డొకనాఁడు యువరాజుకొఱకై కబురంపెను. తురగారామయ్యకు యువరాజునొద్దఁ జనవు మెండు. అతఁ డెవరి యాజ్ఞ లేనిది యింతటి సాహసమున కొడిగట్టఁడు. మహామంత్రి తనతోఁజెప్పనిది యిట్టిపని సేయఁడు. అసలు మామిడి సింగన్నగారి కిట్టియూహవచ్చుటకేవీలు లేదు. సర్వథా తురగారామయ్య గారు యువరాజుతో నాలోచించియే యిట్లు ప్రవర్తించి యుండును. వేముఁ డిట్లాలోచించి యువరాజుకై కబురువెట్టెను. రాచవేముఁడు మహారాజు మందిరమునకు వచ్చెను. వేముఁడు కుమారు నాహ్వానించి కూర్చుండఁజేసెను. తండ్రికొడుకు లిద్దఱును గుశలప్రశ్నము గావించు కొనిరి. తఱువాతఁ బదినిముసము లెవ్వరును మాటాడలేదు. కోమటి వేముఁ డేదియోపరధ్యానముగా నాలోచించుచుండెను. యువరాజప్పు డప్పుడు దండ్రి మొగమువంకఁ జూచుచు నేదియో యూహించు చుండెను. పదినిముసములైనతర్వాత గోమటివేముఁడు కుమారుని మొగమువంకఁ దేఱిచూచుచు "నాయనా! తురగారామయ్యగారు ప్రజ

లపైఁ బన్ను లెక్కువచేసి బలవంతముగ రాఁబట్టుచున్నారఁట. ఇట్టి యాజ్ఞ నేనుగాని మహామంత్రిగాని యిచ్చియుండలేదు. ఆయనకొఱకుఁ గబురు పెట్టితిని. ఆయన యెచ్చటికిఁ బోయెనో తెలియలేదు. పోవు నప్పుడు నాయొద్దకు రాలేదు నీకేమైనఁ దెలియునేమో యని కబురు పంపితి" ననెను.

రాచవేముఁడు :— దురగా రామయ్యగారు పన్నులు బలవంత ముగా రాఁబట్టుచున్నారని తమకెవరుచెప్పిరి? బహుశః ఆ నవిరమః యెల్లయ్య చెప్పియుండవచ్చును. అతనికినిఁ దురగా రామయ్యగారికిని బడదు. తనకుఁ బశులబీళ్ళు తక్కువపుల్లరికీయలేదని పాటకుఁ బెట్టించి నాఁడని యతనికిఁ గోపము.

కో. వేముఁడు :— పశులబీళ్ళు ప్రతి సంవత్సరమును సమయ ములవారికే గుత్తకిచ్చుచుంటిమి గదా! ఇప్పుడు పాట యెందులకుఁ బెట్టవలసివచ్చెను?

రా. వే :— ప్రతిసంవత్సరమును వారికీయవచ్చును. అంతమాత్ర మున హక్కేర్పడునా? వారుమాత్రము ప్రతిసంవత్సరము వేతే 'పసికి' నమ్ముకొనుటలేదా? ఈ సంవత్సరము నగరములవారెక్కువ సుంక మిచ్చుటకు మొగ్గుదల చూపించిరఁట. ఆకారణమున రామయ్యగారు పాటకుఁ బెట్టిరి.

కో. వే :— అయినఁ దురగా రామయ్యగారిదియంతయుఁ దానై చేయలేదన్నమాట. మఱి యెగుమతి దిగుమతులపైఁగూడ సుంకము వృద్ధిచేసితిరటగాదా!

రా. వే :— పూర్వము సుంకము వస్తురూపములోఁ జెల్లించెడి వారు. దాని నిప్పుడు సొమ్మురూపములోఁ జెల్లింపుచుంటిమంతే. అది

వారు గిట్టుబడిధరలో నిత్తురుందురు. మే మమ్ముధరలో నిమ్ముచుంటిమి. ఇంతియే భేదము. ఇందునను వారికి నష్టములేదుగదా!

కో. వే:— నేదుగాండ్రపై నఁగూడఁ బన్ను లధికము చేసిరఁట. అగ్రహారములుగూడఁ బన్నులు గట్టవలెననుచున్నారఁట.

రా. వే:— మనమిప్పుడు పెద్దయుద్ధములలోఁ జిక్కుకొంటిమి. కైజీతగాండ్రకు నెక్కటివాండ్రకు వెనుకటికంటె నిబ్బడిగ సొమ్ము చెల్లింపవలసివచ్చుచున్నది. ఈయుద్ధములు కేవలము ప్రజారక్షణము కొఱకు. ఇందులోవారు కొంచెము పన్నెక్కువిచ్చిన నష్టమేమి? అదిగాక, ప్రభువుల పాలనములోఁ బ్రజలందఱు ధనధాన్య భోగభాగ్యములతోఁ దులదూఁగుచు సుంకకరణముల నేమాత్రము లెక్కచేయకున్నారు. కొమరగిరి పాలన మైనచో వీరికి బాగుండెడిది. అప్పుడు పంద్రెండేండ్లు కరవువచ్చినది. కమికెడుకూడులేక ప్రజలందఱు మాడిపోయిరి. కొమరగిరి యపుడుగూడ వారినుండి కప్పములు వసూలుచేసినాఁడు. అది వారికిఁ జాలబాగున్నది. మనమేదియో యుద్ధకాలములోఁ గొంచెము పన్నెక్కువసేయుట వారికి బాధయైనది. మఱి యగ్రహారములపై నామమాత్రముగా పన్నిమ్మంటిమి. అది యూరక లాంఛనప్రాయము. ఆ యగ్రహారములు మన పరిపాలనక్రింద నున్నవనుటకు గుర్తు.

కొడుకు చెప్పినవాదమునకుఁ బ్రతి యెట్లు చెప్పవలెనో కోమటి వేమునకుఁ దెలియలేదు. అతఁడూరక పదినిముసములకాల మాలోచించి కొడుకు మొగమువంకఁ జూచి మఱల దలవంచికొని యిట్లు చెప్పెను. “నాయనా! నేను రాజ్యమునకువచ్చి ముప్పదియేండ్లయినది. నేను రాజ్యమునకు వచ్చినసంవత్సరమే నీవు జన్మించితివి. నీకిప్పుడు ముప్పదియేండ్లు. నేను సింహాసనమెక్కునాఁటికి ముప్పదియేండ్లవాఁడను. ఈ ముప్పదియేండ్లనుండి నేను బ్రజలను గన్నబిడ్డలవలెఁ బరిపాలించితిని.

కొండవీటి రాజ్యము నాక్రిందకు వచ్చి పదునైదేండ్లయినది. అంతకుఁ పూర్వము కొమరగిరి పాలనమున డొక్కలు పీకుకొని తిన్న ప్రజలు నా పాలనమును ధర్మాన్న వేమన్నగారి పాలనముతోఁ బోల్చి చెప్పు కొందురు. నేనీ భారమును నీభుజములపైఁ బెట్టుచున్నాను. నేను జెప్పునదెల్ల నొక్కటియే. ప్రజలను బాధించి మాత్రము పన్నులు గొనరాదు. ఏ రాజు రాజ్యమునఁ బ్రజలు సుఖింతురో యా రాజు నగరమున లక్ష్మీదేవి కాపురముండును. నేను గృహరాజుమేడ పూర్తి చేయించి యందు లక్ష్మీదేవికి స్థిరనివాసము గల్పింపఁజూచుచున్నాను. అసలీసంకల్పము ధర్మాన్న వేమన్నగారి హృదయమునఁ గల్గెను. ఆయన దానికిఁ బునాదివైచినాఁడంతే. పాప మా ధర్మరాజు మఱు సంవత్సరము శివైక్యము నందెను. తరవాతఁ గొమరగిరి మొదటి యంతరువును బూర్తిచేసెను. కాని యతఁడు ప్రజలను బీడించి ధన మాకర్షించెను. పన్నులీయఁజాలని వారిని గ్రూరముగా శిక్షించెను. లక్ష్మీదేవి ప్రజాకంటకుఁడైన వాని రాజ్యమున నిల్చుటకిష్టపడలేదు. పన్నెండు సంవత్సరములు కఱవుఫలితమయ్యెను. ప్రజ లొకవంక తిండిలేక మాడి పోవుచుండగా నతఁ డొకవంక గృహరాజుమేడలో లకుమాదేవిని గూర్చుండఁబెట్టి కనకస్నానము సేయించెడివాఁడు. ఆ లకుమాదేవియే వానికి లక్ష్మీదేవియై తక్కిన రాజ్యమంతయుఁ బెద్దమ్మ పెత్తనము సేసెను. రాజెన్ని నేరములు సేసినను వానికి నిష్కృతియంచు నున్నది. గోదేవ బ్రాహ్మణ వృత్తులను రాజపహరించినందుకు నిష్కృతి యన్నదిలేదు. నేను జెప్పఁదగినదంతయుఁ జెప్పితిని. చివఱ కొకమాట. ప్రజల కేదోయొకమార్గ మలవాటైనది. ఆ మార్గమునుండి వారిని లాలనముతో నీ మార్గమునకుఁ ద్రిప్పికొమ్ము.

రాచవేముఁడు మాటాడలేదు. తండ్రిచెప్పినదంతయు నతఁ డూకొట్టుచువినెను. విన్నంతసేపు నతని మనసులో నామాటలకన్నింటికి

వ్యతిరేకపు టూహాలే తోఁచెను. తండ్రి తనకుఁ బట్టము గట్టనున్నాఁడని యతనికిఁ దెలియును. పొదకుఁ బట్టాభిషేకపు టుత్సవములకైనను వలసినంత ద్రవ్యము కోశాగారమున నున్నట్లతనికిఁ దోఁచలేదు. ఉన్న ధనమంతయి యుద్ధములక్రిందనే వ్యయమైపోయెను. అట్టిస్థితిలోఁ బన్నులు వృద్ధిసేయక ధనమెట్లువచ్చును? ఈయన యేవియో ధర్మోపన్యాసములు చెప్పును. వీనినన్నిఁటిని నాచరణలోఁబెట్టినచో బావుకొన్నట్లే. సరిగా మామిడిసింగన్నగారీయనకుఁ బ్రతి. ఆ తురగా రామయ్యగారుండఁబట్టిగాని లేనిచో నీమాత్రమైన నుండెడిదిగాదు. ఆయన నాల్గు రోజులక్రిందట నిరువదిలక్షుల టంకములు వసూలుచేసితినని వ్రాసినాఁడు. ప్రజలయొద్ద విపరీతముగ ధనము ప్రోగుబడియున్నది. ఇప్పుడీయన యింకను గృహరాజుమేడ గట్టవలెననుకొనుచున్నాఁడు. దానిక్రిందఁ గనీస మైదులక్షుల టంకములైన నగును. మఱి వసంతోత్సవమున్నది. పట్టాభిషేకోత్సవమున్నది. ఇవిగాక యీయుద్ధము లొకకొసకు రాలేదు. కనీసమింక నొకయేబదిలక్షుల టంకములనైనను బ్రోవుచేయవలయును. గృహరాజుమేడలో వట్టి లక్ష్మీవిగ్రహమును స్థాపించి ప్రయోజనమేమి? లక్ష్మీ లక్ష్మీయన్న బంగారముగాని వట్టి రాతివిగ్రహమా?

ఈవిధమైన యాలోచనము తండ్రి చెప్పుచున్నంతకాలము రాచవేముని మనసున మెదలెను. కాని యతఁడు దన యభిప్రాయమేమియుఁ బైకి రేకగానైనఁ గన్పింపనీయలేదు. అతఁడు పదిక్షణములు మాటాడక కూర్చుండి తఱువాత వినయముగా సెలవుదీసికొని వెడలిపోయెను.

కుమారుఁడు వెడలిన తఱువాతఁ గోమటివేముఁడు దీర్ఘముగా నిట్టూర్చెను. అతని మనఃప్రవృత్తి యేమియో వేమున కర్థముగాలేదు. తురగారామయ్య నతఁడు సమర్థించుట వేమునకు వింతగాఁ దోఁచెను. "ఇన్నాళ్ళును రాచవేముని మనఃప్రవృత్తి యిట్టిదని తానెఱుఁగడు.

దాని ఛాయలేవియో తానను కొన్న దానికంటె భిన్నముగా నున్నదని తనకీనాఁడు తెలియవచ్చెను. అవును వానికినిముప్పదియేండ్లు. ముప్పదియేండ్ల వానికి స్వతంత్రాలోచన ముండవచ్చును. అతఁడు తనకంటె భిన్నముగా నాలోచించినచో నాశ్చర్యపడనేల? మనమేదో పిల్లలను గని పెంచుకొనుచు. వారి కాలోచన మిట్లుండవలయునని వారి నడవడి యిట్లుండవలయునని తీర్చిదిద్దుదుము. మనకునచ్చినట్లు వారు మనము తలఁచినట్లే యుండవలయును. పెరిగినకొలఁది నాజీవుల సహజస్వభావము వారి మనసులందు వికసించును. ఆ స్వభావమునకు మనతీర్పు భిన్నము గానిచో వారిజీవితమంతయు మనయొరవడిని నడచుకొందురు. అది భిన్నమైనదా యాస్వభావ మాతీర్పునుద్రోసి రాజని దానిత్రోవనది పట్టును. తమతీర్పునకాస్వభావము భిన్నముకానప్పుడు తల్లిదండ్రులు కుఱ్ఱవానిని బాగుచేసితిమని సంతోషింతురు. భిన్నమైనచోఁ బాడై పోయెనని చింతింతురు. ఎటుచూచిన నాస్వభావమునకే ప్రాబల్య మున్నది. రాచవేమునిలోఁ దనతీర్పు ఫలించలేదని తానేల దుఃఖింపవల యును? తన్ను ధర్మాన్న వేమన్నగారు తీర్చిదిద్దెను. ఆయనతీర్పు తన యందు ఫలించినదా? ఆయన యెప్పు డనుచుండెడివాఁడు "నాయనా నేనీ రెడ్డిరాజ్యముయొక్క బరువును మీముగ్వురు కోమటిరెడ్డితో నలు వురభుజములపైఁ బెట్టుచున్నాను. కొండవీట గృహరాజుమేడగట్టి యా మేడలో లక్ష్మీదేవికి స్థిరనివాసము గల్పించెదను. ఆలక్ష్మీదేవిని మీరు నలుగురు చక్కఁగా సేవించి రక్షింపుఁడు. అప్పుడీరెడ్డిరాజ్యమున ధర్మ ధేనువు నాలుగుకాళ్ళతోఁ దిరుగును. దానికి కలియుగమున మూఁడు కాళ్ళు విఱుగనే విఱిగిపోయినవి. తక్కిన యొకకాలి తురుష్కులు విఱుగఁగొట్టినారు. ప్రోలయవేముఁడా ధర్మదేవతను నిలువఁబెట్టి యాశ్ర యము గల్పించినాఁడు. అతనియన్న మాచారెడ్డి. తమ్ములు దొడ్డారెడ్డి, అన్నారెడ్డి, మల్లారెడ్డి వీరందఱును నావెంకు నాల్గుదిక్కుల నిలువఁబడి

రక్షించుకొని వచ్చినారు. వారందఱుగలసి యీరెడ్డిరాజ్యమును నిర్మించిరి మీరందఱుగలిసి గృహరాజుమేడను గట్టుకొనుఁ” డని యాయన కన్ను మూయువేళఁగూడ మాకుఁజెప్పినాఁడు. ఆయన బ్రతికియున్నంత వఱకు మా మనసులోని యీర్ష్యలను దిగఁద్రొక్కుకొంటిమి. పవులు వారిన స్నేహములకుఁ బూతపెట్టుకొంటిమి. కాని యీ పైపై పూత లెన్నాళ్లు నిలుచును? ఆయన చనిపోయెను. మేమందరము నెవరియంత వారమువారిమైతిమి. మా మనసులలో నణగియున్న యీర్ష్యలను సహంకారములను బైకిఁ దెచ్చుకొంటిమి. కుమారగిరి తానేమో మా యందఱకుఁ బ్రభువనెను. కాటయవేముఁ డట్లనిపించెను గాన నతఁడు వానిని బ్రభువుగా నొప్పుకొనెను. తాను గోమటిరెడ్డి యెట్లొప్పుకొందురు? దానితో యాదవకులమునకు ముసలముపుట్టినది. ఆ ముసలము గాటయవేముని తలకొట్టుటతో నిలిచినది.

కోమటివేమునకు హఠాత్తుగా నాటిరాత్రి కల గుర్తునకుఁ జగిలెను. ఆ తల మెఱపులు మెఱసినట్లు పండ్లికిలించి పకి పక నవ్విన నవ్వతనికి విస్పష్టముగా గోచరించెను. అది గ్రుడ్లు మిటమిట లాడించి తన్నెంతయో వేళాకోళముచేసి వెక్కిరించెను. అది యెల్లప్పుడు తనలోనే యుండునట. దానికిఁ దన నాళ్ళు నరములన్నియుఁ దెలియునట. అన్నిటికంటె నది రెండుమాటలు చెప్పినది. ఒకటి కొందఱి నోటినుండి సత్యము వినుచుండగా నవ్వలేక పొట్ట చెక్కలగునట. తానప్పు డేమనెను? తాను జెప్పిన యేసత్యమునకది నవ్వినది?

వేమునకా సత్యమేదియో గుర్తునకు రాలేదు. అతఁడు పది క్షణములు గన్నులుమూసికొని మనసులో వెదకికొనెను. ఆ సత్యమునకు బదులు మనసులోనుండి కాటయవేమునితల పకపక నవ్వుచుఁ బైకివచ్చెను.

వేమా :— నేనే సత్యమును జెప్పితిని ?

తెల :— దాసితో బుట్టినది యాదవకులమునకు ముసలమని. గాటయవేమునకి తెల పగలబడి నవ్వెను.

వేమా :— అందులో నవ్వదగినదేమున్నది ? ఆ ముసలము నకే తలవఱకుఁ దెచ్చుకొంటివి.

తెల మఱలఁ బగలబడి నవ్వి "యది యంతటితో నాగు ననుకొంటివి పాపము. ఎంత యమాయకుఁడ" వనెను.

వేమా :— ఓయీ ! ఎందుకంత పగలబడిపోయెదవు ? నీతలతో నాగకపోయిన నీ కుమారుని తలవఱకుఁ బోవును.

తల మఱల నిబ్బడిగా నవ్వెను. "ఏమంటివి ? ఏమంటివి ? మఱలనొకమా ఱనుము"

వేమా :— పోనీ నీకుమారునితో నాగును.

తల :— పోనీ నీకుమారునితో నాగును.

కోమటివేమునకా మాటలు తనమాటలే యాతలపుఱ్ఱెలోఁ బ్రతిధ్వనించినట్లనిపించెను. అతఁడు తన్ను దాను దిట్టుకొన్నట్లు, తన నాలుక తాను గఱచుకొన్నట్లు, తననీడ తనవెన్ను చఱచినట్లు, బాధ పడెను. అతనికాబాధతోపాటు కోపము ధూమాయితమై మనసునందు దట్టముగాఁ బూతవ్రైను. ఆపొగ తెరచాటునఁ గాటయవేముని తల కండ్లు మెఱమెఱలాడించి పండ్లు పకపకలాడించెను.

వేముఁడు బిగ్గఱగా "నీవు పట్టి యనాథవు. ఇప్పుడు సిద్ధమైతి వేమి ?" యని విసివికొనుచుఁ గన్నులు తెఱచెను. ద్వారమునొద్ద

మనిషివచ్చుచున్న సవ్వడితవిలెను. క్షణములో వేమాంబ యతని ముందుఁ బ్రత్యక్షమయ్యెను. వేమాంబనుజూచి యతఁడు మిక్కిలి నివ్వెరపడెను. అబ్బ! తాను నేడెట్టి దుర్వేళలేచెను? బహుశః ఆమె తనమాట వినియుండదుగద! అతని మొగమునఁ గత్తివాటునకైన నెత్తురుచుక్క లేదు. అతఁడు వచ్చినకూఁతును బలుకరించనైనలేదు. అతనిమనసాడలేదు. అతనిచూపులలోఁ జైతన్యము లేదు. వేమాంబ మెల్లగాఁ దండ్రిని సమీపించి "నాన్నగారూ!" అని పిలిచెను. వేముఁడు తన్నుదాను సంబాళించుకొనెను. అతఁడు "అమ్మా! నీవింత యపవేళ వచ్చితివేమి?" యనెను.

వేమాంబ :— నాకు మొన్నమీరు చెప్పిన పాఠము చాల భాగము వచ్చినది. అందులోఁ జివరిభాగముమాత్రము కొంచెము సట్టుగానున్నది. మఱలనొకసారి చెప్పుకొనిపోవుదమని వచ్చితిని.

వేమారెడ్డి :— నీకేపాఠమును జెప్పితినమ్మా?

వేమాంబ :— మలహరి రాగములో భావశబలత నడుకుట చెప్పితిరి. చింత, త్రాసము, విషాదము లడుకుటవచ్చినది. నిర్వేద మడుకుట రాలేదు. వాయించి వినిపింతునా!

వేమాంబ మలహరి రాగమునకు వీణ మేలవించి పాడఁదొడఁగెను.

వేమాంబ మెత్తని కంఠస్వరమునందు స్వరస్థానములు విస్పష్టముగా భాసించెను. ఆమె రాగమునంతయు మొదటఁ గ్లుప్తముగఁ బాడి తముళైత మఱలఁ బ్రస్తరించి పాడఁదొడఁగెను. రాగమును ఖండించి యొకొక్కభాగమునే సహస్రధా విభాగించి యాయాస్వరస్థానములు చూపుగొన్నట్లు తీర్చుచుఁ బాడఁదొడంగెను. ఆయా భాగములను

నామె వాయించుచున్నప్పుడు చింతా త్రాస విషాదభావము లుల్బణములై భాసించెను. నిర్వేదభావమునకు స్వరస్థానముల సరిగా నడుకుట యామెకుఁ దెలియలేదు. ఆభావమునొద్దకువచ్చుసరికి నామె పాడుట యాపివైచి తండ్రి మొగమువంకఁజూచెను. వేముడు "చక్కఁగా నభ్యసించితివమ్మా! ఒక భావమునుండి మఱియొక భావమునకు మాఱునప్పుడుగూడ గమకము చెడిపోకుండ మంచినేర్పు చూపించితి" వనెను.

వేమాంబ:— నే నిదియంతయు నీమూడురోజులనుండి సాధన చేసితిని. కాని రాగముయొక్క నాల్గవభాగమున నిర్వేద మెట్లడుకవలయునో తెలియలేదు.

వేమారెడ్డి:— అదియేమియు గష్టములేదమ్మా! భావమునకుఁ గొన్ని కోణములుండును. ఏకోణమునుండి ప్రదర్శించిన నాయాభావములు రమణీయములగునో తెలిసికొనవలయును. భావవ్యక్తిలో మిక్కిలి కష్టమైనభాగ మిదియే సాహిత్యమునం దిది మఱియుఁ గష్టము. సంగీతముకంటె సాహిత్యమునందు దానికి స్పష్టత యధికము. కాన నచ్చటి దానిని బ్రదర్శించుటలో నెక్కువ నేర్పు గావలయును. ఇదిగాక భావమునకు జాలియని యొకటున్నది. ఒకేయొకభావము భిన్నరసములకు వ్యంజకమగును. ఒకొక్కచోట నదియేప్రధానముగా నుండును. ఆయారసములను బట్టియు, దాని ప్రాధాన్యమునుబట్టియు, దానిజాతి నిర్ణయించుకొనవలయును. ఆభావముయొక్క జాతినిబట్టి దాని నేకోణమునుండి యభివ్యక్తము చేయవలయునో తెలిసికొనవలయును. ఇదియే సంగీతసాహిత్యములందు బరమరహస్యమైన విషయము. ఇది తెలిసిన రాగసంచారమునందు దాని నెట్లడుకవలెనో దానియంతట నది తెలియును. ఇప్పుడీ రాగమునందు భావశబలత ప్రధానము. చివరిభాగమునందు స్వరములను దేల్చి యవరోహణము చేసినచో వెనుకటి విషాద

భావము నిర్వేదమునందు లయముపొంది యారెండుభావములకు శాబల్య మేర్పడును. నిర్వేదము హృదయమును స్పృశించి యాలోచనా విషయమై దాని పరిణామము గోచరమగును. అట్లుగాక స్వరములూది పలికినచో దానికి స్పష్టాభివ్యక్తివచ్చి యదిప్రధానమై తక్కిన భావముల యనుభూతి హృదయమున మఱుగువడి భావశబలత చెడిపోవును. చింత త్రాసమునందు లయించి, త్రాసము విషాదమునందు లయించి, విషాదము నిర్వేదమునందు లయించి భావశబలతను దెచ్చును. ప్రధానముగా నిర్వేదమే భావశబలత. దానియందు దత్పూర్వ భావముల రంజనమంతయు నుండును. కావున నారంజనమునుమించి దానికి నభివ్యక్తి యుండరాదు. అనగా రాగమునందుఁ దక్కిన మూడు భాగములందు గాక నాల్గదభాగమునందే భావశబలత యేర్పడును. ఈశబలత నిక్కడ దెచ్చుటకై తక్కినదంతయుఁ బ్రయత్నము. కావున నీభాగము మిక్కిలి కష్టమైనది. నేను బాడిచూపించెదను.

వేముఁడు వీణను జేతఁ బట్టి వాయించుచు బాడఁ దొడంగెను. అతఁడు చెప్పిన పాఠమంతయు వేమారెంబకుఁ జేతిమీఁదఁ బలికించి చూపించెను. అతఁడు పాడినంతకాలము నారాగములా భావములు ప్రాణవంతములై కన్నులముందుఁ దిరుగుచున్నట్లుండెను. అతఁడు చింతాభావము నావిష్కరింపఁజేసి దాని పొంగంతయుఁ జూపించి తఱువాతిమెట్టునకుఁ బోవును. త్రాస మావిష్కరించి దానియందు సగము చింతాత్వము సగము త్రాసత్వము గోచరించును. చివఱకా చింత త్రాసమునందు లయించి యాత్రాసముదూపు తేఱి, సుఱిగిపోవు చున్న చింతారంజనముమాత్రము దానియందు మిగులును. విషాదము పట్టినప్పుడు చింతారంజితమైన త్రాసము దానియం దర్ధమైతోఁచి తుదకు దానియందు లయించి దాని రంజనముతోడి విషాదము నిలు

చును. అతఁడు చరమభాగమున నిర్వేదమునుబట్టి విషాదమును దానియం దర్థముగా మెఱపించి స్వరములను దేల్చి వదలివేసెను.

వేమాంబకుఁ దండ్రి పాటయాపినసంగతి తెలియలేదు. విషాద సమ్మిశ్రితమైన నిర్వేద మామెహృదయములో నర్ధనారీశ్వరమూర్తియై తోఁచెను. ఆమె యాతోఁచినమూర్తి నట్లే ధ్యానించుచుగూర్చుండెను. కొలఁదికాలమునకా విషాదము జారిపోయి యా నిర్వేదము రూపు గట్టెను. మఱికొంచెముకాలమునకా నిర్వేదముగూడ నేదియో యొక యనంతభావమునందు లీనమైపోయెను. ఆమె రెండుమూడు క్షణములా యనంతత్వము ననుభవించెను. ఆమె కన్నులు తెఱచి చూచుసరికి వేముఁ డచ్చట లేఁడు. అతఁడు గవాక్షమునొద్ద నిలిచి యాకసము లోనికిఁ జూచుచుండెను.

వేమాంబ సెలవుదీసికొని వెడలిపోయెను. ఆమె వెళ్ళినసంగతి వేముఁడెఱుఁగఁడు. ఆమె వెళ్ళివత్తునని చెప్పినప్పుడతఁ డూరక తల త్రిప్పెను. అతఁడట్లే నిలిచి యాకసమువంక నూఱక చూచుచుండెను. "ఈ సంగీత సాహిత్యములకీ యనంతత్వమునకీ కాలభావమున కేదో సంబంధమున్నది. ఈ స్వరమున కాధారముగా నేదియోయొక మహా భావమున్నది. ఈ యన్నింటి యడుగున నది నిల్చి వీనియన్నింటియం దొక సాజాత్యమును దీపింపఁజేయుచున్నట్లున్నది. చూడఁగాఁ జూడఁగా నివియన్నియు నా మహాభావమునందు ముడివడియున్నవి. ఆ ముడిని బట్టుకొని విప్పవలయును. ఆఁ ఆఁ అదియేది? అ పెద్దియజ్వగారుచెప్పిన మహాకాలభావమా?" అతని నోటివెంట నప్రయత్నముగ "నామహా కాలుఁడు మృత్యుంజయుఁడు". ఈ క్షణాత్మకమైన కాలముమృత్యువు. ఈ కాలచక్రమున జీవుఁడు బంధింపఁబడినాఁ" డని వెలువడెను. వెనుక నుండి యెవరో మహారాజా! మహారాజా! యని గట్టిగాఁ బిలిచినట్లు

య్యెను. ఆ కీలుపురసందు ద్వారా గోచరించుచుండెను. వేమారెడ్డి వెనుదిరిగి చూచెను.

వేమా :— ఏమిరా! ఎక్కడనుండి వచ్చితివి?

వ్యక్తి :— ప్రభూ! మోటుపల్లినుండి వచ్చితిని. ఇనుకొల్లునొద్ద మనసేనలకు విజయము లభించినది. చాండపామాత్యుడు వెనుదిరిగి కందుకూరివైపు పారిపోయినాడు మనకు ఘనవిజయము లభించినది. కాని కాని.

వేమా :— కాని కాని యేమిరా? అదియేదియో చెప్పుము సందేహించెద వెందుకు?

వ్యక్తి :— సోమదేవచోడ మహారాజువారు శత్రుసైన్యములకు బందీగా జిక్కిరి. గజరావు తిప్పనాయనింగారు మాచారెడ్డివారు వారిని విడిపింపవలయునని మిక్కిలి ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయెను.

వేముడు పదిక్షణములు మాటాడలేదు. తరువాత నతడా వార్తాహరునిజూచి సరే నీవు పొమ్మనెను. వార్తాహరుడు వెడలి పోయెను. వేముడు "చాండపామాత్యుడు సోమదేవచోడుని బందీగా గొనిపోయినాడు. నే ననుకొన్నంత జరిగినది."

"కనులయెదుటఁ గన్పించున దంతయు వట్టివార్త, మానిక విలసనము. వట్టి యెండమావులు." అని యతని మనసులో నస్పష్టముగా భాసించెను. వేముడు తల యాడించి మేడమెట్లు దిగిపోయెను.

౭

మోటుపల్లినుండి మాచారెడ్డి గజరావు తిప్పనాయడు తిరిగి వచ్చిరి. మాచారెడ్డి మొగమునఁ గత్తివాటువైచిన నెత్తురుచుక్క

లేదు. అతనికొక్కటియే యాలోచన. అన్న దేవచోడుని మొగ మెట్లు చూతుమని. గజరావు తిప్పనాయఁడు మొగమున గంటుపెట్టుకొని యుండెను. చాందపామాత్యుఁడు ప్రాణములతోఁ దప్పించుకొని పోయెనని యతఁడు నిద్రలోఁగూడఁ గలవరించుచుండెను. అతఁడు వేమారెడ్డితోఁ "చేయిజారిపోయినది. నేనచటికి వెళ్ళునరికే చేయిజారి పోయినది. మీకాసంగతి కబురుచేయకుండ సవరించుకొనఁగల్గుదు మేమో యని యూహించితిమి. మా చేయగల్గినదంత చేసితిమి. కాని యేమిప్రయోజనము! శత్రువులను దిరుగఁగొట్టితిమిగాని కుఱ్ఱవానిని విడిపింపలేకపోతిమి. మీతో నిట్లు చెప్పవలసివచ్చినది. ఇది కేవలము దైవకృతము. కాని యొకటిమాత్రము చేయఁగల్గితిమి. ఆ చాందపామాత్యుని నాలుగు నెలలవఱకుఁ గోలుకొనకుండఁ జితుకఁగొట్టితిమి. ఇఁక బ్రతికియుండగాఁ గొండవీటిపైకిఁ దిరిగిరాలేఁ" డనెను. వేమారెడ్డి "నాయఁడుగారూ! మీరేమిచేయుదురు? మీరు చేయ గల్గినదంతఁ జేసితిరి. దైవము ప్రతికూలించినప్పుడు మీ లోప మేమున్నది? నిజముగా నిదియంతయు నాలోపము. నేను సోమదేవుని బంపవలసినదిగాదు. చేయిదాటిపోయినదానికి మీరేమిచేయుదురు? మీరేమియుఁ గించపడకుఁ" డని యాతని నోదార్చెను.

నగరమునగరమెల్ల విజయోత్సవములు దీపించినను నొకప్రక్క నుండి యా దీప్తియందు విషాదచ్ఛాయ గోచరించుచునే యుండెను. సోమదేవచోడుఁడు శత్రువులకుఁ బట్టువడ్డసంగతి యూరెల్ల వ్యాపించెను. ఈ వార్త యంతఃపురమునకుఁ దెలియకుండఁ జూడవలెనని వేమారెడ్డి మిక్కిలి కట్టుదిట్టములు చేసెను. కాని యది యెట్లో యచటఁ దెలియనే తెలిసెను.

మహారాణి సూరాంబ యీ వార్త విని నివ్వెరపోయెను. ఆమె
కిరువురే సంతానము. పుట్టినదే యిరువురు. అందుఁ దొలికాన్పు
రాచవేముఁడు. రాచవేముఁడు పుట్టినతరువాతఁ బండ్రెండేండ్లవఱ
కామెకుఁగాన్పు రాలేదు. తన కొక యాఁడుబిడ్డ గల్గినచో నొక పెద్ద
చెర్వు త్రవ్వింతునని యామె శ్రీశైలస్వామికి మ్రొక్కుకొనెను. తరు
వాత నామెకడుపున వేమాంబ పుట్టెను. వేమాంబ పుట్టిన వేళావిశేష
ముచే వేమారెడ్డి కొండవీ డాక్రమించుకొనఁగల్గెను. కొమరగిరిపాలన
మునఁ బదిరెండేఁడులు డొక్కలకఱవై ప్రజలు మలమల మాడిపో
యిరి. సూరాంబ వారినిజూచి జాలిచెంది తాను మ్రొక్కుకొన్నట్లుగా
నొక పెద్ద తటాకమును త్రవ్వించి దానికి సంతానసాగరమని పేరు
పెట్టించెను. ఆచెఱువుక్రిందఁ బ్రజలు రాజనములు పండించి సూరాంబ
కంటిచలువను వేనోళ్ళ శ్లాఘించిరి. సూరాంబ వేమాంబను గన్నులలోఁ
బెట్టుకొని పెంచెను. వేమాంబకు వయసువచ్చెను. తరువాత సోమదేవ
చోడుఁడు కొండవీడు వచ్చుటయు వేమాంబ కాతనిపైఁ జూపు నిలుచు
టయు సంభవించెను. రాజును రాణియును నా సంగతి విని మిగుల
సంతోషించిరి. వారిద్దఱి వివాహ మీపాటికి జరిగియుండవలసినదే.
కాని యీ యుద్ధములబెడద యొకటి తలపై వచ్చికూర్చుండి యా
వివాహమునకు విఘాతము కలిగించెను.

వేమారెడ్డి కీవార్త తెలిసినప్పటినుండియు మహారాణి మందిర
మునకుఁ బోలేదు. వేమాంబ సంగీతపాఠమును జెప్పించుకొనుటకై
యప్పుడప్పుడు మహారాజు మందిరమునకు వచ్చుచునే యుండెను.
వేమాంబ సంగీతము చెప్పుకొనుట యదియొక విచిత్రము. ఆమె సంగీ
తమునందిప్పటికె చాల పండితురాలు. కీర్తనలందును రాగములందును
రసభావాది మేళనము సాధనసేయుటకై యామె మహారాజు నొద్దకు

వచ్చును. వేమారెడ్డి ప్రత్యేకరసభావములకు రాగమేళనము చేసెను. తండ్రిచెప్పినపాఠ మామె బాగుగా నభ్యసించినగాని మఱల నాతని యొద్దకు రాదు. ఒకప్పుడామె మూడునాల్గు రోజులవఱకు రాదు. ఒకొ్కకప్పుడు రెండుమూడు రోజులువఱుసగా వచ్చును. అది యామె పాఠమునుబట్టియు భ్యాసమునుబట్టియుండును. ఇప్పుడీ వార్తవచ్చిన తఱువాత నీనాల్గురోజులలో నామె వేమారెడ్డియొద్దకు రెండు పర్యాయములు వచ్చెను. ఈరెండు పర్యాయము లామెముఖమున నావార్త తెలిసిన చాయ రేకగానైనఁ గాన్పింపలేదు. ఆమె మొగములోని సారళ్యము నామెచూపులలోని మెత్తదనమును బూర్వమట్లే పసిపాపనవ్వువలె నిర్మలముగా నుండెను. ఆ కడపటిపర్యాయమామె మలహరి రాగములో భావశబలత నదుకుటచక్కఁగా వచ్చెను. నాఁడామె వేమునికంటెఁగూడ నొకమెట్టు పైకిఁబోయివాయించెను. ఆమె రాగముయొక్క చివరిభాగమును దేల్చివైచి విషాదమిశ్రితమైన నిర్వేదభావమును స్పృశించి వదలెను. నిర్వేదము మెఱపుమెఱసినట్లె యామె యెఱుఁగని యామె స్థితితోఁగూడి వేమారెడ్డి హృదయమును మథించివేసెను. వేమారెడ్డి కన్నులప్పళించుకొనెను. వేమాంబ 'నాన్నగారు! నాకీపాఠము చక్కఁగా వచ్చినది గదా! ఇఁక రాగమునందు రసమేళనము చెప్పు' డనెను. వేమారెడ్డి యామెకుఁ దొలుత శృంగారరసమునకు రాగమేళనము చెప్పెద ననెను. వేమాంబ తొలుతఁగాఁ గరుణరసమునకుఁ జెప్పుడనెను. వేమారెడ్డి "యమ్మా! నాకు నేఁడెందుకో మనసు బరువుగానున్నది. తఱువాతఁ జెప్పెదనులే" యని యామెను బంపివైచెను.

ఆ సాయంకాలము రాణీమందిరమునుండి యొకసారి పర్యాయము వచ్చిపోవలసినదని వేమారెడ్డికిఁ గబురువచ్చెను. వేమారెడ్డికిఁబోక తప్పలేదు. బాజారు జాతులతోనె సూరాంబ కన్నులనీరుఁ దెచ్చుకొనెను.

రాజామెనూరడించుటకు మిక్కిలి ప్రయాసపడెను. నే నెట్లైనను వసంతోత్సవములలోపలనే సోమదేవుని విడిపించు నేర్పాటుగావింతు నని యామెచేతిలోఁ జేయివైచి చెప్పెను. రాణి "పిల్ల మిక్కిలి పేద గుండెది. ఈవార్త తెలిసి యేమియగునో! వసంతోత్సవమింకను రెండు నెలలున్నది. అమ్మో! అంతకాలమూగుటకు వీలులే" దనెను. వేమారెడ్డి "ఇది నిముసములమీఁద జరుగుటకంత తేలికైనపనియా? ఈ లోపుననే త్వరలో విడిపించు నేర్పాట్లుగావింతును, మహామంత్రి యింకను రాలేదు. నీవూరక ధైర్యము చెడిపోయి పిల్లను గందరగోళపెట్టకుము. అసలు కార్యము చెడిపోవును. ఇప్పటి కింకను వేమాంబకుఁ దెలిసినట్లు లేదు. ఆమె నేఁడే నాయొద్దకుఁ బాఠము చెప్పించుకొనుటకు వచ్చినది. ఆమెకుఁ దెలియకుండ వలసిన కట్టుదిట్టములన్నియుఁ గావింపు" మని యామె నొప్పించి బయటపడెను. సూరాంబ కన్యాకాంతఃపురమునుండి బేటీజనమునకెల్ల నీవార్తను వేమాంబకుఁ దెలియకుండ జాగ్రత్తపడు డని గట్టికట్టడి యొనర్చెను.

మఱియిరువదిరోజులుగడచి మహామంత్రి కొండవీటికిఁ దిరిగి వచ్చెను. నగరమునకు వచ్చుటతోడనే యతనికి సోమదేవుఁడు పట్టువడిన సంగతి తెలిసి మిగులఁ జీకాకు గల్గించెను. అతఁడు పథిశ్రమమైన వాపికొనకుండగనే రాజదర్శనమునకుఁ బోయెను. రాజప్పుడే పురాణ గోష్ఠి ముగించి శ్రీనాథయ్యగారితో నేదియో మాటాడుచుండెను. అతఁడు మామిడిసింగన్నను జూచి ప్రియముగా నాహ్వానించి కూర్చుండఁ జేసెను. సింగన్నగారిని జూచుటతోడనే వేమునికి భుజములపై నుండి తట్టెడుబరువు దించినట్లయ్యెను. అతఁడు సింగన్న మొగమువంకఁ జూచుచు "మీరు వినియేయుందు రనుకొందును. అది యట్లు జరిగి పోయిన" దనెను.

సింగన్న :— అవును. వింటిని. అసలు జరుగకూడని పొరపా టెప్పుడో జరిగినది. ఇది యిట్లు జరుగునని నేనప్పుడే యనుకొంటిని. తురగా రామయ్యగారు చక్కగా సాగివచ్చెడి కార్యమును బాడుచేసి నారు. మహాప్రభూ! మనము కార్యమంతయుఁ జక్కగా నాలోచించి నడుము నేకిరోయొక చిన్న పొరపాటు చేయుదుము. అది పర్యవసాన మునఁ బ్రాణముపై కి వచ్చికూర్చుంచును. నేను యువరాజుతో రాజ మహేంద్రవరము పోకుండ నున్న బాగుండెడిది. అప్పుడీ యిక్కట్టు సంభవించెడిదిగాదు. మఱి నేను బోక తప్పనిసరియైనది.

వేమా :— అవును నేనప్పుడేదో యాలోచనలో నుంటిని, ఆ రామయ్యగారు వానిసిబాసకతీఅదన్నారు. నేను బరధ్యానముగ సరే యంటిని. అది యట్లు జరిగిపోయినది. మనమే యుపాయముచేతనై నను సోమదేవుని వసంతోత్సవముల లోపల విడిపింపవలయును. ఆ మార్గమేదో యాలోచింపుడు.

సింగన్న :— మహాప్రభూ! చేతులు కాలిన తర్వాత నాకుల నెట్లును బట్టుకొందుము. కాని యీనష్టము కూడివచ్చునదిగాదు. దీని వలన నెంతయో పని చెడిపోయినది. నేనుగట్టిన మేడ యంతయు, బడి పోయినది. ఇప్పుడు మఱలఁ బునస్సృష్టి. సరే! జరిగినదానికి విచారించి యేమి ప్రయోజనము? రాజమహేంద్రవరమునుండి మఱల నేమైనఁ గబురు వచ్చినదా? మాతమ్ముఁడు ప్రగడయ్య యచటనుండి యింకను దిరిగివచ్చినట్లు లేదు.

వేమా :— ప్రగడయ్యగారు కొండపల్లిచేరినట్లు వార్తవచ్చినది. ఆయన నేఁడో రేపో యిచటికి రాగలఁడు. ఆయన నందికంత పోతరాజు కటారిని కాటయవేముని కొమరుఁడు కొమరగిరిని దీసికొనివచ్చు చున్నాడట.

సింగన్న :— ప్రగడయ్య యెక్కడే వచ్చుచున్నాఁడా? అతఁ డొక్కఁడే వచ్చినచో గొంత యదృష్టమే. అతనితో నన్న దేవ చోడుఁడో, యతని బావమఱది పిన్నుండి రాజో వచ్చినచో వారి కేమి చెప్పుదు మో యాలోచింపవలయును.

వేమా :— మాచారెడ్డి రెండు మూడు దినములక్రిందటనే కొండవీడు బయలు దేరిపోయెను. వా రెవరైన వచ్చిన వారినతఁడచట నాపివేయఁగలడు.

తఱువాత వేమారెడ్డి సింగన్నగారిని భామినీసుల్తానులయొద్దకుఁ బోయిన రాయబారమునుగుఱించి యడిగెను.

సింగన్న :— ఆ మహమ్మదీయులతో వ్యవహరించుట యంత తేలికపనిగాదు. వారినిమనము సాయముకోరినట్లుండగూడదు. వారికిని విజయనగర రాజులకును సహజముగానున్న వైరమును నేను ప్రకోపింపఁ జేసితినంతే. మన మేమైన వారినర్థించినట్లు కన్పించినదా వారు మనలను గూడ మ్రింగుటకుఁ బొంచుండెదరు. అటునుండి యా పులి గాండ్రించుచున్నదను భయమిా విజయనగరరాజులకుఁ గల్పించి వీరి యొద్దనుండి మనము తప్పుకొనవలయును. వారిబలము వీరికి వీరిబలము వారికి మనము తులాదండమువలెఁ దూచుచుండవలె నంతే. ఒక దానిపై నొకటి ముల్లుసూపినదా మనప్రయోజనము నెఱవేఱదు. ఇటు వారికి వీరికిఁ బోటీపెట్టి మన మల్లాడ రెడ్డిని దేలికగా నణగ ద్రొక్కవచ్చును. అప్పుడు మన రాజ్యము సింహాద్రివఱకు నిష్కంటకమై మనము కాలూది నిలుచుటకు వీలుచిక్కును. కావున నేఁ జేసినదెల్ల భామినీసుల్తానును విజయనగరముపైకిఁ బురికొల్పితినంతే. నేనుగోరిన దెల్ల వారితో వట్టిస్నేహమేకాని సాయముగాదు. అవసరమైనచో వారంతటవారే మనకు సాయమువచ్చు స్థితిలోకి వచ్చినారు.

వేమా :— మీ ప్రతిభ నాకుఁ దెలియదా! మిమ్ము గుఱించి “యువనాధీశసభా నిరంకుశవచో వ్యాపారపారంగతా!” యని శ్రీనాథయ్యగారు ఇదివఱకే వ్రాసిరిగదా! మీ రెక్కడ నెట్లు మాట్లాడవలయునో యట్లే మాట్లాడుదురు.

సింగన్న :— మాకుఁ గావలసినది పట్టిస్నేహమే కాని సాయము గాదు. మాకు శత్రువుల నోర్చుటకుఁ గావలసిన బలము పుష్కలముగా నున్నది. వెలుగోటి రాయపనాయకుని, గజరావు తిప్పనాయని సన్న దేవచోడుని బల సంపదలు పరాక్రమము మీ రెఱిగినదే కదా! అదిగాక మీ సామంతులు రాచకొండ దేవరకొండ వెలమదొరలు మాయన్న దేవచోడునికిఁ బ్రాణస్నేహితులు. వారి సాయము మాకుండనే యున్నదని బెట్టుపెట్టి చెప్పితిని. ఒకప్రక్క గజపతి, యొక ప్రక్క నరపతి. భామినీ రాజ్యమును గబళించివేయుటకు బన్నుచున్న పన్నాగములను గుఱించి చెప్పితిని. వారిద్దఱికిమధ్య కొఱకరానికొయ్యలము మీరును మేమునుంటిమి. ఒకరినివదలి మఱియొకరిని సాధించినచో రెండవవారిని దేలికగా సాధించవచ్చునని వారి యూహ. మా సామంతుఁడైన కాటయవేమునితో మాకువచ్చినవిరోధమును సాకుగాఁ దీసికొని వారు మాపైఁ గత్తిదూయుటకుఁ బన్నుచుండిరి. ఈ విజయనగర రాజు మాబల మేమియో పట్టిచూతమని మోటుపల్లిపైకిఁ జౌండపామాత్యుని బంపినాఁడు. గజరావు తిప్పనాయఁడీ పాటికి వారి తల దిమ్మరాచియుండును. వారుమమ్ము సాధించిరా! రేపుమిమ్ము సాధింతురు. కావున మనము స్నేహముగా నుండుట యుభయరాజ్యములకు శ్రేయస్కరమని నచ్చఁజెప్పితిని. నేను గలబరిగ పట్టణమునందు బది దినము లుండవలసివచ్చెను. ఈపది దినములు సుల్తాను నన్ను విశేషముగా గౌరవించెను. నాతో నేకాంతముగా నాలోచనములు చేసెను. “నా

సై న్యసంపదనంతయు మీచేతిలోఁ బెట్టుదును. మీరు కాకితోఁ గబురు పంపుఁడు నేను మీయాజ్ఞ ప్రకారము నడచుకొందు" నని యెన్నియో విధములఁ జెప్పెను. అతఁడు నాకుఁ బూర్తిగా వశుఁడయ్యెను. నే నతనిని వసంతోత్సవముల కాహ్వానించితిని. తరువాత నేను రాచకొండ దేవరకొండలు మీదుగాఁ దిరిగి వచ్చుచు నెందుకైన మంచిదని యా వెలమదొరలనుగూడఁ జూచితిని.

వేమా :— ఆవెలుగోటి వెలమనాయకులకును మాకును గుటుంబ వైరమున్నది గదా! వారిని జూచుటవల్లఁ బ్రయోజన మేమి?

సింగన్న :— నేను గేవలము వారిని జూచుటకుఁ బోలేదు. వారి యాస్థానమున నాసహాధ్యాయులు పెద్దిభట్ట మల్లినాథు లున్నారు. వారినిజూచి వత్తమని పోతినంతే. అక్కడకుఁ బోయిన తర్వాత నా కీయూహ పుట్టెను. వారికిని మనకును బూర్వవైరముండవచ్చును. వారును మనమును బ్రత్యేకముగఁ బోట్లాడుకొనినది లేదుగదా! వారికిఁ గొమరగిరిపై విరోధ మెక్కువ. కాటయవేమునిపై విరోధ మెక్కువ. వారిని సాధించుటకు వా రన్న దేవచోడునకు సాయము వచ్చిరి. వారును మనమును గలపి యన్న దేవచోడుని పక్షమునఁ గాకరపర్తియొద్ద నెల్లును బోరాడితిమిగదా! వారితో స్నేహముసేసిన దోష మేమున్నది? అదిగాక తాతలనాటి వైరమును దరతరముల వెంటఁ ద్రవ్వికొనుచు బోవుట రాజనీతిగాదు. వారినిగూడఁ గట్టుకొనుట మనకు మిక్కిలి మంచిది. ఒక వేళ నీభామనీ సుల్తానులే మన పైకి వత్తురేమో? అప్పుడీ వెలమవులు లెంతైన నుపయోగింపఁగలవు. వారు శౌర్యము కలిగిన గట్టినజాతి. అట్టివారు మనతో విరోధించి, కొమరగిరితో విరోధించి, విజయనగరం రాజులతో విరోధించి భామినీ సుల్తానులకు సామంతులు గావలసి వచ్చెను. వారి కీసామంతత్వము నామమాత్ర మేర్పడినను భరించుట

కష్టముగానే యుండును. వారిని మనము కూడగట్టుకొంటిమా భామినీ సుల్తానుల భయము మనకుండదు. ఆమహమ్మదీయులను వారు క్షణములో విదళించి యావల పాఱవేయుదురు. నేను వారితో మైత్రికిం బునాది కాకరపర్తియొద్దనే వైచితిని. ఇప్పుడు దానికించుక దోహదముగా నుండునని వారితో మాటాడి వచ్చితిని. వసంతోత్సవములకు వారుగూడ రాఁగలరు.

వేమా :– మహామంత్రీ! మీ రేది యెందుకుఁ జేసెదరో నా కేల? మీరు బృహస్పతిని మించినవారు. మీ చాణక్య ప్రతిభ ముందుఁ గాటయవేమునివంటివాఁడు నిలువఁజాలకపోయెను. నా సైన్యసంపదయంతయు నొకయెత్తు. మీ బుద్ధిబలమొక యెత్తుగా నింతకాలము నా రాజ్యము సాగినది. ఇప్పుడీ సోమదేవుని విడిపించి యారాచవేమునకుఁ బట్టాభిషేకము చేయించుఁడు. నా బరువంతయుఁ దీరిపోవును.

సింగన్న సెలవుదీసికొని వెడలిపోయెను.

మఱి రెండురోజులు గడచినతరువాతఁ బ్రగడయ్య వచ్చెను. అతఁడు వచ్చునప్పుడు కొమరగిరిని మాత్రమే కొనివచ్చెను. నందికంత పోతరాజు కటారిని గొండపల్లివఱకతఁడు తెచ్చెను. కాని మాచారెడ్డి యా కటారిని దాను వసంతోత్సవములకుఁ గొండవీడు తెచ్చునని వేమారెడ్డితో విన్నవింపుమని చెప్పెను. ప్రగడయ్య రాజదర్శనమునకుఁ బోవునప్పటి కచట మామిడి సింగన్న శ్రీనాథయ్య వామనభట్టు నుండిరి. వామనభట్టుగూడ నప్పుడే విజయనగరమునుండి తిరిగివచ్చెను. రాజు ప్రగడయ్య నాహ్వానించి కూర్చుండఁజేసెను. వామనభట్టు వారికి విజయనగరవృత్తాంతములను జెప్పుచుండెను.

వామనభట్టు వేమారెడ్డి యాస్థానకవి. అతఁడు సంస్కృతమునఁ జాలగొప్ప పండితుఁడు. అతఁడు గొప్ప పండితవంశమున జన్మించెను. అతనితండ్రి కోమటియజ్వయు తాత వరదాగ్నిచిత్తునుగూడ విజయనగరాస్థానమునఁ బండితులుగాఁ గవులుగా వాసికెక్కిరి. వామనుఁడుగూడఁ దన విద్యాభ్యాసమంతయు విద్యానగరముననే కావించి యుండెను. అతఁడు వేదవేదాంగాదివిద్యలన్నియుఁ గూలంకషముగఁ దన తండ్రియొద్దనే యభ్యసించెను. శ్రీ విద్యారణ్యస్వామియొద్ద వేదాంతవిద్య నుపదేశము పొందెను. అతఁడు మిక్కిలి బాల్యముననే యొకభాణమును రచించెను. దానిపేరు శృంగారభూషణము. అది రచించునప్పటి కతనికిఁ బదునాఱు పదునేడేండ్ల వయసు. ఆ వయసుననే కనకలేఖాకల్యాణ మను మఱియొక సంస్కృత నాటకమును రచించెను. ఆ శృంగారభూషణభాణము పంపావిరూపాక్షశివుని చైత్రయాత్రా మహోత్సవ సందర్భమునఁ బ్రదర్శితమయ్యెను. దానిఁజూచి ప్రౌఢదేవరాయల ప్రధాన దండనాథుఁడైన లక్ష్మణదండనాథుఁడు మిక్కిలి యాశ్చర్యపడి యతనిచేఁ గనకలేఖాకల్యాణమును వ్రాయించెను. ఆ నాటకమును జూచి ప్రౌఢదేవరాయని బంధువును సామంతుఁడును మహాపండితుఁడు నగు చంద్రభూప క్రియాశక్తిరాయలు వామనుని 'సాహిత్య చూడామణి' యనియు 'సాహిత్య సామ్రాజ్యధురంధరుఁ' డనియుఁ బ్రశంసించెను. తఱువాత వామనభట్టు శీతాచలపర్యంతము పర్యటనముగావించెను. అనేక రాజస్థానములను జూచెను. తుట్టతుద కతఁడు కొండవీటఁ గోమటివేముని యాస్థానమునఁ గుదురుకొనెను. అతనికిఁ గోమటివేమునివంటి పండితప్రభు వెచ్చటను గన్పించలేదు. కేవలము కోమటివేముని సాహితీవైదుష్యమే యతని యాదరముకంటె దాతృత్వముకంటె నా మహావిద్వాంసుని గట్టివైచెను. కొండవీటికి వచ్చిన తర్వాత నతఁ డనేకగ్రంథములను రచించెను. 'పార్వతీ పరిణ

యము’ ‘ఉషాపరిణయము’ నని మఱిరెండు నాటకములు ‘నలాభ్యుదయము’ ‘రఘునాథాభ్యుదయము’ ‘హంస సందేశ’ మను మూడు పద్యకావ్యములు, వేమభూపాలచరిత మను నొక గద్యకావ్యమును, శబ్దరత్నాకరము, శబ్దచంద్రిక యను రెండుకోశములను రచించెను. వేమభూపాలచరిత మనునది కోమటివేముని పరాక్రమాతిశయమును వర్ణించు గ్రంథము. కోమటివేముఁ డాయనను గవిసార్వభౌముఁడనియు, గద్యకవిసార్వభౌముఁ డనియుఁ బ్రశంసించి గౌరవించెను.

వామనభట్టు విజయనగరమునుండి బయలుదేరు వేళ కచట కింకను జౌండపామాత్యుఁడు తిరిగిరాలేదు. కాని ప్రౌఢదేవరాయల కతని పరాక్రమమునందు మిక్కిలి విశ్వాసము గలదట. అతఁడు మోటుపల్లి తన చేఁ జిక్కినట్లే భావించుచుండెనట. మామిడి సింగన్న దేవరాయని యాస్థానమును గుఱించి యాయన నడిగెను. వామనభట్టిట్లు చెప్పెను. “ప్రౌఢదేవరాయలవారు చాల గొప్ప పండితుఁడు. రసజ్ఞుఁడు. కవిపండిత పోషకుఁడు. అతని యాస్థానమునఁ నరుణగిరి నాథుఁడు, నతనికుమారుఁడు రాజానాథుఁడు, ముమ్మడిభట్టు మొదలగు సంస్కృత విద్వత్కవులు, తెనుఁగు కవులు నెంతమందియో కలరు. అందఱిని మించి చంద్రభూమక్రియా శక్తిరాయ లున్నాఁడు. ఆయన మహాపండితుఁ డగుటయే కాక గొప్పయోగి కూడ. ఆయన సాధారణముగాఁ బండితుల వాగ్వాదములందు మధ్యవర్తిత్వము వహించును. పండితు లంద ఱాయన తీర్పు నొప్పుకొందురు. ఆయన చాల సరసుఁడు. పక్షపాతము లేనివాఁడు. దేశదేశములనుండి వచ్చిన పండితులతో ప్రౌఢరాయని ముత్యాలశాల యెల్లప్పుడు కిటకిట లాడుచుండును. నన్ను ప్రౌఢదేవరాయలు తన యాస్థానమునందుండు మని యెంతో బలవంతముచేసెను. అరుణగిరినాథుఁడు ముమ్మడికవియు

నాసహాధ్యాయులు. వారు నెంతో బలవంతము చేసిరి. కాని వారచట నుండుటకు నునస్కరించలేదు. ప్రభువువారి యాదరము దక్కినవంకకే లాగివైచెను. సర్వజ్ఞచక్రవర్తులు ప్రభువుల యాస్థానమునఁ బొందిన గౌరవమే గౌరవము. అదిగాక యచట నరుణగిరినాథుఁ డున్నాఁడు. అతనికిఁ దనయంతటి విద్వాంసుని మఱియొకఁడు లేడని యభిప్రాయము. అతఁడు మహాశివభక్తుఁడు. గొప్ప ప్రతిభావంతుఁడు. అతఁడు పదమూడవయేటికే వేదాధ్యయనము పూర్తిగావించెను. అతని భక్తికి మెచ్చి పుత్తూరి శివాలయమున నతఁడు శివుని స్తోత్రము చేసి చేసి నిద్రపోయి యుండగా శివుఁడు స్వప్నమున సాక్షాత్కరించి యతనినోటఁ దమ్ములము నమలిన తమ్మిం బెట్టెను. ఆ తమ్మికెంపువాకి యతనినాలుక పెదవు లెఱ్ఱవడెను. అప్పటినుండియు నతఁడు మహాకవి యయ్యెను. అతఁ డెన్నియో శివస్తోత్రములు రచించెను. అతఁడు రచించిన యోగానంద ప్రహసనము విరూపాక్షేశ్వరుని తిరునాళ్ళలోఁ బ్రదర్శింతురు. అతఁడష్ట భాషా పరమేశ్వరుఁడు. కవిమల్లుఁడను నొక మహావిద్వాంసుఁ డనేకాస్థానములు దిరిగి యచటి కవిపండితుల నెల్లనోడించి వారిచే ననేక బిరుదములఁబొందెను అతఁడు తనవిద్యాప్రతాపసూచకముగ నష్టదిగ్విజయపటహ మను పేర నొక కంచుఢక్కను జేయించుకొని దాని మ్రోతను దిక్కుటంగములఁ బ్రతిధ్వనింపఁ జేయుచు విజయనగరాస్థానమునకు వచ్చెను. అరుణగిరినాథుఁడు వాని నెదుర్కొనెను. ఇరువదిమూఁడు దినములు సర్వశాస్త్రములందు వారిరువురు వాదించుకొనిరి. చంద్రభూష క్రియాశక్తి రాయలుహృదయమున సర్వజ్ఞమూర్తియగు శివుని సన్నిధానము గావించుకొని వారికి మధ్యవర్తిత్వము నెఱపెను. తుట్టతుద నరుణగిరినాథుడే జయించెను. కవిమల్లుఁ డోటమి నంగీకరించి తన యష్టదిగ్విజయపటహమును నరుణగిరినాథున కొసంగి వెడలిపోయెను. అప్పటినుండి యరుణగిరినాథుఁడు డిండిమ భట్టారకుఁ డని ప్రసిద్ధి

వహించెను. అతని కుమారుఁడు రాజనాథుఁడు నా [illegible]డికొడుకు లిరువురు నానాదేశాగత మహాపండితుల మధ్యమున వారి విజయడిండిమమును నిరంతరము మ్రోగించుచుందురు. నా కా మ్రోతవినుటకు వెక్కసమై యచటనుండుటకు మన సొగ్గలేదు. వారి నెదుర్కొందమన్న నరుణగిరి నాథుఁడును నేనును సహాధ్యాయుల మయితిమి. మాయిరువురకు వాదము పొసగదు.

మామిడి సింగన్న వామనభట్టు చెప్పినదంతయు శ్రద్ధగా నాలకించెను. అతనిమనసులో నాతనికథనము విన్నంతకాలమును జిత్రవిచిత్రమైన యూహలు మెఱపులై మెఱసెను.

తరువాతఁ గోమటివేముఁడు ప్రగడయ్యవంకఁ జూచెను. ప్రగడయ్య "అన్నదేవచోడ మహారాజు కొమరగిరిని నాతోఁ బంపెను. నందికంత పోతరాజు కటారి నతఁడు స్వయముగాఁ దెచ్చి సమర్పించ వలయు ననుకొన్నాఁడుగాని యతనికేమాత్రమును దీఱికలేకపోయెను. ఆ కటారినిగూడఁ గొండపల్లివఱకు నేనే తెచ్చితిని. కొండపల్లిలో మాచారెడ్డివారు వసంతోత్సవములకు దానిని దాము కొండవీడు తీసికొనివచ్చెదరని చెప్పిరి. అన్నదేవచోడమహారాజు రాజమహేంద్రవరమును పట్టుకొన్నను గోదావరిదీవిప్రాంత మింకను నతనికిఁ బూర్తిగ స్వాధీనముగాలేదు. ఆ ప్రాంతముల నింకను విద్రోహములు రేగుచునే యుండెను. దీనికిఁ దో డల్లాడరెడ్డి తిరిగి రాజమహేంద్రవరముపై దండయాత్ర సాగించుటకు విశ్వప్రయత్నము సేయుచున్నాఁడు. అతని బావమఱఁది పిన్నండిరాజు ప్రోలవరమును గనిపెట్టుకొనియుండవలసి వచ్చెను. అందుచే నతఁడిప్పుడు కొండవీటికి రాఁజాలకపోయెను. తప్పక వసంతోత్సవములకు రాఁగలననియు నంతవరకు సోమదేవచోడుని

నెచ్చటికిఁ గదలనీయకుండ జాగ్రత్తగాఁ జూచుచుండవలసినదని చెప్పినాఁ” డనెను.

కోమటివేమునిముఖ మీవార్త విని మ్లానమయ్యెను. అతఁడు తలయూపుచు “ నౌనౌను. నాకది తెలియును. కాని యేమిలాభము? అది యట్లుజరిగిపోయినది. ఆ యన్న దేవచోడు డీలోపల రాకుండుటయుఁ గొంతమేలే. వసంతోత్సవములలోపల వానినెట్లైన విడిపించు నుపాయము చేయవలయు” నని మామిడిసింగన్న మొగమువంకఁ జూచెను.

సింగన్న :— నేను నదియే యాలోచించుచుంటిని. నాకేమియుఁ బాలుపోవుటలేదు. మనమిపుడు విజయనగరముపై దండయాత్ర చేయు స్థితిలో లేము. వసంతోత్సవములలోపల విజయనగరముపై కెత్తిపోవుటయు నంతమంచిపనిగాదు. నే నూరక భామినీసుల్తానుని, రాచకొండ దేవరకొండ వెలమదొరలను వసంతోత్సవములకుఁ బిలిచితినంతే. వారి సాయము మనమప్పుడే కాంక్షించినట్లు కన్పట్టరాదు. కాబట్టి సోమదేవుని విడిపించుటకు మార్గాంతరము వెదుకవలయును.

కో. వే :— సింగన్నగారూ! మనము త్వరపడవలయును. మన కున్న వ్యవధి చాలతక్కువ. ఇంక రెండునెలలేకదా. అచటికి నిచటికి రాకపోకల కొకనెలదినములు పట్టును.

సింగన్న :— నా మనసులో నేవియో యూహాలు లేకపోలేదు. కాని యవి పరిపూర్ణముగా రూపుకట్టలేదు. అవి యెంతవఱకుఁ గార్యరూపము చెందునో పరీక్షించవలసియున్నది. రేపటెల్లుంట నాలోచించి యేదియో యొక నిశ్చయము చేయుదము.

కోమటివేముఁడు సింహాసనముపైనుండి లేచెను. అప్పటికి కింకను నొకగడియ ప్రొద్దుండెను. వేముఁడును మామిడిసింగన్నయు వాహన

భట్టును రాజునుండినమువంక నడచిరి. ప్రగడయ్యయు శ్రీనాథుఁడును ప్రగడయ్య యింటివైపు నడచుచుండిరి. ప్రగడయ్య శ్రీనాథునివంకఁ జూచి "శ్రీనాథయ్యగారూ! ప్రభువు చేయఁగూడనిపని చేసి యిప్పుడుపాయమాలోచింపుమనెను. ఇప్పు డేమాలోచింతు" మనెను. శ్రీనాథుఁడు మాటాడలేదు. అతఁడు చాలసేపటినుండి యేదియో యాలోచించుచుండెను. శ్రీనాథుఁడు మాటాడకుండుట ప్రగడయ్య గమనించెను. అతఁడు శ్రీనాథుని మొగమువంకఁ దేఱిపాఱజూచెను. శ్రీనాథుని ముఖము దీప్తిమంతముగా నుండెను. అతనికన్నులు మెఱయుచుండెను. అతనికి బాహ్యస్మృతి యున్నట్లులేదు. ప్రగడయ్య యతని వంక నట్లే చూచుచుండెను. శ్రీనాథుని ముఖము కాలముగడచిన కొలఁది యతిలోకతేజోవంతమై ప్రకాశించుచుండెను. అతఁడు మధ్య మధ్య తలయూఁపుచుండెను. చిఱునవ్వు నవ్వుచుండెను. ప్రగడయ్య మిక్కిలి యాశ్చర్యపడెను. ఇదియేమి యీ శ్రీనాథుఁడు వట్టి కవి యనుకొన్నాను. ఇతని ముఖమున నీ దివ్యతేజస్సేమి? ఇతని కన్నులలోనికి దేవతలు కాపురమువచ్చినట్లున్నారు. ఇతఁడిట్లుండుట యెప్పుడు చూడలేదనుకొనెను.

ప్రగడయ్య శ్రీనాథుని చాలకాలమునుండి యెఱుఁగును. శ్రీనాథుఁడు తొలుతఁ గొండవీడు వచ్చినప్పుడు ప్రగడయ్య యింటికే వచ్చెను. ప్రగడయ్యకుఁ గవితాభిమానము బాగుగాఁ గలదు. విశేషించి తెలుఁగుకవిత్వమన్న నతనికి మిక్కిలి యిష్టము. కవిత్వమును వినుచు నతఁ డన్నము నీళ్లు మానివేసి దినములతరబడిఁ గడపఁ గలఁడు. ఆకాలమున సంస్కృతమునకున్న గౌరవము తెలుఁగునకు లేదు. తెలుఁగుకవికి రాజదర్శనమబ్బుట మిక్కిలి దుర్లభము. తెలుఁగు కవి గొప్ప సంస్కృత పండితుఁడైనను నతనికి సంస్కృత కవుల

కున్న యాదరముగల్గుటలేదు. రాజదర్శనమునకువచ్చిన తెలుఁగుకవులందఱు నెలలతఱబడి ప్రగడయ్యయింటఁ దినుచుఁ దిరుగుచుండెడివారు. ప్రగడయ్య తెలుఁగుకవులకుఁ గల్పవృక్షము. శ్రీనాథుఁ డాతనియింట నాలుమాసములుండెను. ప్రగడయ్య రోజు శ్రీనాథుఁడు వ్రాసిన కావ్యములను జాలువులను జదివించుకొని వినుచుండెడివాఁడు. శ్రీనాథుఁడు చిన్నతనమున వ్రాసిన మరుత్తరాట్చరిత్రము, శాలివాహన సప్తశతి ప్రగడయ్యకుఁ బూర్తిగా వినిపించెను. ప్రగడయ్యకు శ్రీనాథునియందు మిక్కిలి ప్రేమకల్గెను. అతని యుద్దేశ్యములో శ్రీనాథునికంటె గొప్పకవి సృష్టిలో లేఁడు. అతఁడు శ్రీనాథుని తనయింట నుంచుకొని పండితారాధ్యచరిత్రమును వ్రాయించుకొని కృతి పొందెను. తఱువాత శ్రీనాథుని గుఱించి సింగన్నగారికిఁ జెప్పి రాజాశ్రయము గల్పించెను. శ్రీనాథుఁడు తెలుఁగు చేసిన శృంగార నైషధము సన్నగారికిఁ గృతియిప్పించెను. మామిడి సింగన్న శ్రీనాథుని పాండిత్యమునకు మిక్కిలి యాశ్చర్యపడెను. అతనికిఁ దెలియని శాస్త్రము లేదు. అతఁడు కృష్ణయజుర్వేదమును బూర్తిగా నధ్యయన మొనర్చెను. పదునెనిమిది పురాణములు, స్మృతులు, సాంఖ్యయోగ సిద్ధాంతములు శైవాగమములు చదివెను. పాతంజల మహాభాష్యమును న్యాయవైశేషికదర్శనములను వాచోవిధేయము గావించుకొనెను. జ్యోతిశ్శాస్త్రమును బాగుగా నభ్యసించెను. మహారాష్ట్రి శౌరసేని మొదలగు ప్రాకృతభాషలను నభ్యసించెను. అతఁ డుభయభాషలందును జతుర్విధ కవిత్వములను జెప్పు చాతుర్యముగలిగి యుండెను.

మామిడి సింగన్న యతనిని సర్వవిద్యలందుఁ బరీక్ష చేసెను. ఆస్థానకవియగు వామనభట్టుచే బరీక్షింపించెను. వామనభట్టు శ్రీనాథుని గౌఁగలించుకొనెను. వారిద్దరును రాజుతోఁ జెప్పి శ్రీనాథుని

విద్యాధికారిగా నియమింపఁజేసిరి. శ్రీనాథుని కింతటి యుచ్ఛస్థితి గల్గుటకుఁ బ్రగడయ్యయే కారణము.

ప్రగడయ్య శ్రీనాథునివంక నట్లే చూచుచుండెను. శ్రీనాథుని ముఖమున నా దివ్యతేజోరేఖ పరివేషముగ నట్టి యట్లే మెఱయుచుండెను. అతనిమొగ మెల్లఁ జెమట పట్టియుండెను. ప్రగడయ్య శ్రీనాథునిఁ జేతితో మెల్లగాఁ దట్టి "మీరేదియో గాఢముగా నాలోచించుచున్నట్లున్నా"రనెను. శ్రీనాథుని మనసునకు బహిస్స్మృతి గలిగెను. అతఁడు నిట్టూర్చి ప్రగడయ్యవంకఁ జూచి "ప్రగడయ్యగారూ! నేను విద్యానగరమునకుఁ బోయిన నెట్లుండు" ననెను. ఆమాటలు భద్రజాతి యేన్గు మలుసంజవేళఁ బశ్చిమాకాశమును గప్పిన తొలకరిమేఘమును జూచి తొండమెత్తి మంద్రగంభీరముగా ఘీంకరించినట్లుండెను. అతని మాటలువిని ప్రగడయ్య శరీరము పులకరించెను. ప్రగడయ్య :— "మహాకవీ! అన్నగారి నింటికి రానిండు. అనిపించుకొనిపోయెదరుగాని. ఈ దెబ్బతోఁ గోమటివేముని యాస్థానగౌరవము దిగ్దిగంతముల మ్రోయుగాక. తెలుగుకవిని రాజాధిరాజులు వెల్లగొడుగు వింజామరలు పూని సేవింతురుగాక! తెనుఁగు కవితామతల్లి మేని క్రొత్తజవాది పరిమళము ముంపై విద్యానగర రాజవీధులందు గుబాళించుగాక!"

ప్రగడయ్య శ్రీనాథుని కౌఁగిలించికొని 'ప్రభువా! నేఁడు మాయింటికి భోజనమునకు రమ్మ'నెను. వారిరువురును బ్రగడయ్యగారి యింటికిఁ బోయిరి.

మఱునాఁ డుదయమునఁ బ్రగడయ్య మామిడి సింగన్న యింటికిఁ బోయెను. సింగన్న యప్పుడే శివపూజ ముగించి ముంగిలికి వచ్చెను. మామిడి సింగన్న కనులలో నొక నిశ్చయరేఖ గోచరించెను. అతఁడు

ప్రగడయ్యను జూడఁగనే "ప్రగడయ్యా! మీ శ్రీనాథయ్యగారితో మాకుఁ బనిపడినది" అనుచునే యొకసేవకుని బిలిచి శ్రీనాథునికొఱకుఁ గబురువెట్టెను. ప్రగడయ్య యతనిమాటలకుఁ జాల నాశ్చర్యము పొందెను. సరిగాఁ దాను శ్రీనాథుఁడు నేది యాలోచించెనో యీయన కూడ నదియే యనుకొన్నట్లున్నాఁడు. కారణ మిట్లు కూడిరావలయును.

ప్రగడయ్య :— మీ రేదియో యభిప్రాయగర్భముగా మాట్లాడుచున్నారు.

సింగన్న :— మ రేమియు లేదు. శ్రీనాథయ్యగారిని విజయనగరాస్థానమునకుఁ బంపుద మనుకొంటిమి. నామనభట్టుగారిని బంపుటకు వీలు లేకపోయినది. అచటి వారందఱు నాయన సహాధ్యాయులు వారిని గాదనుటకు వీలులేని పరిస్థితి. కాదన్నగాని విద్వాంసునకుఁ బ్రకాశములేదు. ఊఱక రాయబారముగాఁ బోయి యేమిప్రయోజనము! అది వట్టి యాచనక్రిందకువచ్చును. ఎట్లైనను వారినోడించి మన కార్యము నెఱవేర్చుకొనవలెను. ఇది సైనికముగాఁ జేయించుటకు వీలుకాని పరిస్థితి. కావున విద్యావిజయముచేసి కార్యము సాధించుకొనవలెను.

ఇంతలో శ్రీనాథుఁ డచటికివచ్చెను. మామిడి సింగన్న శ్రీనాథునమితాదరముగా నాహ్వానించి కూర్చుండఁజేసెను.

శ్రీనాథుఁడు :— మహామంత్రివా రింత యుదయముననే కబురువెట్టితిరి.

సింగన్న :— శ్రీనాథయ్యగారూ! కత్తియును గలమును బనిచేయనిచోటఁ బాండిత్యముతోఁ బనిగల్గును. మీరిప్పుడు విద్యానగరమునకుఁ బోవలసియున్నది. వసంతోత్సవముల కేగిన సోమదేవచోడుని

మీఁదుదీసికొనిరావలయును. ఈశేష కొండవీటి యాస్థానపు గౌరవ మంతయు మీపై నాధారపడియున్నది.

శ్రీనాథుఁడు కొంతునిముసములవరకు మాటాడలేదు. అతఁడేమి చెప్పనోయని మామిడి సింగన్న యతనిమొగమువంకఁ జూచుచుండెను. శ్రీనాథుఁ డొకచిఱునవ్వునవ్వి 'మహామంత్రి నాపైఁ బెద్దబరువు పెట్టు చున్నా' రనెను.

సింగన్న :— మీప్రతిభ నాకుఁ దెలియును. మీరు తలచుకొనినఁ గానిపని యుండదు. రసానందముతో పాటు విశ్వశ్రేయము మీ లక్ష్యము. రాజకీయములైన యసంకోధనములు మీకడ్డురావు. 'విద్వాన్ సర్వత్రపూజ్యతే' యని కదా! సాయంతనము మహారాజువారిచేత మీకుఁ దాంబూలము పెట్టించెదను. రే పుషఃకాలమునఁ జాల బాగున్నది. బయలుదేరి పొండు.

ఆనాఁటి సాయంకాలము కోమటివేముఁడు శ్రీనాథునకుఁ గర్పూర తాంబూలము వెట్టి చీనాంబరము లొసంగి గౌరవించెను. మఱునాఁటి యుషఃకాలమున శ్రీనాథుఁడు శిష్యసహితుఁడై బయలుదేరి పోయెను.

౮

శ్రీనాథుఁడు కతిపయప్రయాణము లొనరించి మోపూరు చేరెను. అతఁ డాగ్రామము చేరుసరికిఁ జీఁకటిపడెను. శ్రీనాథున కాగ్రామము మిక్కిలి క్రొత్త. అదిగాక యాగ్రామము విజయనగర రాజ్యములోనిది. శ్రీనాథునితోపాటతని శిష్యులు పదిమందియుండిరి. వారిలోఁ బ్రధానులు దగ్గుపల్లి దుగ్గన్నయు, చెన్నమరాజకవియు. దగ్గుపల్లి దుగ్గన్న శ్రీనాథుని బావమఱఁది. చెన్నమరాజకవిగూడ

శ్రీనాథునకుఁ గొంత దూరపు బంధువు. వారిద్దఱ కతిసియొద్ద చనవు మెండు. శ్రీనాథుఁడు తనపల్లకిని విఘనసత్రమునొద్దకుఁ బట్టించెను. ఇంత వఱకును శ్రీనాథుఁడు కొండవీటి రాజ్యములోఁ బ్రయాణ మొనరించెను. ఆ రాజ్యమునందలి పండితులెల్ల నాతనికిఁ బరిచితులే. విద్యాపరీక్షణ వేళలలో నతఁడు వారందఱితోడను సంభాషించియుండెను. మఱి యితరరాజ్యములోని పండితులతోఁగూడ శ్రీనాథునకుఁ బరిచయము గలదు. అతఁడు ప్రయాణముచేసినంతదూరము పండితులతనిని బ్రతి గ్రామమున సగౌరవముగాఁ దమయిండ్లకుఁ దీసికొనిపోయి భోజనాది సౌకర్యము లేర్పాటుగావించిరి. కాని యిప్పుడీ గ్రామమున నట్టివా రెవ్వరును దగులలేదు. అందుచేత నతఁడు సత్రమునందు విడియవలసి వచ్చెను. దుగ్గన సత్రాధికారిని బిలిపించి భోజనాదిసౌకర్యము లేర్పాటు చేయింతురా? యని యడిగెను. సత్రాధికారి "అయ్యా! పూర్వమీ సత్రమున భోజనముగూడఁ బెట్టెడివారు. ఈపరిసరగ్రామములకన్నిటికి నిది కూడలిపట్టు వీనియన్నింటిపైన రాజోద్యోగి యొకాయన యున్నాఁడు. ఆయనపేరు వల్లభామాత్యుఁడు. అతఁడు చిరతాన్న ప్రదాత. బాటసారు లెవరువచ్చినను భోజనమున కచటికే పోయెదరు. ఇది వట్టి విడిదిగామాత్రమే మిగిలిన" దనెను. దుగ్గన యీసంగతి శ్రీనాథునితో మనవిచేసెను. శ్రీనాథుఁ "డతఁడు మనల నాహ్వానించ లేదుగదా! అచటికి మనమేలపోవలయు" ననెను. దుగ్గన "అయి నచో నతఁ డాహ్వానించు ప్రయత్నముచేసెదము. మీరు విశ్రాంతి తీసికొను"డని చెప్పి మఱల సత్రాధికారియొద్దకు వచ్చి సత్రాధికా రిని బిలిచి "అయ్యా! ఆ వల్లభామాత్యుఁడిపు డెచటనుండునని యడి గెను. అధికారి "ఆయన నియోగులపై నజమాయిషీకిఁ బరిసరగ్రామ ముల కేగినాఁడు. మఱియొక గడియలో నాయన తిరిగివచ్చుసమయము. ఆయన యీ సత్రము ముందుగనేపోవు" నని చెప్పెను.

దుగ్గన్న :— ఆయన కేమైన విద్యాభిమానమున్నదా ?

అధికారి :— అయ్యో ! అట్లందురేమి ! ఆయన చాలగొప్పకవి. మీరు వినియుండలేదా ? చాల గొప్పకవి.

దుగ్గన చెన్నమరాజకవిని బిలిచి తీసికొనిపోయి వీధియరుగు పైనిఁ గూర్చుండెను. వారిద్దరు చెఱియొక చరణముగాఁ బద్యములు చెప్పుట మొదలుపెట్టిరి. కొంతసేపైనతర్వాత గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించెను. ఆ ధ్వని సత్రపువాకిట నాగెను. ఆ గుఱ్ఱముపై నెక్కిన వ్యక్తియొక గడియకాల మట్లేకూర్చుండి వారిపద్యములను వినెను. వారిద్దర ట్లే ప్రవాహవేగమునఁ బద్యములు చెప్పుచుండిరి. ఆ వ్యక్తి యశ్వముడిగ్గి వారియొద్దకువచ్చి "ఎవరయ్యా మీరు" రని యడిగెను.

దుగ్గన్న :— అయ్యా ! శ్రీనాథయ్యగారి శిష్యులము. తమ పేరేమి ?

వ్యక్తి :— ఏమేమి ? శ్రీనాథయ్యగారి శిష్యులా ? మీరిరువు రేనా ? ఆయనకూడ వచ్చియుండెనా ?

దుగ్గన :— వారును వచ్చిరి. మేము వారితోఁ బదిమంది శిష్యులము వచ్చితిమి.

వ్యక్తి :— అయ్యో ! అట్లా ! నాకు ముందుఁ గొంచెముకబురైన చేసితిరిగాదు. ఊరికిఁ బోకుండ నుండెడివాఁడను.

ఆమాటలనుచునే యతఁడు లోపలికినడచివచ్చుచు "ఏరి యేరి ? శ్రీనాథయ్యగారెచట నున్నా" రని యడిగెను. దుగ్గన చెన్నమ రాజులాయనతో నడచుచు శ్రీనాథుఁడున్న గదిలోనికిఁ దీసికొనిపోయిరి. ఆ వ్యక్తి శ్రీనాథునిజూచి "అయ్యా ! మీరువత్తురని నాకుఁ దెలియదు.

పొరపాటైనది. తమ ప్రశక్తి నేను వింటిని. మీదర్శనముచే నా జన్మము చరితార్థమైనది. నన్ను మన్నించి మా యింటికి దయచేయ వలయుననెను.

శ్రీనాథుఁడు :– తమరు వల్లభామాత్యులా ?

వ్యక్తి :– అవును. మా యిల్లీసమీపముననే యున్నది. మీరు శిష్యులతోఁగూడ మాయింటికే దయచేయుఁడు.

శ్రీ :– మీయింటికి రాక మఱెచ్చటికిఁ బోయెదమనుకొంటిరి ? మావిద్యార్థు లిప్పుడే మిమ్ముగుఱించి చెప్పినారు. ఇంతలో మీరు వచ్చితిరి.

శ్రీనాథుఁడు శిష్యసహితముగా వల్లభామాత్యుని యింటికి బయలుదేరెను.

వల్లభామాత్యుని యిల్లు గ్రామమునకు దక్షిణపార్శ్వమున నుండెను. ఇంటిచుట్టును కోటగోడలవంటి ప్రహారి, లోపల విశాలమైన యావరణము. ముందుఁ బెద్ద మండువా చావడి. అదిదాఁటినతఱువాతఁ బెద్దమేడ. క్రింద నేలయంతయుఁ బాలరాతిపలక పఱచఁబడియుండెను. గోడలన్నియు నానాచిత్రములచే నలంకృతములై యుండెను. వల్లభామాత్యుఁడు వారినందఱ నందులో విడియఁజేసెను. ఇంచుక విశ్రమించు నంతలో బానసీఁడువచ్చి వంట సిద్ధమైనదని విన్నవించెను. వారి యందఱకు బాగుగా క్రాగిన వేడినీళ్ళు, ఇప్పపిండి సిద్ధముసేయఁ బడియుండెను. స్నానానంతర మందఱును భోజనశాలలోనికిఁ బోయిరి. అదిచాల విశాలమై యొకేపర్యాయము నూర్వురుభోజనము చేయుటకు వీలుగా నుండెను. శ్రీనాథాదులుగాక మఱి పదిమందిగూడ నాఁడు భోజనమునకు వచ్చిరి. నిడివియు వెడల్పునుగలిగి ముదురును లేతయుఁ గాని యరఁటియాకులపై నింతనీరు సరచి శుభ్రముగాఁ దుడిచిరి. తఱు

వారంత సభీషూర మొనర్చి భోజనసింహము వద్దనగావించిరి. రాజనాలయన్నము కప్పురతావులీనుచుఁ దళతళలాడెను. అప్పుడుకాచిన గోఘృతము ఘుమఘుమలాడెను. నూనెతోఁ బొడికిన కూరలు, వడియములప్పడములు, చారులు, మిష్టాన్నములు, పాయసాన్నములు జిహ్వోపరిదర్పణము గావించెను. గేదెపెరుగు కత్తితోఁగోసినముక్కలై తృప్తితీర్చెను.

వల్లభామాత్యుఁడు వారందఱకుఁ గస్తూరి తాంబూలములు పెట్టెను. శ్రీనాథుఁడతని యింట మూఁడురోజులుండెను. అతఁ డింకను నుండుమని నిర్బంధించెను గాని శ్రీనాథుఁడు తనకుఁ గార్యావసరమున్నదని చెప్పి యతి కష్టముమీఁద నచటనుండి బయలుదేరగల్గెను. ఈమూఁడురోజులలో వల్లభామాత్యుఁడు శ్రీనాథునకుఁ దనరచనము లెన్నియో విన్పించెను. తాను వ్రాసిన క్రీడాభిరామమును విన్పించెను. ఆ క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకకవి వ్రాసిన ప్రేమాభిరామమునకును వాదము. శ్రీనాథునకది విన్నంతసేపును నొడలు తెలియలేదు. అతఁడు మాటమాటకుఁ దలత్రిప్పెను. ఆపద్యము నెత్తుగడ, మొదలునుండి చివఱవఱకుఁ దీగలాగినట్లున్న నిర్వాహణము, సమాస రచన, భావానుసారియైన శిథిలగాఢబంధ శేషములు, తెలుఁగు సంస్కృతముల పలుకుబళ్ళు, సీసపద్యముల నడకలును మొదలైన రచనా వైభవమంతయుఁ దెనుఁగు భాషలోని సొగసంతయు 'క్రీడాభిరామము కుప్పవోసి చూపించెను. శ్రీనాథుని కతని కవిత్వమువిని తల తిరిగిపోయెను. అతఁడు 'ఓహో! సృష్టిలో నెన్ని వింతలున్నవో! యీవల్లభరాయఁడు మసిపాతగట్టిన మణివోలె నీగ్రామములోఁ బడియున్నాఁడు. ఇంత మహాకవి పేరెవ్వరికి వినిపించకుండుటయే యన్నిఁటి కంటె చిత్ర" మనుకొనెను. వల్లభామాత్యుఁ డింకను వినిపించుచునే యుండెను. చదువుట కతనికి విసుగు లేదు. వినుటకు శ్రీనాథునకు

విసుగులేదు. వల్లభామాత్యునకు డెబ్బదియేండ్ల వయసుండవచ్చును. అతని కనుబొమలుగూడఁ దెల్లగా నెఱసిపోయెను. అతని దవుడలు ముడుతలువడి వ్రేలాడుచుండెను. కాని యతని కన్నులు మిలమిల మెఱయుచుండెను. ఆ చూపులలోఁ బసిచావలేదు. అతని యాకార మంతటిలో నాచూపులలోనె యతని వైశిష్ట్యము గోచరించుచుండెను. ఆ చూపులలో ముసలితన మించుకయు లేదు. అవి నిత్య యౌవన ములు. వానివెంట జీవనమధువు పొంగి పొరలుచుండెను. అతని గొంతుక మిక్కిలి మెత్తగా నుండెను. అతఁడా గ్రంథమును ముప్పది యేండ్లవయస్సప్పుడు వ్రాసెనట. ఈవయసునఁగూడ నాపద్యములలోని కొంటెతనమంతయుఁ గోడెతనమంతయు నతని యుచ్చారణబడి ప్రాణ వంతమై నిలిచెను. గ్రంథమంతయుఁ జదువుట యైపోయెను. వల్లభా మాత్యుడు "నేను ముసలివాడను, నేనిపుడు గ్రంథమును జదువనేరాదు. అయినను మీరు మహాకవులువచ్చితిరి. ఇది కవిత్వము గాన మీకు వినిపించితి నంతే. మఱియొకలాగున భావింపకుఁ" డనెను. శ్రీనాథుఁడు "అయ్యో! యంతమాటా? మీరు ముదుసలియేమిటి? మీశరీరము జరాకృశము కావచ్చును. కాని మీమనసు యౌవనవంతము. మీరు జీవితములోని మాధుర్యమును జావకుండఁ గాపాడుకొనివచ్చితి"రనెను.

వల్లభామాత్యుఁడు :—అవునవును. మీరునన్ను జక్కఁగా నర్థము చేసికొంటిరి. ఇది యపరిణతులైన పసికాయలు చదివి నన్ను వట్టివీధి శృంగారి యనుకొందురు.

చెన్నమరాజకవి వెంటనే యందుకొని తాతగారూ! మీరు వ్రాసినది వీధియేకదా? యని నాలుక కొరుకుకొనెను.

వల్లభా :—అవునునాయనా! నేనుజెప్పున దదిగాదు. నాగ్రంథము నిండఁ జాలబూతులున్నవి. మఱి రత్నములు నున్నవి. ఆ పసికాయల

కాబూతులు గన్పించును. వారువాని యందే రమింతురు. మఱి తక్కిన భాగములు వారిమనసునకు రావు.

శ్రీనాథుఁ డొక చిఱునవ్వునవ్వి "అవును, మీరు సెలవిచ్చినట్లే శృంగారకవులనందరును నిట్లే దురర్థము చేయుదురు. కాళిదాసంత వాని కాబాధతప్పలేదు. మఱి మనకుఁ దప్పునా? అసలు శృంగారమును భావించుటకొక సుకుమారమైన, ప్రౌఢమైన మనఃప్రవృత్తి యుండవలె. ప్రౌఢి ముదిరిన సుకుమారత, మాధుర్యము చచ్చిపోవును. మనసు బిగితోబాటు పసికూడఁ జావకుండఁ గాపాడుకొని వచ్చుట శృంగార కవులలోని విశేషము. అందుచేతనే శృంగారము రసములలోకెల్ల నగ్రస్థానమువహించినది. వస్తువునుబట్టి భావకల్పనచేసి దాని యందు శృంగారదీప్తి కల్గించుట యనునది బహుజన్మ సాధ్యమైన విషయము. మఱి మీరచనయున్నది యది యెత్తున కెత్తు బంగారు. మీరచనా శక్తి యనంత"మని శ్రీనాథుఁడు వల్లభామాత్యుఁడు చదివిన పద్దెముల నుండి యాతని రచనాశిల్పమున కుదాహరణముగ నెన్నియో పద్య పాదములుచదివెను.వల్లభామాత్యుఁడు శ్రీనాథుని ధారణాశక్తి కచ్చెరువడెను. కట్టకడకుఁ జెన్నమరాజకవి యన్నాఁడుగదా! మీకవిత్వము నందంతట మాగురువుగారి ముద్ర బాగుగాఁ గన్పించుచున్నది. మఱి కొంతకాలము పోయినపిదప మీగ్రంథము మా గురువుగారే వ్రాసి రనుకొందురని మఱల నాలుక కఱచుకొనెను. శ్రీనాథుఁడొక చిఱునవ్వు నవ్వెను వల్లభామాత్యుఁడు చెన్నమరాజ కవివంకఁ దీక్ష్ణముగాఁ జూచి "నేను దానినే మఱియొకవిధముగఁ ద్రిప్పి చెప్పెదను. ఆ యనుకొను వారు నీవన్నట్లనుకొననేల? మీ గురువుగారు వ్రాసిన గ్రంథము లన్నియు నేనే వ్రాసితినని యెందు కనుకొనరా" దనెను.

శ్రీనాథుఁడు మఱల నొక చిఱునవ్వు నవ్వెను,

చెన్నమరాజు :— మీ రప్రసిద్ధులు. మా గురువుగారు చాల ప్రసిద్ధులు. అందుచేత మీరన్నట్లనుకొనరు.

వల్లభా :— ఓయీ! ప్రసిద్ధినిబట్టి గుణ మెంచుట వట్టియపండితుల లక్షణము. అట్టి యపండితులు నీవన్నట్లనుకొనిన ననుకొననిమ్ము. దాని వల్ల నష్టములేదు. పండితుఁడైనవాఁ డెవఁడు నట్లనుకొనఁడు గదా!

చెన్నమరాజు :— పండితులు ననుకొనవచ్చును. ఆ పద్యముల నడక, యా సమాసముల తీఱు, నా పలుకుబళ్ళు, నా యెత్తుగడలు, దింపుగడలు మొదలైన యీ యన్నియు మా గురువుల రచనము నకుఁ జాలదగ్గఱగా నున్నవి.

వల్లభా :— ఈ గ్రంథమును నేను వ్రాసితిని నేను వ్రాసితి నను చుండఁగా గా దెవఁడో వ్రాసెననుట వట్టి దుర్జన లక్షణము. నీవు చెప్పిన యా సమాసములు, నా పలుకుబళ్ళు మీ గురువుగారియం దొక్కరియందే కాదు. తత్పూర్వకవులందు, సంస్కృతకవులందు సమృద్ధిగా నున్నవి. మీ గురువుగారు వాని నెక్కడనుండి తెచ్చుకొనెనో నేను నక్కడనుండి తెచ్చుకొంటిని. నీవెన్ని యుదాహరణములిత్తువో యిమ్ము. వాని యన్నింటికి సంస్కృత మాతృకలు చూపింతును.

చెన్నమరాజు కవి యాతనిచేతినుండి క్రీడాభిరామము దీసికొని శ్రీనాథుని యుదాహరణములఁ జూపించుచుఁ బోలికలు చూపించెను. వల్లభామాత్యుఁ డతడిచ్చిన యుదాహరణము లన్నింటికి సంస్కృత మాతృకలు చూపించి “ ఇదిగో! నాయనా! యీ సంస్కృత కవిత్వము, నన్నయాదులు రచించిన తెలుగుకవిత్వ మంతయు మీ గురువుగారికి వలెనే నాకును బిత్రార్జితమైన సంపత్తి. దాని నెవరైన యథేచ్ఛముగా వాడుకొనవచ్చుననెను.

చెన్నమ :- అదిసరే యామాట యట్లుంచుఁడు. ఆయావిష యము లన్నియు మాగురువుగారికివలెనే మీకును బోధపడనేల? ఆయన కేది యందమని తోఁచినదో అదియే మీకును నందమని తోఁచనేల? కావున మీరెంతవాదించినను లాభములేదు. అది మా గురువుల రచన యనుటకు పీలెప్పుడుండనే యున్నది.

వల్లభా :- నీవు చెప్పునది లోకములో నిద్దఱుబుద్ధిమంతు లేల యుండవలయునని. నేను జెప్పునది యేలయుండరాదని. ఉండరానిపద్ధతిలో నొకఁడుమాత్ర మేలయుండవలయును? కావున మానిసినిబోలిన మానిసి, బుద్ధినిబోలిన బుద్ధియు నుండవచ్చును. ఆ బుద్ధి సాజాత్యమును బట్టి మాట సాజాత్యము దీపించును. అదిగాక మీ గురువుగారికంటె నేను బెద్దవాఁడను. నీవు చెప్పునట్టి యా భవిష్యత్తునందలి పండితు లీ విషయమునైన విచారింపరా?

శ్రీనాథుఁడు మఱల నొక చిఱునవ్వు నవ్వెను. దగ్గుపల్లి దుగ్గన్న విఱుగఁబడి నవ్వుచు "అందాక యెందులకు! మన చెన్నమ రాజే యీ విషయమును విచారింపలేదు. అయ్యో! యెంత పండితుఁడైనను నాపాండిత్యమునకును వానిమనసునందున్న దుర్జనత్వమునకును సంబంధము లేదు. ఆ దుర్జనత్వ మీ పాండిత్యము నధఃకరించి మనసు నావరించుకొని దానిని పరనిందాభిముఖముగఁ బ్రసరింపఁజేయును. ఆ నిందకొక యాధారముగూడ నక్కఱలేదు. నిన్నటివఱకు మమ్ముమీ రెరుగరు. మిమ్ము మేమెరుగముగదా! మా గురువుగారిని మీరనుకరించుటయేమి? ఆ మాటలో నర్థమేమున్నది? కాని లోక మింత విచారించునా? ఒకఁ డేదో గుణవంతుఁడన్న నామాట వినిపించుకొనక యెవఁడైనఁ గాదన్నచో లోకము వానివెంటఁబడి యేఁగును. అసలింతదాక యెందులకు! ఈ పుస్తకమును మా గురువుగారే వ్రాసి

రనుకొొందము. ఇంత మంచిపుస్తకమును వ్రాసి యాయన మీాపేరం బెట్టునా ? కావున నిట్టి ప్రవాదమున్న దే యది బట్టతలకును మోకాలి కిని ముడిపెట్టుటవంటి" దనెను.

వల్లభా :- ఒకవేళ మీాగురువుగారు నాపేరం బెట్టుట మన్నను నేనొప్పుకొొనవలదా ? "నాన్యస్య గంధ మపి మానధనాస్సహంతే" యన్నాఁడు మాఘుఁడు.

శ్రీనాథుఁడు మఱల నొక చిఱునవ్వు నవ్వెను. వల్లభా మాత్యుఁ డాతనివంకఁజూచి "శ్రీనాథయ్యగారూ! మీారూరక నవ్వు చుంటిరేగాని మాటాడ రేమి" యనెను.

శ్రీ :- మఱేమియును లేదు. మీారెంతసేపు మాటాడినను మీాకును నాకును నున్న పోలికలనుగుఱించియే మాటాడెదరు. భేదము లనుగుఱించి మాటాడ రేమి? ఆ భేద మనంతముగా నున్నది. చాల సూక్ష్మముగానున్నది. మీా గ్రంథమునందంతట మీా వ్యక్తిత్వము పరచఁబడియున్నది. అది ప్రౌఢబుద్ధులకుగాని గోచరము కాదనుట మాత్ర మొప్పికొొందును. కావున నట్టి సూక్ష్మ పరిశీలన నిపుణుఁ డెవ్వఁడును నిట్టి యారోపణము సేయఁడు. మీారు చాల విశిష్టులైన కవులు. మీా క్రీడాభిరామము తెనుఁగు సాహిత్యములో మణిదీపము వంటిది. దానిని జక్కఁగాఁ జదివిన రచనాశిల్ప మంతయుఁ గరతాలా మలకమగును.

ఆ మాటలకు వల్లభామాత్యుఁడు మిక్కిలి సంతసించెను. అతఁడు శ్రీనాథుని మిక్కిలి గౌరవించెను. కస్తురి, జవాది, పచ్చకప్పు రము, చీనాంబరము లొసంగి సన్మానించెను. శ్రీనాథుని విడువలేక విడువలేక కన్నీళ్ళతో వీడ్కొల్పెను.

వల్లభామాత్యుని వీడ్కొని శ్రీనాథుఁడు శిష్యులతోఁగూడఁ బది దినములు ప్రయాణము గావించి విద్యానగరము చేరెను. వారప్పుడే కొండవీటినుండిబయలు దేరి యిరువదిదినములయ్యెను. మోపూరు వీడిన తఱువాత వారికిఁ బ్రయాణమంత సుఖముగా సాగలేదు. వారెక్కువగాఁ గుగ్రామములగుండఁ బ్రయాణముచేసిరి. ఆ యూళ్లలో వారి నాదరించి పూజించిన కుటుంబిలేఁడు. వారు పగలెల్లఁ బ్రయాణముగావించి రాత్రిపడుసరికి నేదియో గ్రామముచేరెడివారు. ఆ గ్రామమునందే పురోహితునియింటనో యొకొక్కప్పుడేకరణము నింటనో బసచేయవలసి వచ్చెడిది. ఆకొంపలన్నియు నిల్లిఱకటము, నాలిమర్కటమన్న సామెత కుదాహరణములు. వారొకప్రక్క నీనినయావులను గట్టివేయుదురు. ఒక్కప్రక్క మంచపుఁగోళ్లకు దూడలను గట్టివేసికొందురు. ఒకప్రక్క విస్తరాకుల దొంతరలు, నింకొకప్రక్క మాసిన కుండలు వాని నానుకొని వంటకట్టెలు, పొగచూరిన ఱెల్లుకప్పులలోఁ గువకువలాడు పిచ్చుకలు. ఒకొక్కప్పుడు శ్రీనాథాదులకు భోజనమే దొఱకదు. దొఱకినచోఁట నాకూడు గొంతుదిగదు. మోపూరువీడిన తర్వాత వారికి వరియన్నమన్నది కఱవేయైపోయెను. శుచికిని రుచికిని వారెప్పుడో తిలోదకమిచ్చిరి. భోజనభాజనాదుల సంగతులిట్లున్న వా ? ఆజనుల నాగరకతకూడ దానికిఁ దుల్యముగానే యుండెను. త్రోవపొడవునఁ గంటికింపైన మనుష్యులు వారికిఁ గన్పించనేలేదు. స్త్రీ పురుషులొకరినిమించి యొకరు ఖండెముపొడుగు. ఆ ప్రజలంద ఱనాగరకులు. మిక్కిలి పేదవారు.

విజయనగరము వచ్చినతఱువాత వారిమనసు కించుక తెప్పిఱిల్లెను. విజయనగరము కంటికింపైన పట్టణము. దానిచుట్టు నేడు ప్రాకా

రములు. తొలిప్రాకారముననన్నియు రాజనపుఁజేలు, చెఱకుతోటలు, ఆ చేలన్నియుఁ గోయఁబడి పంటకుప్పలు వేయఁబడియుండెను. చెఱకు తోటల గడలుప్రిలి పానకము గారుచుండెను. ఎడనెడఁ దామర కొలఁకులు, విచ్చిన తామరపూలతో గమగమలాడుచుఁ గన్నులకారాత్రి కనుపట్టుచుండెను. రెండవ ప్రాకారమున నన్నియుఁ బూఁయిండ్లు అచ్చటఁగూడఁ జాలభాగము పంటభూములు. ద్రాక్ష, పనస, నారింజ మొదలైన ఫలవృక్షములతో నాప్రదేశము కన్నుల పండువుగా నుండెను. మూఁడవ భాగమున నెక్కువభాగము కర్మకారులు కాపురముండిరి. అచ్చటనుండి పట్టణము ప్రారంభమై యారవ ప్రాకారము వఱకు విస్తరించెను. నాలుగైదు ప్రాకారములందుఁ జాతుర్వర్ణ్య ప్రజలు, నాగరకులు నివసించుచుండిరి. ఆరవ ప్రాకారమునందు రాజోద్యోగులు దండనాథులు, వారాంగనలు మొదలైనవారు నివసించుచుండిరి. ఏడవ ప్రాకారమంతయు రాజాంతఃపురము. ఏడవ ప్రాకారము నొరసికొని తుంగభద్రానది ప్రవహించును. ఆ నది యొడ్డున విరూపాక్షస్వామి యాలయము.

శ్రీనాథుఁడు సరాసరి విరూపాక్షస్వామి యాలయమునకుఁ బోయెను. అచట స్వామిదర్శనము గావించుకొనిన తర్వాత బసకుదుర్చుకొని వచ్చుటకై తనశిష్యులను బంపెను. వారూరెల్లఁ దిరిగి యొకవిశ్వస్తయింట బసకుదుర్చుకొనఁ గల్గిరి. శ్రీనాథుఁడు రెండుమూఁడు రోజులు మార్గాయాసము వాపికొన్న తర్వాత రాజదర్శనమునకై యుపాయమాలోచింప మొదలుపెట్టెను. రాజదర్శనము పొందవలెనన్న నొకేయొక మార్గముండెను.

రాజాస్థానమున ముమ్మ్రకవి విద్యాధికారి. ముమ్మ్రకవి దయ లేనిచో నెట్టివారికిని రాజదర్శనము దుర్లభము. శ్రీనాథునకు ముమ్మ

కవి దర్శనమే దుర్లభమయ్యెను. ఆముమ్మకవి దర్శన మతని కబ్బుసరికి వారమురోజులు పట్టెను. అతఁడప్పుడే కొండవీటినుండి బయలుదేరి నెలదినములు గావచ్చెను. ఇంక నతనికున్న గడవొక్కనెల. అందులో నిరువది దినములు తిరుగు ప్రయాణమునకు పట్టును. మిగిలినవి పది రోజులు. ఈ పదిరోజులలో నతనిపని పూర్తి గావించుకొనవలయును. అతికష్టముగా శ్రీనాథునకు ముమ్మకవి దర్శనమబ్బెను. ముమ్మకవి యింటికిఁజాలమంది పండితులు వచ్చుచుఁబోవుచుండిరి. వారొక్కొక్క రాతని దర్శనమునకు దినముల తరబడి వేచియుండిరి. నాఁటిదినమున శ్రీనాథునివంతు వచ్చుసరికి సాయంతన మయ్యెను. ముమ్మకవి శ్రీనాథునిజూచి 'మీ దేయూ' రని ప్రశ్నించెను.

శ్రీనాథుఁడు :— అయ్యా! మాది కొండవీడు. నా పేరు శ్రీనాథుఁడు. నేను కోమటివేమారెడ్డివారి యాస్థానమున విద్యాధికారిని.

ముమ్మకవి :— ఓహో! రెడ్డిరాజుల యాస్థానమున విద్యాధికారులా! మఱి మీరిచ్చటికి వచ్చుటకు హేతువేమి?

శ్రీ :— ఏమియును లేదు. మీవంటి మహానుభావులను జూచి పోవుదమని వచ్చితిని. ప్రౌఢదేవరాయలవారి యాస్థానము విద్వన్మత్తేభముల కాకరమని వామనభట్టుగారు చెప్పిరి. అదియేమియో చూచి పోవుదమని వచ్చితిని.

ముమ్మకవి :— తమ కేయేవిద్యలయందుఁ బాండిత్యముగలదో సెలవిత్తురా?

శ్రీ :— ఏవిద్యయని చెప్పఁగలను: నే నక్కడ విద్యాధికారిగా నుంటినంటినిగదా! నేను జెప్పుకోగల్గిన దంతయు నొక్కటియే. మా

రాజునకు సర్వజ్ఞ చక్రవర్తియను బిరుదమున్నది. ఆయనయొద్ద నేను విద్యాధికారిని.

ముమ్మకవి :- ప్రౌఢ దేవరాయలవారు కవితాప్రియులు. తమకు గవిత్వమునందేమైన పరిచయమున్నదా?

ఆమాటలతోడనే శ్రీనాథుని కన్నులు మెఱసెను. అతని నోటివెంట నీక్రింది పద్యము దుమికెను.

సీ॥ పంపా విరూపాక్ష బహుజటా జూటికా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళసాపుర ప్రాంతకదళీ వనాంతర
ద్రాక్షాలతా ఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణ హాటకరత్న
తాటంక యుత ధాళధళ్యములకు

గీ॥ నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుక నేర్తు
ప్రౌఢ దేవేంద్ర రాయభూపాలవరుని
సమ్ముఖమ్మున దయఁజూడు ముమ్మసుకవి.

ముమ్మకవి :— అబ్బో! మీరుచాల గొప్పకవులన్నమాట. ఇంతగొప్ప కవులు మీకు బిరుదులుండకుండ నుందురా? ఆ బిరుదు లన్నియు సెలవిచ్చిన ద్వారగా రాజదర్శనము గల్గుటకు వీలుండును. శ్రీనాథున కొడలు మండుకొనిపోయెను. అతఁడు "అయ్యా! నేను వచ్చునపు డివియన్నియు నెందుకని నాబిరుదులిచటికిఁ దేలే" దనెను.

ముమ్మ:కవి :— వానినెక్కడైన దాచి వచ్చితిరా ?

శ్రీ :— శమఁకోటి మహాపండితుల యొద్దకు వచ్చునప్పుడున్న వన్నియుఁ దెచ్చినట్లు ? తెచ్చినచో మఱలఁ బోవునప్పుడు మిగులునో మిగులవో !

చ॥ తొసవున గాండీవం బిడజె ధర్మరాజునానఁ గిరీటియేనువా
క్కసిజ నేత్రజ యానతి విచారముచొప్పున గర్వహీనతన్
మరలి తెనుంగుభూమికి సమాన గతిన్ గొనిపోవువాఁడనై
బిరుదులు నారివాగు కడఁబెట్టితి సత్కవి సార్వభౌముఁడన్.

ముమ్మకవి :— ఓహో ! మీరా బిరుదులన్నియు నారివాగునొద్ద దాచుకొన్నారుగాని పాప మీ సత్కవిసార్వభౌమ బిరుదము మాత్రము మీవెంటఁబడి వచ్చినట్లున్నది. పాపము దానికిఁ దగిన గౌరవము రాయలవారి యాస్థానమునఁ జేయించెదము లెండు. మీరు విని యేయుందురు. అష్టదిగ్విజయ పటహీకృత విద్యాడిండిమశోణశైల కవిసార్వభౌముని. రాయలతో నాలోచించి రాజాస్థానమున మీకుఁ దగుగౌరవము సేయించెదను.

శ్రీ :— అయ్యా ! నేను త్వరగాఁ దిరిగిపోవలసియున్నది. ఆ గౌరవమేదో త్వరలోఁ జేయించి పంపినచో మీ యుపకారము మఱచిపోను.

ముమ్మ :— నేను రెండురోజులలోఁ గబురంపెదను. మీరెచ్చట విడిసితిరో చెప్పుడు.

శ్రీ :— అక్కరలేదు. మా శిష్యుని నెల్లుండి యుదయమున మీయింటికిఁ బంపెదను. సెలవిప్పించుడు.

శ్రీనాథుఁడు వెడలిపోయెను. అతఁడు వెడలిపోవుచుండగా మార్గమున వతని కొకవ్యక్తి కన్పించెను. ఆయన యాజానుబాహువు.

ఆయన ముఖము దీప్తిమంతమై యుండెను. ఆయన ఫాలము విశాలమై కన్నులలో నొక దర్పరేఖ గూడుకట్టి యుండెను. ఆయనకు శిరమున గోష్పాదమంత జుట్టు, నాయన కర్ణముల రత్నతాటంకములు ధగధగ లాడుచుండెను. ఆయన యొడలెల్ల విభూతితాల్చి బూదిచారలచే నొప్పు నైరావణదంతివోలెఁ బ్రకాశించుచుండెను. ఆయన శిఖయందొక బిల్వదళము. ఆ యాకారవిశేషమంతయు నొక మహాపురుషత్వమును ద్యోతకము చేయుచుండెను. శ్రీనాథుఁ డాయనను జూచి యితడే యరుణగిరినాథుఁడు గావచ్చు ననుకొనెను. ఆ వ్యక్తి శ్రీనాథునివంక నొకటి రెండుక్షణములు తీక్ష్ణముగాఁ జూచి దాఁటుకొని పోయెను. శ్రీనాథుఁడతనివంక వెనుకకుఁ జూచెను. ముమ్మకవి లేచి యావ్యక్తి నాహ్వానించుచుండెను. శ్రీనాథుఁడు "ఓహో! నిశ్చయముగా నీతఁడే డిండిమభట్టు. వివాదమునకు బీజావాపము సమృద్ధిగాఁ జేసియే వచ్చితిని. అది నేఁట రేపట మొలకలెత్తగల దనుకొనుచు బసవైపు నడచెను.

రెండురోజులాగి మూడవనాఁటి యుదయమున శ్రీనాథుఁడు దగ్గుపల్లి దుగ్గన్నను ముమ్మకవియింటికిఁ బంపెను. ముమ్మకవి దుగ్గన్నను జాలనీరసముగాఁ జూచెను. అతఁడు "ఏమోనయ్యా! ఇప్పటిలో మీ గురువుగారికి రాజదర్శన మబ్బునట్లు లేదు. వసంతోత్సవములదాఁక వేచి యుండవలసివచ్చును. ఆయనయెడ మహారాజంత సుముఖముగా లేరు. అయనను నాయనకంత గర్వమేమి? తనకంటెఁ గవిలేడన్నట్లుగా మాట్లాడినాఁడు. ఆ మాటలువిన్న నెవ్వరికైనఁ గోపమువచ్చు" ననెను. దుగ్గన్న "అయ్యా! మీ మహారాజు మాగురువుగారి నెఱుఁగరు గదా! సుముఖుఁడగుటకును విముఖుఁడగుటకును, గనీసము ముఖపరిచయమైన లేదే. సరే! అదియట్లుండనిండు. మీరన్నట్లు మాగురువుగారు మాటాడిరా? మీరన్న మాటల కాయన సమాధానము చెప్పవలయునుగదా.!

దానిలో గర్వమేమున్నది? అసలా సమాధానము మేము చెప్పవలసినది. మీయందలి గౌరవముచే నాయన చెప్పెను. ఆయన కవిసార్వభౌముఁడ నన్నచో మీకుఁ గోపము రానేల? ఆయనకు గర్వమున్నదని వాదము కొఱకంగీకరింతము. ఆయనగర్వము మీకుఁ గోపకారణము కానేల? కాబట్టి యాయనచెప్పిన సమాధానమువలన మీయభిమానమునకు దెబ్బ తగిలినదన్నమాట. సరే! మీకెట్లును గోపమువచ్చినది. ఆయన సార్వభౌముఁడని నిలఁబెట్టుకొందుము. సభ చేయించుఁడు. లేనిచో నామాట యొప్పికొనుఁడు. మేము 'పోయెద' మనెను.

ముమ్మకవి :— ఓయీ! నీవును మీ గురువుగారికిఁ దగిన శిష్యుఁడవే. ఏమో యనుకొంటిని. కొయ్య మేళమునకుఁదగ్గ తాళము. నేను జెప్పిన మాటలలో దోషారోపణముచేసి తర్కించుచున్నావు.

దుగ్గన్న :— మీరన్నట్లు మా గురువుగారికిఁ దగ్గ శిష్యుఁడనే. కావుననే మీరుచేసిన మేళమునకుఁ దాళమువేసితిని. ముమ్మకవి గారూ! మాటకు మాట తెగులు, నీటికి నాచు తెగులు. ఈ వాగ్వాద మేల? విద్యావాదములోనికి దిగుఁడు. ఎట్లును రానేవచ్చినది. సభ పెట్టించుఁడు.

ముమ్మకవి :— పెట్టించెదను. తొందరపడకుఁడు. ఆ సభలో సప్తదిగ్విజయ డిండిమము గణ గణ మ్రోగినప్పుడు చెవులకు గంతలు గట్టుకొనవలయుసుమా! అప్పుడీ బింక మేమాత్రమైన జారినదా నలుగురిలో నగుబాటుపాలగుదువు. సభ పెట్టించెదను. వసంతోత్సవముల వఱకు గడువిచ్చుచున్నాను. ఈ లోపలఁ జదివికొన్న శాస్త్రములను సానబట్టికొనుఁడు. ఇంక నేమైన త్రుప్పుమిగిలినచో డిండిమ కవి సార్వభౌముఁడు ప్రతిభటకవికుంజరపంచాననుఁడు, షడ్దర్శన భట్టుఁడు అఖిలవేదసాగర సాంయాత్రికుఁడు, అరుణగిరినాథుఁ డష్టదిగ్వి

జయ పటహీకృత బిరుద డిండిమ చండనాదములచే రాలఁగొట్టఁ గలఁడు.

దుగ్గన్న :— సాధు! సాధు! ఆ వసంతమునవఱకు మీకింత గడువు మాకక్కఱలేదు. అందాఁక యేఁటికి? నేఁట రేపట సభ పెట్టించుఁడు. మా త్రుష్టి నాయన రాలఁగొట్టుటయో యాయన డిండిమమును మేము పగులఁగొట్టుటయో తేలిపోవును. నేఁటి సాయంకాలమునవఱకు మీకు గడువిచ్చితిమి. లేనిచో రేపటి యుదయమున మీ మహారాజు నొద్దకు మేమే పోఁగలము. నేను బోవుచున్నాను.

దుగ్గన్న మొగమున గంటుపెట్టుకొని వెడలిపోయెను. ముమ్మకవి యావిద్యార్థి విజృంభణముఁజూచి తెల్లవోయెను. అతనికిఁ బదిక్షణములవఱకు మనసాడలేదు. దుగ్గన్న పదిబాఱలుపోవునంతవఱకు నతఁడు పోవుచున్న సంగతియె ముమ్మకవికిఁ దెలియలేదు. తఱువాత ముమ్మకవి పోవుచున్న దుగ్గన్నవంకఁ జూచి నిట్టూర్చి తలయూచెను. "వీఁడు నెట్టిక సీలంతలేఁడు. వీనికింతపొగరా! మహాపండితు లనేకులు నాయొద్దకెంతమంది వచ్చిరిగాదు. వారందఱు నాయెదుటఁ బిల్లులవలె సంచరించిరి. అందాకనేల! మా యరుణగిరినాథునంతటివాఁడు నాకు బ్రహ్మరథము పట్టును. వానిముందీ శ్రీనాథుఁడెంత! అసలాకవిద్యార్థిని నాయొద్దకుఁ బంపుటయె తప్పు. వచ్చినఁ దానురావలెను. పోనీ యాపంపుటలో నెవనినైన వినీతునిబంపినాఁడా! వట్టిపొగరుబోతునుబంపినాఁడు. అయినను నాగురువునకు వినయమున్నదా! యాశిష్యులకుండుటకు! కుమ్మరియావమున నిప్పడిమంత లుండునా?"

అతఁడిట్లనుకొనుచున్నంతలో నచటికరుణగిరినాథుఁడు వచ్చెను. అరుణగిరినాథుఁడు ముమ్మకవియాకారమునుజూచి "యేమిబావగారూ! యాకోపమంతయు నెవరిపైని? నామీఁదగాదుగదా" యనెను.

ముమ్మకవి :— ఆపోవుచున్న కుఱ్ఱవానిని జూచితిరా ? మీ కెట్లు కన్పించినాఁడు ?

అరుణగిరినాథుఁడు :— ఆఁ చూచితిని. క్రౌంచపర్వతమునకుఁ దొలిగొట్టిన పరశురామునివలె నున్నాఁడు.

ముమ్మకవి :— వాఁడు శ్రీనాథుని శిష్యుఁడట. వట్టిపొగరుబోతు. గురువునకుఁదగ్గ శిష్యుఁడు. వానియిష్టమువచ్చినట్లువాగిపోవుచున్నాఁడు.

అరుణ :— ఎవరా శ్రీనాథుఁడు ?

ముమ్మకవి :— కవిసార్వభౌముఁడయ్యా ! కవిసార్వభౌముఁడు. ఇంక మన రాజాస్థానమున కతఁడువచ్చిన మీకును నాకునుగూడ స్వస్తియే.

అరుణగిరినాథుఁడు నిశితముగాఁ జూచుచు "ఎవరండీ యా కవి సార్వభౌముఁడు ? మనమెప్పుడును వినియైన నుండలేదే. ఇంతకాల మెచటదాఁగికొనినాఁ" డనెను.

ముమ్మకవి :— ఆయనది కొండవీఁడు. మనయాస్థానమునఁ దన బిరుదము పాడుకొల్పుకొందమని వచ్చినాఁడు. మఱి యిచ్చట మీరుంటి రాయెను. మీ యిద్దరిలో నెవరు సార్వభౌములో నాకుఁ దెలియుట లేదు.

అరుణ :— దాని కేమున్నది ? అది తెలియుటెంతపని ? మీరు సెలవిచ్చినచో తృణములమీఁదఁ దేల్చి వేయఁగలను. ఇతఁడేమి కవి మల్లునికంటె గొప్పవాఁడా ?

ముమ్మకవి :— అందాక యెందులకు ? రాయలవారితోఁ జెప్పి యాతనికి దేవిడీమన్నా చేయించెదను. దానితో నతనికిఁ దగిన పరాభవ మగును. మీతో వాదించి యోడిపోయినను నది యతనికి గౌర

వనే యగును. కావున నట్టి యవకాశమే యీయరాదు. మనమిద్దఱ మును బోయి రాయలవారితో నీ సంగతి మనవిచేయుదము రండు.

ముమ్మకవి లోనికిఁబోయి వేషము మార్చుకొని వచ్చెను. వారిద్దరును రాచనగరువైపు నడచిరి.

దుగ్గన్న బసకుఁబోయి శ్రీనాథునితో సంగతియంతయుఁ జెప్పెను. శ్రీనాథున కొడలుమండుకొనిపోయెను. అతఁడు "దుగ్గన్నా మంచిపనిచేసితివి. వారికిమనము తెలుఁగుకవులమని లఘుభావమున్నది. వారిచేత నాంధ్ర సరస్వతి పల్లకి మోయించెదను. సరే రేపుదయము వారి కనువుపెట్టివచ్చితివిగదా !" యనెను.

అనాఁటి సాయంకాలము ముమ్మకవినుండి సమాధానమేమియు రాలేదు. మఱునాటి యుదయము కొంచెము ప్రొద్దెక్కునందాక గూడా శ్రీనాథుఁడు వేచి చూచెను. అప్పటికిని సమాధానము రాలేదు. అతఁడు దుగ్గన్నను బిలిచి 'దుగ్గన్నా! రాయలవారితో నామాటగా నిట్లు చెప్పుము. 'అయ్యా! మేము పండితులము. మేమేమైన నోర్చుకొందుముగాని విద్యావిషయమున నవమానము నోర్చుకొనలేము. విద్యావిషయమున వివాదముగల్గినచో నూఱకుండరాదని శాస్త్రములు చెప్పుచున్నవి. తమయాస్థానవిద్యాధికారి మాకవమానముగ మాట్లాడినాఁడు. మాకు వసంతోత్సవముల కింటికిఁబోవలసియున్నది. కావున నేట రేపట సభయేర్పాటుగావించి వాదము పెట్టించుఁ''డని.

దుగ్గన్న బయలుదేఱి రాచనగరున కేఁగెను. కాని ప్రతీహారులతనిని లోపలకుంబోకుండ నడ్డగించిరి. వారతనిని మీరు శ్రీనాథయ్య శిష్యులా? యని యడిగిరి. దుగ్గన 'అవు' నని సమాధానము చెప్పెను. వారు "ముమ్మకవిగారు మీకుఁ బ్రవేశ మీయవద్దన్నా రని చెప్పిరి.

దుగ్గన్న తిరిగివచ్చి శ్రీనాథునితో నాసంగతి చెప్పెను. శ్రీనాథునకు మిక్కిలి కోపమువచ్చెను. అతఁడాకును గంటమును జేఁబూని పరపర నొక పద్యము వ్రాసి యిదితీసికొనిపోయి యాభటునితోడనే లోపలకు పంపుమనెను. దుగ్గన్న యా యాకును తీసికొనిపోయి భటునిచేతికిచ్చి యిది ప్రభువునకిమ్మని చెప్పెను. ఏవైన నుత్తరములు కొనిరావద్దని ముమ్మకవి చెప్పలేమగాన భటుఁడాయాకును గొనిపోయి ప్రౌఢదేవ రాయల ముందుంచెను. ఆసమయమున నచట నరుణగిరినాథుఁడు ముమ్మకవియు నుండిరి. ప్రౌఢదేవరాయలా యాకును బుచ్చుకొనిచూచి ముమ్మకవికిచ్చెను. ముమ్మకవి యిట్లుచదివెను.

డంబు సూపిధరా తలంబుపైఁదిరుగాడు
కవిమీఁదఁగాని నాకవచమేయ

దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁ గాని కాలుచాప

సంగీతసాహిత్యసరస విద్యలనేర్చు
గవుల తొమ్ములుగాని కాల్చివిడువ

చదువు సంధ్యలులేక సభలందుఁ బ్రేలెడి
కవినోరుగాని వ్రక్కలుగఁ దన్న

దంటకవులకు బలువైన యింటిమగడ
కవులవాదంబు వినవేడ్క గలిగెనేని
నన్ను బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర.

రాయలు పద్యమును విని తలయూఁచి "ముమ్మకవిగారూ! మీరీయనను గుఱించియేనా నిన్న చెప్పినది?" యని యడిగెను.

ముమ్మకవి :— చిత్త మీతఁడే. నేనొనర్చిన తప్పిదమెల్ల నాతనిని వసంతోత్సవములవఱకు వేచియుండుమంటిని. అప్పుడనేక దేశాగతులగు మహాపండితులు సభ నలంకరింతురు. వారియెదుట నీవిద్య ప్రకాశింపఁజేసికొనవచ్చునంటిని. కాని నామాట లాతనికి రుచించలేదు. నేను నిన్న తనుతో మనవిచేసితిని గదా! అతనికి మర్యాద తెలియదు. ఈ పద్యమును జూచితిరా యెట్లు వ్రాసినాఁడో? అతఁడు మాయందరినోళ్ళపైఁ దన్నునట. అప్పుడు నిట్లే మాట్లాడినాఁడు. అయ్యో! అతనికిఁ దలకుమించిన యహంకార మున్నది. అట్టివానికి సభాప్రవేశము నెట్లిప్పింతుము! అతఁడు రాజసభాయోగ్యుఁడు కాఁడు. ప్రభువువా రతనికి దేశబహిష్కారము చేయించవలెను.

ప్రౌఢ :— కాదు కాదు. అతని నొక పర్యాయము చూడవలయు ననియున్నది. అతఁడు కోమటివేమారెడ్డి యాస్థానమున విద్యాధికారియని చెప్పితిరి గదా: కోమటివేముఁడు సర్వజ్ఞచక్రవర్తి యని ప్రసిద్ధిపొందినాఁడు. అతని యాస్థానమున విద్యాధికారియన్న నెంతటివాఁడో! అతఁ డహంకారియని పద్యమే చెప్పుచున్నది. కాని పాపమతఁడు కొండవీటినుండి యిచ్చటికి వచ్చెను. ఎంతో ప్రయాసపడి వచ్చినాఁడు. అట్టివానికి సభాప్రవేశమీయక వెడలఁగొట్టుట సరసముగా నుండదు. అదిగాక మన వామనభట్టుగా రచటనున్నారుగదా! తమ యాస్థానపండితునికి సభాప్రవేశమైన నీయనిచో నాయన యేమనుకొనును? ఇంతకు నాయనవచ్చి యెన్నిరోజులైనదో? పాప మెచ్చటనున్నాఁడో: కనుగొంటిరా?

ముమ్మకవి మొగము వెలవెలబోయెను. అతఁడు "నేనడిగితిని గాని యతఁడు చెప్పలేదు. అతఁడు వసంతోత్సవములకుఁ దిరిగిపోవలయునని తొందరపడుచున్నా" డనెను. అరుణగిరినాథుఁడు ప్రభువు

వంకఁ జూచి ప్రభువునకు సభ పెట్టించుటయే యిష్టమైనచోఁ ద్వరగాఁ
బెట్టించుటయే మంచిది. మనము వసంతోత్సవములదాక నాఁగు
మన్నచో నతఁ డెట్లును వెడలిపోవును. మన మాతనితో గెలువలేక
కాలయాపనము చేసినట్లుండు" ననెను.

రాయలు :— నేను జంద్రభూషక్రియాశక్తి రాయలవారికి నేఁడే
కబురు వెట్టెదను. ఆయన రేపటెల్లుంట రాఁగలఁడు. ఆయన
మీ వాదములకు మధ్యవర్తిత్వము నెఱపును. మీరుపోయి రేపు
పంచమినాఁటికి సభ పెట్టు నేర్పాటు గావింపుఁడు.

ముమ్మడికవియు నరుణాగిరినాథుఁడును సెలవుదీసికొని వెడలి
పోయిరి. మఱి రెండు రోజులవఱకు శ్రీనాథున కెట్టి కబురును రాలేదు.
శ్రీనాథుఁడు వేచి వేచి ప్రాణము విసిగిపోయెను. అతఁడు వేషమును సవ
రించుకొని బయలుదేరెను. ఆవేషము బహువిచిత్రమైనది. తలపై నొక
కుళ్లాయి. ముంజేతులవఱకు, మోఁకాళ్లవఱకుఁ జుంగులు వ్రేలాడు నొక
కూర్పాసము నడుమునకుఁ గాసెకోక. శ్రీనాథుఁ డీవేషమును గట్టి
యద్దములోఁ జూచుకొనెను. అది పరమవికారముగఁ గన్పించెను.
వైదేశికులగు పండితులు రాజదర్శనమునకుఁ బోవునప్పు డట్టి వేషమును
ధరించుట యచటి యాచారము. 'ఇంత వికారముగానున్నను నీవేష
మును వేసికొనుట తప్పదు. ఎనుబదిరెండు పన్నాలు చదువుకొన్న వాఁ
డను. ఘనాంతస్వాధ్యాయిని. నిరంతరశివపూజాతత్పరుఁడను. ఇట్టినాకు
విశ్వస్తచేతికూడు దినుట తప్పినదా? శ్రీనాథుఁ డిట్లనుకొనుచు రాచ
నగరు సమీపించెను. ద్వారమునొద్దఁ బ్రతిహారి యడ్డగించి లోనికిఁ
బోనీయలేదు. శ్రీనాథు డిది యూహించి యాకును గంటమును వెంటఁ
దెచ్చెను. అతఁడు ప్రక్కనున్న దుగ్గన్నతో వ్రాయుమని యీ పద్య
మును జెప్పెను.

కుల్లాయుంచితి కోకఁజుట్టితి మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్తవడ్డింపగాఁ
జల్లాయంబలి ద్రావితిన్ రుచుల దోసంబంచుఁ బోనాడితిన్
తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? యేను శ్రీనాథుఁడన్.

దుర్గన్న పద్యమునువ్రాసి ప్రతీహారి చేతికిచ్చెను. ప్రతీహారి లోనికిబోయి రాయలకా పద్యమునొసంగెను. రాయ లాపద్యమును జదివికొని మిక్కిలి జాలిపొంది "అయ్యో! యీముమ్మకవిగారు కోపము చేత నాయనకు సభసంగతి చెప్పలేదుగావలయు" ననుకొని యా యాకునేత్రిప్పి రేపుపంచమినాఁడు సభయేర్పాటు చేయించుచున్నాము. సిద్ధపడియుండుఁడని వ్రాసిపంపించెను. శ్రీనాథుఁ డదిచూచుకొని తృప్తి చెంది వెడలిపోయెను.

నాఁడుఫాల్గున శుద్ధపంచమి. శ్రీనాథుఁడుదయమున లేచి స్నాన సంధ్యాద్యనుష్ఠానములు గావించుకొని చింతామణి మంత్రమును పునశ్చరణ మొనర్చి హృదయమున శారదామూర్తిని బ్రత్యక్షీకరించుకొని సశిష్యుఁడై రాచనగరునకు బయలుదేరెను. రాచనగరున సభ ముత్యాలశాలలో నేర్పాటుసేయఁబడెను. ఆభవనమునుజూచి శ్రీనాథుఁ డచ్చెరువడెను. అదిచాల విశాలమైన భవనము. భవనమునందంతటఁ గనక తోరణములు నానా మణిగణస్థగితములు గట్టఁబడియుండెను. గోడలన్నియు ముత్యాల జాలికలచేఁ గప్పఁబడియుండెను. పైనఁ గప్పంతయుఁ బాలగచ్చులో మౌక్తికములు మణులపొదులు మెదిపి నానారమణీయ శిల్పములు వ్రాయఁబడియుండెను. ఆ మణుల కాంతులు నేలపైఁ బరచఁబడిన వజ్రకుట్టిమములందుఁ బ్రతిఫలించి నానావర్ణ కిర్మీరిత కాంతి సముద్రములు వెల్లివిరియుచుండెను. శ్రీనాథుఁడు భవనములో నడుగిడెనో లేదో దూరముననున్న పాలచెట్టుపై నుండి పైఁడిగంటలు

కిలకిలహాసెను. శ్రీనాథునియనుభావ విశేషమునుజూచి సమ్మోహితులై యచటివారెల్ల లేచి నిలువఁబడిరి. ప్రౌఢదేవరాయలు శ్రీనాథుని సాదరముగా నాహ్వానించి కూర్చుండఁజేసెను. శ్రీనాథుఁ డొకపరిసభయంతయుఁగలయఁ జూచెను. సభయంతయుఁ బండితులతో గిటకిటలాడుచుండెను. ప్రౌఢదేవరాయలకుఁ గుడిప్రక్క ముమ్మకవి కూర్చుండియుండెను. అతనిప్రక్క నరుణగిరినాథుఁడు. అతనిప్రక్క వాని కుమారుఁడు రాజానాథుఁడు వారికెదురుగాఁ బెద్దకంచుఢక్క తళతళలాడుచుండెను. సింహాసనమునకు ముందుభాగమున దానికంటెఁ గొంచెము నిమ్నముగా నొక పెద్దయాసనము వేయఁబడి యుండెను. దానికి రెండు ప్రక్కల నంతకంటె నిమ్నముగా రెండు ప్రక్కల వరుసగా నాసనములు వేయఁబడియుండెను. వానిపై నెవ్వరును గూర్చుంచి యుండలేదు. తక్కిన సభయందంతటను నొక ప్రక్క షడంగవేత్తలగు పండితులు. నొకప్రక్క కవిగాయకులు, నాట్యవేత్తలు, కూర్చుండి యుండిరి. వారంద ఱెవరిరాక కోసమో యెదురు చూచుచున్నట్లుండెను. వారి దృష్టులన్నియు ద్వారమునందుఁ గేంద్రీకరింపఁబడి యుండెను ఎవ్వరును మాట్లాడుటలేదు. ఇట్లొక గడియకాలము గడచెను. అనంతరమచటికెవరో యొకవ్యక్తి వచ్చెను. ఆయననుజూచి రాజుతోఁ గూడ నందఱునులేచి నిలువఁబడిరి. శ్రీనాథుఁడునులేచి నిలువఁబడెను. ఆయన కెనుబదియేండ్ల వయసుండవచ్చును. ఆయన యొడలెల్ల ముగ్గిన రసాలమువలెవాడి ముడుతలుపడి యుండెను. ఆయన కర్ణములు చాల పెద్దవై తమ్మెలు వ్రేలాడుచుండెను. నెఱసిన యాయన కనుబొమలు గుబురులై పెరిగి ఱెప్పలను గప్పి వేయుచుండెను. ఆయన యా వయసులోఁగూడ నించుక వంగలేదు. ఆయన శలాకవోలె సరసర నడచి వచ్చి రాజు నాశీర్వదించి పీఠముపైఁ గూర్చుండెను. తక్కినవారెల్లరు

గూర్చుండిరి. శ్రీనాథుఁ డాయనయే చంద్రభూష క్రియాశక్తి రాయలని తెలిసికొనెను.

చంద్రభూషక్రియాశక్తి రాయలు సభయెల్లఁ గలయఁ జూచి యందు శ్రీనాథయ్యగా రెవరని పిలిచెను. శ్రీనాథుఁ డాయనయొద్దకుఁ బోయెను. రాయన శ్రీనాథుని దనకుడిప్రక్కఁ గూర్చుండ నియమించెను. శ్రీనాథుని శిష్యులు లేచివచ్చి యతనిప్రక్కఁ గూర్చుండిరి. చంద్రభూషక్రియాశక్తి యరుణగిరినాథుని బిలిచెను. అతఁడును ముమ్మ కవియు రాజానాథుఁడునువచ్చి యెడమప్రక్క గూర్చుండిరి. రాజానాథుఁడు కూర్చుండుటతోడనే విజయడిండిమమును మూఁడుసారులు మ్రోగించి యరుణగిరినాథుని ప్రశస్తి నిట్లుచదివెను. “జయ! జయ! బిరుదకవి ప్రపితామహా! దశరూపనారాయణ! రసిక కవితాసామ్రాజ్య లక్ష్మీపతి! నవనాటక భరతాచార్య! కవిమల్ల గల్లతాడన పటు వాగ్దండ! ప్రతిభటకవికుంజర పంచానన! చేరచోళ పాండ్యప్రథమారాధ్యహృదయ శివాభిఖ్య! అష్టభాషా పరమేశ్వర! అష్టదిగ్విజయ పటహీకృత బిరుద డిండిమాడంబర! షడ్దర్శన షణ్ముఖ: అఖిలవేద సాగరసాంయాత్రిక! విజయడిండిమ వినాదప్రచండిత బ్రహ్మాండభాండోదర! డిండిమ మహాకవి సార్వభౌమ! శ్రీమదరుణగిరినాథ మహాకవినాథ! నీకు జయము జయమని మఱల మూఁడుసార్లు డిండిమము మ్రోగించి కూర్చుండెను. చెన్నమరాజకవి లేచి శ్రీనాథుని బిరుద గద్యము చదువఁ బోయెను. శ్రీనాథుఁ డతని వారించి కూర్చుండఁ జేసెను. రాజతని వినయమునుజూచి మిక్కిలి యాశ్చర్యపడెను.

చంద్రభూష క్రియాశక్తి రాయలమొదటగాఁ దర్కశాస్త్రము నందేదో విషయము నెత్తికొని ప్రతిపాదనముసేసి యరుణగిరినాథుని మొగమువంకఁ జూచెను. అరుణగిరినాథుఁడు నేను సిద్ధాంత మొనర్తును.

ఆయనను బూర్వపక్షము చేయుఁడని చెప్పఁడనెను. శాస్త్రవాదము లలోఁ బూర్వపక్షము సేయువానికంటె సిద్ధాంతము సేయువానికి గౌర వము మెండు. గొప్పపండితు లెవ్వరును బూర్వపక్షము సేయుట కంగీక రింపరు. అందుచే మొదటగా విద్యార్థులచేతఁ బూర్వపక్షము ప్రతిపా దింపఁజేసి పండితులు చెరియొక ప్రక్కనుఁ జేరి వాదింతురు. చంద్ర భూషక్రియాశక్తి శ్రీనాథుని మొగమువంకఁ జూచెను. శ్రీనాథుఁడు దుగ్గన్నవంకఁ జూచెను. దుగ్గన్న లేచి పూర్వపక్షము చెప్పి కూర్చుం డెను. రాజనాథుఁడు లేచి సిద్ధాంతము చేసెను. దుగ్గన్న విజృం భించెను. క్రమముగా వాదము పెద్దదయ్యెను. కోటి వెంబడి కోటిగా ఖండనమండనములు కొనసాగెను. మూఁడునాళ్లు గడిచినపైన తర్వాత ననుకొనకుండగనే యరుణగిరినాథుఁడును శ్రీనాథుఁడును వాదము లోనికి దిగిరి. ఈప్రకారము వారిద్దరిమధ్య వాదము లుద్భటముగ మూఁడురోజులు కొనసాగెను. ఈమూఁడురోజులలో వేదవేదాంగాది విద్యలన్నియు దర్శనము లన్నియు వారివాదములందు గిరగిర తిరిగి పోయెను. మూఁడవనాఁటి సాయంకాలమగుసరికి నరుణగిరి నాథుఁడు వాదమునందుఁ దప్పటడుగులు వేయసాగెను. చంద్రభూష క్రియా శక్తిరాయలు హృదయమున సర్వజ్ఞమూర్తియగు శివుని సన్నిహితుని గావించుకొని వారివాదములకు మధ్యవర్తిత్వము నెఱపెను. అతఁడు వారిద్దఱిని శాస్త్రకషణమున నొఱపిడిపెట్టి చూచెను. ఒఱసిన కొలఁది శ్రీనాథుని బుద్ధి మేల్మిబంగారమై మెఱుపులు గ్రక్కెను. తుద కరుణగిరినాథుఁడు పిడివాదములోనికి దిగెను. చంద్రభూషక్రియాశక్తి గంటగ్రమోగించి వానిని సన్మార్గమునకుఁ ద్రిప్పవలసివచ్చెను. అరుణ గిరినాథు డోటమి యంగీకరింపక తప్పలేదు. వాదాంతమునఁ జంద్రభూషక్రియాశక్తినిలుచుండి శ్రీనాథుని పాండిత్యప్రకర్షను శ్లాఘిం చుచు నాతని విజయమును బ్రకటించెను.

తఱువాత ముమ్మకవి లేచి యింతటితో నైపోలేదు. నేను కొన్ని సమస్యల నిచ్చెదను నాసమస్యలను బూరించినఁగాని శ్రీనాథయ్య గారి విజయ మంగీకరింపఁబడద నెను. శ్రీనాథుఁ డాసమస్యలను దనశిష్యుల చేతఁ బూరింపఁ జేసెదననెను. ముమ్మకవి యనేక విషమసమస్యల నొసంగెను. ఆశు, గర్భ, చిత్రాష్టావధాన శతావధాన నేత్రావధాన విషయములఁ గూర్చి ప్రశ్నించెను. దుగ్గన చెన్నమరాజు లిద్దరు నడిగినదడిగినట్లుగా నిలిచి యుత్తరించిరి.

వివాద మైపోయెను. ముమ్మకవియు నరుణగిరి నాథుఁడును మొగములు వ్రేలవైచుకొని కూర్చుండిరి. దుగ్గన్న మేము డిండిమ కవిసార్వభౌముని జయించితిమి. మా గురువుగారు కవిసార్వభౌముం డని యాకర్ణాటక్షితిపాలుని యాస్థానమునఁ బాడుకొల్పితిమి. నేను ముమ్మకవిగారితో నానాఁడు చెప్పితిని. దానిప్రకార మీవిజయడిండిమ మును బగులగొట్టింపవలయును. గొడ్డలి తెప్పింపుఁ డనెను. రాజనాథుఁడు చేయునదిలేక డిండిమము నీవలబెట్టి యూరకుండెను. మహారాజునాజ్ఞచే గొడ్డలి కొనిరాఁబడెను. దుగ్గన్నయు, చెన్నమరాజును దగ్గఱనిల్చి డిండిమమును బగులగొట్టించిరి.

తఱువాతఁ బ్రౌఢదేవరాయలు సింహాసనముదిగివచ్చి శ్రీనాథుని కౌఁగిలించుకొని ' మహాకవీ! మూడురోజులనుండి తర్కకర్కశములైన మీవాదములువిని తలదిమ్మెక్కిపోయినది. అమృతమధురమైన మీ కవిత్వమును వినిపించి యానందింపఁ జేయుఁడని కోరెను. శ్రీనాథుఁడు

" జననాథోత్తమ దేవరాయనృపతీ! చక్రేశ శ్రీవత్సలాం
ఛనసంకాశమహాప్రభావ! హరిరక్షాదక్ష! నా బోటికిన్
కునృపస్తోత్ర సముద్భవంబయిన దాగ్దోషంబు శాంతంబుగాన్
కనకస్నానముచేసిగాక పొగడంగా శక్యమే దేవరన్ "

అని చదివెను. ప్రౌఢదేవరాయలు మహాకవి ! నామనసునఁ గూడ మీకాగౌరవము సేయవలెనని యున్నదని యమాత్యులనుబిలిచి బంగరుటంకములు, రత్నములు, ముత్యములు తట్టలతోఁ దెప్పించెను. ఆ సభాభవనమునడుమ నున్నతాసనము వేయించి శ్రీనాథునందుఁ గూర్చుండఁజేసిరి. బ్రాహ్మణులు వేదమంత్రములు చదువుచుండిరి. పండితు లందఱును స్వస్తివాచనము చేయుచుండిరి. వారాంగనలు చుట్టును నిలువఁబడి నీరాజనములు నెత్తుచు మధురముగా బాడుచుండిరి, మంగళతూర్యనినాదములు గంభీరముగా మ్రోయుచుండెను. వార యువతులందించుఁ బళ్ళెరములు చేతబట్టుకొని ప్రౌఢదేవరాయలు శ్రీనాథునికి రత్నసువర్ణాభిషేకము సేసెను. సువర్ణములు, రత్నములు ముత్తెములు నిలువెత్తున గుట్టవడెను.

తఱువాత శ్రీనాథుఁడా సువర్ణరాసి నంతను నచటఁ జేరిన బ్రాహ్మణ సముదాయమునకు సమముగాఁ బంచియిచ్చెను. వారంద ఱాతని యౌదార్యమును వేనోళ్ళశ్లాఘించిరి. శ్రీనాథుఁడు లేచి నిలువఁబడి

జోటీభారతి యార్భటిన్ మెఱయుమీ చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు దేవరాయనృపతిన్ నాసీరధాటీచమూ
కోటీఘోటక ధట్టికాఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీభూతధరా రజశ్చులికితాంభోటిన్" బ్రశంసించెదన్ 4

అని మొదలుపెట్టి రెండుగడియలకాలము ప్రౌఢరాయలపై సరస్వతీ వర్షము గురిపించెను.

నాఁటికి సభయైపోయెను. దుగ్గన్న చెన్నమరాజాదులు మూఁడు లోకములను జయించిన వారివలె శ్రీనాథుని వెంట బసకు నడచిరి.

మఱునాఁడు శ్రీనాథుఁడు రాజదర్శనమున కేఁగి తన యాగమన ధారణమెఱింగించెను. ప్రౌఢదేవరాయలు తొలుత నించుక యాలోచించి

"మహాకవీ! యిది రాజకీయమైన విషయము. అయినను మీరు మహాకవులు, ప్రౌఢభావ సరస్వతులు వచ్చి నన్నర్థించినప్పుడు కాదని యెట్లనగలను! కాని మీకిందుకు బ్రాత్యామ్నాయముగ నా కొక యుపకారమును జేసిపెట్టవలయును. మీరు పండితులు. పండితులాకరి యాస్తికారు. మీకీ రాజకీయ భేదము లక్కరావు. నేను సోమదేవచోడుని వదలిపెట్టెదను. మీరతనిని దీసికొనిపొండు. కాటయ వేమారెడ్డి కుమారుని కొమరగిరిని నన్న దేవచోడుడు బందీగాఁ గొనిపోయెనట. వానినికూడ వదలిపెట్టింపుఁ" డనెను. శ్రీనాథుఁడొప్పుకొనక తప్పినదికాదు. ఆతఁడెట్లుకాదన గలఁడు? దైవముపై సర్వభారమువైచి యతఁడు "మహారాజా! మీ యాజ్ఞచొప్పున నట్లే ప్రయత్నము చేయుదును. నేను రేపుదశమినాఁడు బయలుదేరి పోవుచున్నాను. సెలవిప్పింపుఁ డనెను. ప్రౌఢదేవరాయలు శ్రీనాథునికిఁ జీనాంబరములు ముత్తెములు రత్నములు కస్తురి తాంబూలములిచ్చి మిక్కిలి సంభావించి వీడుకొల్పెను.

## ౧౦

వసంతకాలము వచ్చెను. ఆకాలమువచ్చిన చాయలు కొండవీటి పట్టణమునకుఁ జుట్టు నున్న యారామములందలి చెట్లులందు వాని నాశ్రయించిన పిట్టలందు గోచరించెను. ఈవసంతము సరాసరి యాయుద్యానవనముల మీఁది కేదిగినదా? ఈవృక్షములన్నియుఁ నావసంత రాగము పర్వియెట్టగా మోసులెత్తినవి. ఈలతలన్నియుఁ దెల్లగాఁ బూచినవి. ఈయెట్టని మోసులీ తెల్లనిపూలు వీనిలోనే వసంత మున్నదా? వసంతము వచ్చినదనుటకు బాహిరములగు కారణము లీరెండే కన్పించుచున్నవి. మఱి యింకేవియో లక్షణములను గవులు చెప్పెదరు. "ఇదిగో! యీాయుదయరాగము పర్వి వనదేవత సవరించు

కొన్న మేలిముసుగువలె నున్నది. ఇదిగో! యీకోకిల వగరుచివుళ్ళు కొఱికి మెత్తగాఁ గూసి స్వాగతినెఱపినది. ఈచిలుకలు పదువులుగట్టి మన్మథుని రథమును లాగికొని వచ్చుచున్నవి. ఇదిగో! యీకంకేళి చూచితివా? గాలికి కదలాడుచు దగ్గఱకుఁ బిలుచుచున్నట్లున్నది. ఈకన్నెలు నృత్యావర్తన దక్షములై మదలాలసములైన పాదములందుఁ బారాణిపెట్టియందెల యులివులంచులఁ బిలుచుచుండగా నశోక వృక్షమును మెయ్యారముగఁ దన్నుచున్నారు. చూచితివా! వారి కాలితాపులకు దాని నిలువెల్లఁ బులకలు పుట్టినట్లు పూచినది. ఇదిగో! యీతుమ్మెద చూడుము. అకన్నె మొగ్గను గదిసి యల్లరి చేయుచున్నది." ఇట్టు లెన్నియో విధములఁ గవులు వసంతవైభవమును వర్ణింతురు. కాని యీయన్నియు నాచెట్లు చిగిరించుట. యీలతలుపూయుట, యన్న ప్రధాన లక్షణముల కనుసారులు. ఆచెట్లు చివురించక యీలతలుపూయక తక్కినవి లేవు. వాని నాశ్రయించి వసంతము ప్రకటించుకొన్న వైభవమును గవులు వర్ణించుకొనిరి. ఆ చివురాకుతుదలు కన్నులంటఁ బొడిచి యీపూలపుప్పొళ్ళు పృథివీగుణంబెల్ల నాసాగోళముల కెగబ్రాకించి ప్రాణికోటి హృదయములందు రాగమధువును బొంగించెను. ఆచివురాకుల నెఱ్ఱదనమును నాపూలసువాసనల నాశ్రయించి వసంతకాలము జనులు హృదయముల నాక్రమించి యచట నుత్సాహము నుద్దీపింపఁజేసెను. హృదయమున సన్నిహితుఁడైన వసంతునికి మొదటగా స్వాగతి నెఱపినవి చిలుకలు కోకిలలు కొదమతుమ్మెదలు. ఆ చిలుకల పలుకులు, నాకోకిలల కూతలు, నాతుమ్మెదల ఝుంకారములు వనములందు గగ్గోలుగా వినిపించి కొండవీటి ప్రజ నావంక కాకర్షించెను.

వసంతపంచమి వచ్చెను. అప్పటినుండి తొమ్మిది రోజులు ప్రజలందఱు శృంగార దీక్షితులు. కొండవీడుపట్టణమంతయు నానాఁడు

తెల్లవాఱుసరికిఁ జక్కఁగా నలంకరింపఁబడెను. రాజవీథు లన్నియుఁ జక్కఁగా నూడ్చి పన్నీటితోఁ గలయంపి చల్లి ముగ్గులిడిరి. మామిడిచివుళ్ళతోఁ దోరణములు గట్టిరి. నగరమందలి ప్రతి గృహమునకును జక్కఁగా వెల్ల వేసి జేగురుపట్టీలు పెట్టి పచ్చని తోరణములుగట్టి ముత్యాల ముగ్గులు పెట్టి యలంకరించిరి. ఊరియందుఁ జేసిన యలంకార మొకయెత్తు. ఉద్యానవనములందుఁ జేసిన యలంకార మొకయెత్తు. ఆ రెండిఁటిని ప్రాసునందిడి తూచినచో నుద్యానవనమునం దలంకార మెత్తునకెత్తెక్కువగా నుండెను. మామిడి చెట్లకుఁ దూఁగు టుయ్యెలలు, సురపొన్న పొదల జూదపుబల్లలు, మాలతీపందిళ్ళక్రింద మధుగోష్ఠులు. తరువులనీడల మన్మథ పూజలు, పూఁబొదరిండ్ల మధురకూజితములు.

వసంతపంచమి మొదలుకొని పట్టణము పట్టణమెల్లమహోత్సాహములు. తొలి మూఁడురోజులు వనములందు మామిడిచెట్టుల క్రింద మన్మథపూజనములు జరిగెను. స్త్రీపురుషులొకరినిమించి యొకరు పరమ మోహనముగా నలంకరించుకొనిరి. పురుషులు జరీచెంగావులు కట్టిరి. మెడలందు బన్నసరములు దాల్చిరి. చేతుల సింహతలాటపు మురుగులఁ బెట్టిరి. పాదముల గండపెండెరములు వీర వలయములు దాల్చిరి. నుదుటఁ బునుగు జవాది కస్తూరి కాశ్మీరముగలిపి తిలకము దిద్దిరి. మేనఁబచ్చకప్పురము గందవొడి గొజ్జంగినీరు నుశీరసారము గలపము సేసి యలఁదికొనిరి.

స్త్రీల యాహార్యక వైభవ మతిలోకమై చెలువారెను. వారు వివిధములగు వలిపెములు ధరించిరి. ఒకయామె చందనకావికట్టెను. మఱియొకయామె పట్టెడుకావికట్టెను. ఒక స్త్రీ చెంగావికట్టిన మఱియొకతె కదంబకావిగట్టెను. ఒక యువతి చిలుకచాళ్ళుగట్టిన వేఱొకతె వేటచాళ్ళుకట్టెను. ఒకతె నిండువన్నెలు నామెనెచ్చెలియుదుత్త

చారలవన్నెలు. ఒకబాల కంటకివన్నెలు నామెచెలులు పుప్పొడి వన్నెలులొకతె రుద్రాక్షవన్నెలొకతె, నిండువన్నెలొకతె, వెన్నెల వన్నెలొకతె. ఒకకుటుంబమున నాగబంధంబు లొకతె, పూజా బంధంబు కనకదండెలొకతె, కచ్చులంబులొకతె. మఱియొక గుంపు యువతులు హంసావళులు కొందఱు, హారిణావళులు గొందఱుఁ దురగా వళులు గొందఱు గజావళులు గొందఱు, సింహావళులు గొందఱు. ఒక పేటయువతులందఱు ద్రౌపదీ స్వయంవరంబులు. మఱియొక వీధి విలాసి నులు లక్ష్మీవిలాసములు. ఒకవీధి మదవతులు మదనవిలాసములు. వేఱొక్కవిధ పూఁబోఁడులు వసంతవిలాసములు. కొందఱుశృంగారిణులు రాయశృంగారములు, మఱికొందఱు చపలేక్షణలు కామవరంబులు, కొందఱు చంచలాక్షులు జలపంజరములు, సూరవరంబులు, తారా మండలంబులు. మఱికొందఱు పద్మగంధులు కర్పూరగంధులు; బారు వంపుగంధులు, కొందఱు శ్రీమంతురాండ్రు శ్రీతోపులు, శ్రీరామ తోపులు, కొందఱు విలాసినులు శ్రీకృష్ణవిలాసంబులు, జీబులు సుగి పట్టంబులు, నెమిలిపుట్టములు నంచతెక్కలు కలికంచులు బొమ్మం చులు ముడుగు బొమ్మంచులు ముయ్యంచులు. ఇట్లుయావతమంతయు వివిధములైన చీఱలసవదరించుకొనిరి. యమునా రైకలు బంగారు రైకలు, దాసూరి పట్టురైకలు, చీనిపట్టురెకలు, అద్దాల రైకలు తొడిగికొనిరి. చేర్చుక్కలు సీమంత భూషణములు సజ్జతిలకములు పాపటలందు నలంకరించుకొనిరి. పాపటకు నొకప్రక్క చంద్రవంక మఱియొకప్రక్క రాగిడి, కొప్పున బింబాభరణము పచ్చడపుగండ, గండ, బంగారుపూచేర్లు, ముత్యాలకుచ్చులు నలంకరించుకొనిరి. పైన ముత్యాలజల్లి పెట్టికొనిరి. మెడలో బంగరుకంటె, ముత్యాలపేరులు, పవడాలసరములు వజ్రాలహారములు, ముత్యాలపట్టెడలు పెట్టు కొనిరి. చెవులకుఁ జౌకట్లు, నొంటులు తాటంకములు, వజ్రాలకమ్మ-

గెంటులు పెట్టుకొనిరి. వానికి బవెరలు, కుంకెనకుచ్చులు నలంక రించిరి. చెంపసరాలు పెట్టుకొనిరి. నాసికలకు ముక్కెరలు, నట్టులు, కొందఱు ముత్యాలముక్కెరలు కొంద రద్దపు ముక్కెరలు ధరించిరి. చేతులకు రత్నకంకణములు, మురుగులు, శంకుకంకణములు, నీలాల గాజులు పెట్టుకొనిరి. దండలకు దండ తాయెతులు, వ్రేళ్ళకుంగరములు, నడుములకు నొడ్డాణములు, వంకెలయొడ్డాణములు ధరించిరి. ముత్యాల మొలనూళ్ళు, రత్నమేఖలలు, కనకఘంటలు మొలలందు ధరించిరి. కొందరు వజ్రాలకమరులు, నడుముల కలంకరించుకొనిరి. కాళ్ళకుఁ గడియములందెలు, మొల్లములు ధరించిరి. కాలివ్రేళ్ళకు మట్టెలు, శేఖరములు, పిల్లాండ్లు ధరించిరి. మొగమున లొద్దుగ పూలపిండినద్దికొనిరి. నుదుటఁ గాశ్మీరతిలకము దిద్దికొనిరి. కపోలములఁ గమ్మ కస్తురితో మకరికాపత్రములు చెక్కికొనిరి. మెడలందు శీరకలప మలఁదికొనిరి. పాదములఁ బారాణిపెట్టికొనిరి. కొప్పులమల్లెపూచెండ్లు, శ్రవణముల దిరిసెనపూవులు, గళమున మందారమాలలు చేతులఁ గెందామరలు, కటితటముల సిందువారమాలికలు ధరించిరి. గళము లందుఁ గోకిలకూతలు మాటలందుఁ జిలుకపలుకులు, అధరములందుఁ దొండపండులు, పాదములందుఁ జివురుటాకులు, కన్నులందుఁ దామర పూలు, ముఖములందుఁ బూర్ణచంద్రులు, గమనములందు రాజహంసలు, నవ్వులందుసంజవెన్నెలలు, వారందఱు గుంపులుగుంపులై నడుచు చుండగా వసంతవైభవము రూపుగాంచినట్లుండెను.

కోమటివేముఁ డుజ్జ్వలమైన వేషమును ధరించి బంగరు హౌదా కట్టిన పట్టపేన్గుపై వసంతారామమునకు బయలుదేరెను. అతని కుడి ప్రక్క రాచవేముఁడు నెడమప్రక్క సోమదేవచోడుఁడును బంచకల్యాణి గుఱ్ఱములపై వచ్చుచుండిరి. ముందు మాచారెడ్డి. అతనికుడిప్రక్క

మహామంత్రి. ఎడమవైపు గజరావుతిప్పనాయఁడు. వెనుక భాగమునఁ బురగారామయ్య తక్కిన దండనాథులు నశ్వములపై వచ్చుచుండిరి. నట్టువరాండ్రాడుచుఁ బాడుచుఁ ద్రోవచూపుచుండిరి. వారికి ముందు సన్నాయి మేళములు వసంతరాగాలాపమున నాకాశమార్గము నాప్యాయము గావించుచు నడచుచుండిరి.

ఉత్సవమంతయు నుద్యానవనము చేరెను. అచటఁ బల్లకీనుండి డిగ్గి కోమటివేముఁడు పరిజన పరివృతుఁడై లోనికిఁబోయెను. లోపల నొకప్రదేశమున మన్మథవిగ్రహము ప్రతిష్ఠితమైయుండెను. మన్మథుని ప్రక్కరతి. కుడిప్రక్క పార్వతీపరమేశ్వరులు. ఎడమప్రక్కలక్ష్మీనారాయణులు, వారిపార్శ్వముల సరస్వతీ చతుర్ముఖులు, శచీపురందరులు, వెనుక కాలభైరవుఁడు, వీరభద్రుఁడు డుంఠి విఘ్నేశ్వరుఁడు, షణ్ముఖుడు భార్యలతోఁగూడఁ బ్రతిష్ఠింపఁబడిరి. పార్శ్వముల ముల్లగూరమ్మ, ముత్యాలమ్మ, పోతురాజు, మొదలగు గ్రామదేవతలు నిలుపఁబడిరి. ఆప్రదేశము నావరించి యొకప్రక్క మావిచెట్లు, నొకప్రక్క నశోకములు, ఒకపక్క పున్నాగములు, ఒకప్రక్క సురపొన్నలు నిలువెల్లపూసి యుండెను. తట్టలతో వివిధములైన పుష్పములు సుకుమార పరిమళ భరితములు, మదబంభర ఝుంకార తుందిలంబులు సిద్ధమొనర్పఁబడి యుండెను. ఒకదెస పునుఁగు జవాది కస్తురి కుంకుమ చందనము నగరు గొజ్జఁగినీరు కలిపి సిద్ధమొనర్చిన వసంతము గుండిగలనిండి యుండెను. ఆగుండిగల ప్రక్కఁ దట్టలలో బంగారు చిమ్మన గ్రోవులు.

రాజచటికి వచ్చిన యొక గడియకాలమునకు సూరాంబ కొమరితతోడను గోడలితోడను జేటీజన పరివృతయై వచ్చెను. పురోహితుఁడు రాజదంపతులచేఁ దొలుతగా విఘ్నేశ్వరపూజ సేయించి తరువాత మన్మథపూజను నిర్వర్తింపఁ జేసెను. తరువాతఁ దక్కిన

దేవతలందఱు పూజింపఁబడిరి. అనంతరము రతీమన్మథులను రాజకులమంతయు బంగారుచిమ్మన గ్రోవులలో వసంతమునింపి స్నానము సేయించెను. తఱువాతఁ దక్కిన దేవతలపై వసంతము చల్లిరి. ఇట్లు మూఁడురోజులు మన్మథపూజనము గావింపఁబడెను. పట్టణము నందలి స్త్రీపురుషు లెల్లరు వనమునందు మావిచెట్లక్రింద విభవానుసారము మన్మథపూజ నిర్వర్తించిరి. తఱువాత మూఁడురోజులు పట్టణవీధులందు మన్మథుఁడూరేగింపఁబడెను. ఆయూరేగింపతివైభవముగా జరిగెను. పట్టపేనుఁగుపై బంగరు హౌదాలో రతిమన్మథుల విగ్రహములు. వారి పార్శ్వముల ముందు వెనుకలఁ దక్కిన దేవతలు, వారిముందు పట్టాశ్వముపైఁ బరివారయుక్తుఁడైన రాజు. వారిముందు నట్టువరాండ్ర యాటలు, సన్నాయిపాటలు, ఉత్సవముత్సవమెల్ల మొదటినుండి తుదివఱకుఁ జాతకలశములతో నలంకృతమైన వసంతము నిండించిన బంగరు గిండియలు తలలపైఁ బెట్టుకొని విలాసినులు. నానావర్ణ సమ్మిశ్రితములైన లొద్దుగపూఁబిండిబుట్టలను ధరించిన రమణీమణులు. కొందఱు వారకాంతలు గిండియలలోని వసంతమును జిమ్మన గ్రోవులతో లాగి రతీమన్మథులపైఁ దక్కిన దేవతలపైఁ జిమ్ముచుండిరి. ఉత్సవముత్సవమంతయు వసంతములో దొప్పదోగిపోయెను.

మఱిమిగిలిన మూఁడురోజులు రాజమార్గములందు రెండువైపుల సుగంధద్రవ్యసమ్మిశ్రితమగు గాశ్మీరద్రవము నిండించిన గుండిగలు బానలు దీర్చియమర్పఁబడెను. ఆగుండిగలనుండి చిమ్మన గ్రోవులతో నూరిలోని జనులెల్లరు వీరువారనక వసంతము చల్లికొనిరి. ఇట్లీతొమ్మిది రోజులు కొండవీటి నగరమున విలాస విలాసినీ జనముకప్పి వసంత వర్షముకురిసి కర్పూరకరకలు చిమ్మి కొండవీటిపట్టణము నంతయు ముంచియెత్తెను. ఆతొమ్మిదిరోజులు పృథివీగర్భ మహాసౌరభములు

విరిసినట్లు పురమీాప్రక్కనుండి యూప్రక్కకు నానాసువాసనాలవారి గుబాళించెను. ఆ గుబాళింపు నెలలతరబడి పట్టణమునంగాపుండెను. వసంతోత్సవములు తొమ్మిదినాళ్ళు పగలెల్లనూరేగింపులు. రాత్రులందు నృత్యగాన కవితావినోదములు. కొండవీటికి ననేక దేశాగతులైన కవిపండితులు, మహాగాయకులు, నటశిఖామణులు. నరుగుదెంచిరి. నట్టువరాం డ్రరుగుదెంచిరి. పేరణి, హల్లీసకము, గొండ్లి, దండోల్లా సకము, కందుకక్రీడ, జక్కిణి, చిందు మొదలైన మార్గదేశీ నృత్యంబు లును మత్తల్లి మొదలైన పారశీక నృత్యములొనర్చిరి. గాయకులు ధృవాప్రబంధమును గీతప్రబంధములు మంద్రక మహాప్రబంధములు ప్రావేశిక ప్రబంధములు మొదలైన మార్గసంగీతము, దరువు, జక్కుల రేకు, నర్థచంద్రిక, చందమామపదము, లేలాపదము, వెన్నెలపద ములు, తుమ్మెదపదములు, పర్వతపదము, లానందపదములు, శంకరపద ములు, నివాళిపదములు, వాలేశుపదములు, ధవళములు చర్చరిగీతులు, మొదలైన దేశిసంగీతములు నగరమెల్లమార్మ్రోగెను. వల్లకి, వంశము, ఢక్క, ఝర్ఝరి, చక్కి, ఝల్లరి, కాహళము, హుడుక్క, వీరమద్దెల, మద్దెల మొదలైన వాద్యములు నిరంతరమై మ్రోసెను. బొమ్మ లాటలు, వీధినాటకములు, దొమ్మరియాటలు, యక్షగానములు ప్రదర్శి తములయ్యెను. వడ్లగింజతోం బలుతోముటలు నాలుకతో నల్లపూస పేరుగ్రుచ్చుటలు, వెనుకకు మ్రొగ్గవ్రాలి తొట్టినీళ్ళలో మునింగి లోపలి ముంగరను ముక్కున గ్రుచ్చుకొనుటలు మొదలైన విచిత్ర విద్యలు ప్రదర్శితములయ్యెను. మల్లయుద్ధములు, కత్తిసాములు, గుఱ్ఱపుస్వారులు, నెడ్లపందెములు, పొట్టేళ్ళపందెములు, కోడిపందెములు సలుపఁబడెను.

వసంతోత్సవములు తొమ్మిదినాళ్ళును రాజ్యము నందలి నలు మూలలనుండి యుత్సవ దిదృక్షువులై వచ్చిన చాతుర్వర్ణ్యజనము

లకు పీథులుగట్టి వి_స్తళ్ళు వేసి భోజనములు పెట్టిరి. ఆ పెట్టిన నైఖరి యన్నపూర్ణా విశాలక్షి తానుగాఁ గొండవీటి రాజవీథుల విహారమేగి నట్లున్నది. ఏగు(బాల కలమాన్నములుఁ, తెలిరాజనంపుటోగిరములు, సన్నజాజి పూలుగుట్టలు పోసినట్లు తళతళ లాడెను. రామశామోద ములు, కుస్తుంబరీ వాసనలు కమ్మకసింద తావులు, నేలకుల సౌరభ ములు, నాసాగోళముల కెగఁ(బాకెను. మహిసాక్షి, గుగ్గులు కాలా గురు ధూపధూమములు, భోజనాగార గవాక్షమార్గములఁ దెలిమబ్బు దొంతరలై వెడలెను. పెసరపులగములు, పులివరుగులు, నప్పడములు, వడియములు, నానఁబాలు, నడుకులు, నిడియును, జలిమిడియును, (దబ్బడయు, వడయు, నుక్కెరలు, చాపట్లు, చిఱుగడములు, బడిద ములు, తియ్యగూరలు, పచ్చడులు, బజ్జులు, గిచ్చళ్ళు, గిజ్జులు, గడియ ములు, కాయములు, తేనెతోలలు,బిట్టు,గట్టు, తోపలు, బూపలు మొద లైన వ్యంజనంబులును, లడ్డువములు, నిడ్డెనలు, కుడుములుఁ, నప్పములు, నిప్పట్లు, జిల్లేడుకాయలు, దోసియలు, సేవియలు, నంగరపూవియలు, సారిపత్తెలు, జొత్తరలు, చక్కిలములు, మణుగుఁబూవులు, మోరుం డలు, నరిసెలు, బూరెలు, మోదకములు, నపూపములు మొదలగు పిండివంటలును; పుం(డేక్షుఖండములు, పిండఖర్జూరములు, (దాక్షా; నారికేళ, కదళీ, పనస, చూత, లికుచ, కర్కంధూ, ఫలములును, పాడబములు, పానకములు, తిమ్మనములు, దధిపిండ ఖండములు, మీఁగడలు, మజ్జిగలు, నంబకళములు, రసావళులు మొదలైన (దవ పదార్థములును జిహ్వోపరితర్పణమై వినియోగపడెను. కస్తూరి, కర్పూర తాంబూలములు, చర్వితమైన పరిమళములు నాసాగోళముల సోడు ముట్టెను.

ఇట్లు వసంతోత్సవములు తొమ్మిదినాళ్ళు తొమ్మిదినిమిసముల వలెఁ గడచిపోయెను. ఈతొమ్మిదినాళ్ళను సామంతులు, మిత్రులు

నగు రాజులుపంపిన కానుకలందికొనుటలోఁ దురగా రామయ్యకు క్షణమైనఁ దీఱిక లేకపోయెను. ఉత్సవముల కశ్వపతియు రాచకొండ దేవరకొండ వెలమదొరలును గానుకలుపంపిరి. అన్న దేవచోడుఁడు దాను రాఁజాలని కతన బావమఱఁది పిన్నుండి రాజును బంపెను.

పదియవనాఁటి యుదయమునఁ గోమటి వేముఁడు గృహరాజు మేడలోఁ గొలువుదీర్చి శిల్పులను బిలిపించి వారికి గృహరాజు మేడను బూర్తి సేయవలయునని యాజ్ఞాపించెను.

సరిగా మట్టమధ్యాహ్నవేళ పదునైదు గడియలకు మహూర్తము నిర్ణీతమయ్యెను. ఆముహూర్తవేళకు ముల్లగూరి శక్తియాలయమునొద్దకు నూరేగింపు చేర వలయును. ముల్లగూరమ్మకు నరణ్యము నుండి పట్టితెచ్చిన మహిషమును బలియీయవలయును. ఆబలియిచ్చిన వార్తయందఁగనే గృహరాజుమేడపై యంతరువు నిర్మాణము ప్రారంభమగును. మఱి నాల్గుగడియల యనంతరము రాచవేమునకుఁ బట్టాభిషేకము జరుగవలయును.

నాల్గుగడియల ప్రొద్దెక్కెను. రాచనగరునుండి పెద్దయూరేగింపు పోతరాజు గుడివంకకు బయలుదేరెను. ఊరేగింపునందు దాకసము నంటు రెండుప్రభలు. ముందరి ప్రభపై ముల్లగూరమ్మ శక్తి చిత్తరువు లిఖింపఁబడియుండెను. వెనుకప్రభపైఁ బోతరాజు చిత్తరువు. ప్రభలకుముందు నందికంత పోతరాజుకటారి బుజముపైఁ బెట్టుకొని యాజానుబాహువగు నొక మనుష్యుఁడు నడచుచుండెను. అతని కిరుప్రక్కల నల్గురుమనుష్యులు నడుచుచు నిరంతరము నారికేళములుగొట్టి యాయుదకమును బోతరాజు కటారిపైఁ బోయుచు గుగ్గిలముపొగ వేయుచుండిరి. వారికిముందు మాచారెడ్డి రాచవేముఁడు సోమదేవుఁడు పిన్నుండి రాజు మొదలైనవారు నడచుచుండిరి. వారి ముందు

మాష్ట్రీఁద్ర కఱ్ఱసాములు కత్తిసాములు. వారు చేయు వరుసలకు ననుగుణముగఁ దప్పెటలు మ్రోగుచుండెను. వారికి ముందు వీరభద్ర పళ్ళెరము. వీరభటులు పాశురములు చదువుచు నారసములు దవుడలందు గళములందు హృదయములందుఁ జేతులందు వేసికొనుచు శరభ శరభయని కేకలిడుచు గుగ్గిలము సాంబ్రాణి ధూపములు వైచికొనుచు నడచుచుండిరి. జర్ఝరులు రుంజలు, వీరమద్దెలలు, వారి పాశురముల కనువుగా వీరంగములు వేయుచుండిరి. వారాంగనలు వారి చుట్టు నిలువఁబడి విభూతి చల్లుచుండిరి. వారిముందు నట్టువరాండ్రాడుచుఁ బాడుచుఁ ద్రోవచూపుచుండిరి. వారిముందు మంగళ వాద్యములు, భూనభోంతరాళములు పట్టక మ్రోగుచుండెను.

ఉత్సవము పోతరాజు గుడియొద్దకుఁ జేరెను. పోతరాజు గుడి ముందుఁ బోతరాజు ప్రభనునిల్పి పూజలుచేసి నారికేళములుకొట్టి ధూపములు వేసి వీరంగములు వాయించి మేకలను గొఱ్ఱెలను దున్నలను బలులొసంగిరి. అచ్చట నర్చనాదిక మంతయు నదియొక పెద్ద తంతుగా జరిగెను. పంబలవాండ్రు వారిపంబలజోళ్ళు మ్రోగించుచుఁ బోతరాజునకు బలిహారమును నివేదన గావించి యతని పరాక్రమమును పెద్ద కథగాఁ జెప్పి ప్రసాదమును బంచియిచ్చిరి.

తఱువాత ముల్లగూరమ్మప్రభతో నూరేగింపు బయలుదేరెను. క్రమముగా నూరేగింపు ముల్లగూరమ్మ గుడియొద్దకుఁ జేరెను. అచటఁ బూర్వ మట్లే పూజాదికము గావించిరి. పోతరాజుగుడికంటె నిచట విశేషముగా బలులొసంగిరి. ఆబలు లన్నింటిలోఁ బ్రధానమైనది యడవిదున్నపోతు బలి. ఆ యడవిదున్నపోతును నొక పెద్దవలలోఁ బట్టి తీసికొనివచ్చిరి. అది నాల్గుగజముల బారుండెను. నాల్గడుగుల యెత్తుండెను. దానిశరీరము జేనెడెత్తుకండ పట్టియుండవచ్చును. దాని

మెడ మిక్కిలిబలిసి వాటునకమరకుండ నుండెను. దానికఁడ్లు చింత నిప్పులవలె మెఱయుచుండెను. దానికొమ్ములు వెన్ను నంటఁ బొడవుగాఁ దోఁకవఱకుఁ బెరిగియుండెను. దాని నెట్లో నాల్గుకాళ్ళకు రెండుకొమ్ములకు మెడకు గొలుసులుకట్టి యాగొలుసుల నష్టదిక్కులఁ బాతిన స్తఁబములకు బిగించికట్టి వలను దొలఁగించిరి. తఱువాత దాని ముఖమున వెన్నుపైనఁ బసుపుకుంకుమంపుఁ బొడిచల్లిరి. దానిమెడలోఁ బూదండలు వైచిరి. దానికి నువ్వుఁపిండి తృణకబళములు మేత పెట్టిరి. కానియది యామేతను ముట్టలేదు. తఱువాతదాని యొద్దకు వీరభటులువచ్చి పాశురములు చదివి రంగములు వైచిరి. పంబలవాండ్రరుగుదెంచి జోళ్ళుమ్రోగించి పొగవేసి బలికాజ్ఞయిచ్చిరి. దానిమెడ యొకేయొక దెబ్బతోఁ దెగిపోవలయును. ఆయొక్క దెబ్బతోఁ దాని మెడ తెగిపోకున్నదా! అదియేదో పెద్దయాపదయొకటి సంభవించును. దాని నొకదెబ్బతో నఱుకు వారెవరున్నారు! పూర్వము తలవరిపెద్ద యొకఁ డుండెడివాఁడు. ప్రత్యేకము వాఁడీదున్నపోతు బలి వేళకుఁ గొండవీడు వచ్చెడివాఁడు. వాని యుద్యోగమెల్ల సంవత్సరమున కొక రోజున నాదున్నపోతును నఱుకుటయే. తక్కినకాలమంతయు నారోజున దానిని నఱుకుటకుఁ గావలసిన బాహుబలము సంపాదించుకొనుట తప్ప వానికింకొకపనిలేదు. కానివాఁ డిప్పుడు చచ్చిపోయెను. రివాజునుబట్టి వాని వృత్తి వానికుమారునకు సంక్రమించెను. వాఁడిప్పుడు తనయుద్యోగము నెఱవేర్చుకొనుటకుఁ గొండవీడు వచ్చెను. వానిపేరు తిప్పఁడు. తిప్పని కిరువదిరెం డిరువదిమూఁడేండ్ల వయసుండవచ్చును. వాఁడు మనిసి యంత పొడగరికాఁడు. కాని బాగుగా బలిసి యుండెను. వానిభుజములపై తొమ్మపై జేనెడెత్తు కండపట్టి వాని యాకారమంతయు నాదున్నపోతునకుఁ దమ్ముఁడుగా నుండెను.

పూజయంతయుఁ బూర్తియై తిప్పని వంతువచ్చెను. వాఁడు కఱకుఁగత్తి చేతఁబట్టి దున్నపోతునొద్దకు వచ్చెను. మాచారెడ్డి కెందుకో కాని వానియందు విశ్వాసము కుదరలేదు. వీఁడెంత! పిట్టమనిసి. పైగా వీనికిదే మొదటిసారి. అనుభవములేదు. వీనిచేతిలో దున్నపోతు మెడ తెగునట్లు లేదని యనుకొనెను. తిప్పఁడు కత్తి పైకెత్తెను. వీర మద్దెలలు తప్పెటలు వీరంగములు రుంజలు నొకేసారి పెళపెళ మ్రోగు చుండెను. తిప్పఁడు రెండుమూఁడు సారులు కత్తియెత్తి వాటము చూచుకొని యొక్క యుదుటున నాకసములోనికిఁ బైకెగిరెను. మాచారెడ్డి కింతకాల మనుమానముగానే యుండెను. వాఁడు పైకెగి రిన వైఖరిచూచి యతనిగుండె గుభిల్లుమనెను. వీఁ డెట్లును నఱుకలేఁ డని యతఁడు నిశ్చయించుకొని యాగుమాగుమని కేకవైచెను. కాని యావాద్యముల మ్రోతలలో మాచారెడ్డి కేక ప్రక్కవానికే విని పించలేదు. జనులందఱిదృష్టులు తిప్పని చేతమీఁద నుండెను. ఎగిరిన తిప్పని కాకసములో నేమిసంభవించినదో కాని యతనిచేయి గురితప్పి మనిసి మనిసియంతయు దున్నపోతుపైఁ గుదియఁబడిపోయెను. ఇది యంతయుఁ గనుమూసి కనుతెఱచునంతలో జరిగిపోయెను. వాఁ డెగిరిన పద్ధతిని బట్టి యచ్చట నున్నవారిలోఁ గారులు గడచినవారు గనిపెట్టిరి గాని వారు వారించుటకు వీలుగాకపోయినది. దున్న పోతు బెదరి పైనఁబడ్డ తిప్పని గొమ్ముతో డొక్కలోఁ గ్రుమ్మి విద లించివైచెను. వాఁడా దెబ్బతోఁ బ్రాణము లెల్లవోయి పడిపోయెను. అందఱునొక్క పెట్టఁగలవరముచెంది యయ్యో! యయ్యో! యని కేకలువైచిరి. దునపోతుబెదరి పరవళ్ళు ద్రొక్కుట, మొదలుపెట్టెను. జనమంతయు బెదరి యుయ్యాలయూపులవలెఁ ద్రోసికొనివచ్చి ఒక గడియకాలము గడచుసరికి నారెకులాదున్నపోతును గదలకుండ మఱిల స్తంభములకు గొలుసులు బిగించిరి. కాని యది బుసలు గొట్టుచు నఱచు

చుండెను. ఈలోపల మాచారెడ్డి జనమునంతయు నడువులోనికిఁ దేగ్గెను. అప్పటికిఁ బదునాలుగడియలఁ బ్రొద్దెక్కెను. ముహూర్తము దాఁటి యప్పుడే గడియ యయ్యెను, ఇంకొక యరగడియ మంచినదా పుష్కరకాలమెట్లును దప్పినది లగ్నముగూడఁ దప్పును మాచారెడ్డి మిక్కిలి త్వొందరపడెను. అతఁడా జనములో నలుదిక్కులఁ గలయఁజూచెను. అతనికంటికొక మనిసి గన్పించెను. మాచారెడ్డి వానిని దగ్గరకుఁ బిలిచి నీకొకగడియ ముందైనఁ గాన్పించితివిగాదేమిరా! యీప్రమాదము జరుగకుండ నుండెడిది. సరే! అయిన దేదోఅయినది. ఇప్పుడునీచేతి మీఁదుఁగా గానిమ్మనెను. ఆమనిసి యొకముదుసలివాఁడు. వానికి డెబ్బదియేండ్లుండును. వానిశరీరము ముడుతలువడియుండెను. వానిపేరు వీరన్న. వీరన్న "దొరా! నేనిప్పుడేవచ్చితిని. మాయన్న కొడుకు బయలుదేరెనని నాకుఁదెలియనే తెలియదు. వాఁడేదోకుఱ్ఱవాఁడు. ఉలాటముతో వచ్చినాఁడు. పొరపాటు జరిగినది. ఈతప్పు కాయుఁడీ" యని చెప్పుచుఁ దిప్పని చేతిలోని కత్తితీసికొని దున్నపోతువద్దకు వచ్చెను. దున్నపోతు వానినిజూచి బుసకొట్టి గాండ్రించెను. వాఁడు దానిమెడనరమును బట్టికొని నొక్కి యట్టహాసముగా సింహనాదమొనర్చెను. వానికేకకు దున్నపోతు పిల్లియైపోయెను. వాఁడు వాటము చూచుకొని యాకసములోనికి నెగిరి కత్తితో దున్నపోతు మెడపైఁ బడెను. దున్నపోతు మెడతెగి యావలపడి రక్తము తూములోనుండి నీరువచ్చునట్లు ప్రవాహములయ్యెను. ప్రక్కనున్న తలవరులారక్తమును బిందెలలోనికిఁ బట్టిరి. తఱువాతఁ బంబలవాండ్రు జోళ్ళు మ్రోగించుచుఁ దంతునడపిరి.

ఉత్సవము వీరకల్లు క్షేత్రమునకునడచెను. అది ముల్లగూరమ్మ గుడికి నెదురుగాఁ గూతవేటుమారమున నొక పెద్ద బయలులోగలదు.

అచట ననేక శిలాప్రతిమలుగలవు. అవియన్నియు వీరుల ప్రతిమలు. వానిని వీరకల్లులందురు. వారంద అప్పటప్పట నేదియో కోరికలతోఁ దమతమ ప్రాణములను బలిపెట్టుకొన్న మహావీరులు. ఉత్సవమంతయు నాప్రదేశమునకుఁ జేరెను. అచట నిప్పులగుండములు, గనపపాతరలు సిద్ధమొనర్పఁబడియుండెను. వీరంగములు మ్రోఁగుచుండఁ శాసరము లను జదివికొనుచు వీరులా నిప్పులగుండములను ద్రొక్కిరి. కరవాడి యలుగులతో, నిండిన గనపపాతరలలోఁ బైనఁ గట్టిన యుట్టెలలోఁ గూర్చుండి చేరులు కోసికొని దోకిరి. కొందఱు నిలువు స్తంభములు పాతించి వానిపైన గాలపుఁగొంకెలకుఁ జర్మముగ్రుచ్చుకొని వ్రేలాడిరి. కొందఱు శరీరమంతట నారసములు గ్రుమ్మికొనిరి. కొందఱు చేతులలోఁ గపురారతులు వెలిగించి పాశురములు చదివిరి. ఇట్లు వీరకల్లులయొద్దఁ బూజముగించి యుత్సవము గృహరాజుమేడవంక బయలుదేరెను.

దున్నపోతును బలియిచ్చినవెంటనే గృహరాజుమేడయొద్దకు మాచారెడ్డి యీసంగతి కబురువెట్టెను. అచటఁ బూజలన్నియుఁ బరి సమాప్తి కావించి కోమటి వేమారెడ్డియు మహామంత్రియు ముల్ల గూరమ్మ గుడినుండి కబురుకై నిరీక్షించుచుండిరి. ముహూర్తము తప్పి పోవుచున్నది. కాని యచటనుండి కబురురాలేదు. అచట బలిపూర్తి కాక గృహరాజుమేడ కట్టరాదు. కోమటి వేమారెడ్డి విసివికొనుచుం డెను. ముహూర్తముదాఁటిన గడియకుఁ గబురువచ్చెను. పోనీ లగ్నము దాఁటలేదు. కొంతనయమే యనుకొని వేమారెడ్డి శిల్పులకు ననుమతి యొసంగెను. తఱువాత నతఁడా వార్తాహరుని నాలస్యమునకుఁ గారణ మేమని యడిగెను. వాఁడుజరిగిన సంగతంతయుఁ జెప్పెను. వేమా రెడ్డి వికలమనస్కుఁడై మహామంత్రితోఁగూడ నచటనుండి రాచమంది రమువంక బయలు దేరెను.

అప్పటికిఁ బదునెనిమిది గడియల ప్రొద్దుపోయెను. ఈగందర గోళమునుండి తెప్పిరిల్లియందఱును సభాభవనమును జేరుసరికి మఱి రెండు గడియలుపట్టెను. సభాభవనమున సామంతులు పాలెగాండ్రు దండ నాథులు దళవాయులు, అమాత్యులు మొదలైనవారందఱు కనిపెట్టు కొని కూర్చుండిరి. రాచవేముఁడు నతనిభార్య మంగళస్నానము కావించి క్షౌమవసనములు దాల్చి మంగళవాద్యములు మ్రోఁగుచుండఁగా మహారాజవైభవముతో సభాభవనమునుజొచ్చిరి. రాజును రాణియు మహామంత్రియు వారికెదురునడిచి తీసికొనివచ్చి సింహాసనముపైఁ గూర్చుండఁజేసిరి. తఱువాతఁ బవిత్రనదీజలములతో వేముఁడు వారి కభిషేకము గావించెను. తనతలపైనున్న కిరీటమునుదీసి రాచవేముని తలపైఁబెట్టెను. అచటఁ జేరియున్న ప్రజలందఱును హర్షధ్వానము లొనరించిరి.

తఱువాత వేముఁడుకుమారును ద్దేశించియిట్లు చెప్పెను. "నాయనా! యీ రెడ్డిరాజ్యముబరువంతయు నాభుజములనుండితీసి నీభుజములపైఁ బెట్టితిని. ఈరాజ్యమును స్థాపించినది ప్రోలయకుటుంబము. ప్రోలయ సంతానములో మాచారెడ్డిపెద్దవాఁడు మనము మాచారెడ్డికోవలోని వారము. ఈరాజ్యనిర్వహణభారము మనయందు ధర్మబద్ధమైనిహితత మైనది. ఇదిగో! నేనీరాజ్యమును ముప్పదియేండ్లు ధర్మమార్గమునఁ బరిపాలించితిని. హైందవమత రక్షణముకొఱకు మాపూర్వులవలె నేనును బాటుపడితిని. మాపూర్వులిచ్చిన గోదేవబ్రాహ్మణవృత్తులను మన్నించితిని. ప్రజలనందఱను గన్నబిడ్డలవలెఁజూచుట రాజధర్మము. ధర్మరక్షణముకొఱకు రాజ్యముగాని స్వసుఖముకొఱకు రాజ్యముగాదు. కటకముపఱకు రాజ్యమును నిస్సపత్నముగావించి నీభుజములపైఁ బెట్టి తిని. దీనిని ధర్మమార్గమునఁ బాలించుకొమ్మ" నిచెప్పెను.

తరువాత బ్రాహ్మణాశీర్వచనములు జరిగెను. అనంతరము కవి పండితగోష్ఠి జరిగెను. వామనభట్టులేచి కోమటివేమునిపైఁ దానురచించిన వీరనారాయణ చరితమను గద్యకావ్యమును జదివెను. తరువాత నతఁడు

"చూడమణిర్న్నృపాణాం దుర్మ్మదపరిపంథి శిఖరి దంభోళిః
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటి వేమ భూపతిర్జయతి"

అని చదివి కూర్చుండెను.

తఱువాతఁ గాదంబరీనాటకకర్త నరసింహాకవిలేచి

"జ్ఞాతాయది నహిదాతా దాతా చేత్కోఽపినహిభువిజ్ఞాతా
జ్ఞాతాదాతాచాభూః పెదకోమటి వేమభూపతే! చిత్రమ్"

"అర్థిజనచింతి తార్థాదధికంచేత స్తతోఽపి తేవాణీ
తస్యా అపిదశతికరః పెదకోమటి వేమభూపతే! చిత్రమ్॥

అని చదివెను. నరసింహాకవిరచనా చమత్కారమునకుఁ బడింతు లందఱు తలలూపిరి. వామనభట్టు, శ్రీనాథుఁడు నాతనిని మిక్కిలి మెచ్చుకొనిరి. తఱువాతనొక వృద్ధబ్రాహ్మణుఁడు ముందునకు వచ్చి కోమటివేము నాశీర్వదించి యిట్లు చెప్పెను. "మహారాజా! నేను మిక్కిలి వృద్ధు డను. నే నేఁబది యేండ్లు సర్వశాస్త్రములందును గృషి చేసితిని. సాహిత్యమన్న నాకుఁ బ్రీతియధికము. ధ్వనికారుని వాదమును మహిమభట్టుఖండించినాఁడుగదా! మహిమభట్టు ననుమితి వాదమును బహుకాల మాలోచించి నేను ఖండనయుక్తులను వ్రాసియుంచు కొంటిని. నాల్గుమాసముల క్రింద నీనరసింహాకవిగారు మీరు రచించిన సాహిత్యచింతామణిని గుఱించి చెప్పినారు. సాహిత్యచింతామణియందు

ధ్వని సిద్ధాంతమును మీరు సమర్థించిన పద్ధతి మహిమభట్టు వాదముపై మీఖండనయుక్తులు నాయన సాకల్యముగఁజెప్పెను. అదివిని నాకు మిక్కిలి యాశ్చర్యముగల్గినది. నేనువ్రాసి పెట్టుకొనిన యుక్తులన్నియుసరిగానవియే. మీప్రతిభాపాండిత్యములను గుఱించి నాకబ్బురమైనది. మిమ్మును జూచిపోవుటకనివచ్చితిని. తమరు హాలుని సప్తశతికి వ్యాఖ్యానము చేసినారంట. వినవలయునని యున్నదని చెప్పెను. వేమభూపాలుఁడు లేచి యావృద్ధబ్రాహ్మణుని మిక్కిలి సంభావించి స్వయముగాఁ దీసికొనివచ్చి సింహాసనము ప్రక్కనున్నత పీఠముపైఁ గూర్చుండఁబెట్టెను. తరువాత నాతఁడు తాను రచించిన సప్తశతి వ్యాఖ్యానము నుండి, వీరనారాయణభాణమునుండి, సాహిత్యచింతామణినుండి కొన్ని భాగములు విన్పించెను. సభలోని పండితులందఱును వేమునివైదుష్యమునకు ముగ్ధులై పోయిరి. అతఁడు మాటాడినంత సేపును నమృతపువాన గురిసినట్లుండెను. సరస్వతి వీణవాయించినట్లుండెను. ఆవృద్ధబ్రాహ్మణుఁ డానందమును బట్టఁజాలక లేచియిట్లు చదివెను.

"వాణీనఖముఖముఖరిత వీణామాధుర్యధుర్యవాగ్వల్లిః  
ధన్యధన్యధన్యః పెదకోమటివేమ భూపతిర్జయతి"

తరువాత శ్రీనాథకవిలేచి సంస్కృతమునందును దెనుఁగునందును గోమటివేమునిపైఁ బ్రవాహికవేగముతోఁ బద్యములు చెప్పెను. చివరికతఁడీ క్రింది సీసపద్యమును జదివెను.

కపటకంఠీరవాకార నారాయణ  
క్ష్వేళా నినాదంబు గేలిసేయ  
కల్పాంతదుర్దాంత కాలభైరవభేరి  
డమరుకోన్మాదంబడంగఁజేయుః

ప్రళయకాలాభీల పటుఘోరనిర్ఘాత
పటుపటారావంబుఁ జటులువఱచుఁ
గుహనామహాకాల కోలాహలోత్తాల
పాతాళనినదంబు భంగపఱచు

గండుమెఱసిన రిపుకోటిగుండె లవియఁ
జండగతిఁ బ్రమోయు నీ రణోద్దండ భేరి
జయరమాసంగ రాయవేశ్యాభుజంగ
యతులబలధామ పెదకోమటన్న వేమ"

కోమటివేముఁడు లేచి శ్రీనాథుని గౌఁగిలించుకొని మిక్కిలి సంభావించెను. వామనభట్టు లేచి శ్రీనాథుని పాండిత్య ప్రకర్షము నభినందించుచు విద్యానగరాస్థానమున నాతని విజయప్రశస్తిని సభ్యుల కెఱింగించియచ్చటఁ బ్రౌఢదేవరాయల వలనఁ గనకాభిషేకము, కవిసార్వభౌమబిరుదము పొంది శ్రీనాథ మహాకవి వేమభూపాలు నాస్థానగౌరవమును దిగంతముల వెల్లడి యొనర్చెనని ప్రశంసించెను.

కోమటివేముఁడు సభకువచ్చిన పండితుల నందఱ ననేక సువర్ణ రత్న మౌక్తిక క్షౌమవసన కర్పూర చందన కస్తూరికా తాంబూల దానాది సత్కారము లొనర్చి మిగుల సంభావించెను. కోమటివేముని చేతికెముక లేదు. ఆనాఁడు నిజముగా నెంతధనము దాన మొనర్పఁబడెనో లెక్కలేదు. సభయైపోయి కోమటివేముఁడింటికిఁ బోవుచుండెను. అతఁడు రాజమందిరము గవను మెట్లెక్కుచుండఁగా నొక ప్రతీహారి వెనుకనుండి పరువెత్తికొనివచ్చి "అయ్యా! అయ్యా! టంకసాలకడఁ జేరియున్న పండితులలో నొకాయన మీకిది యిమ్మనె"నని యొక తాటియాకిచ్చెను. దానిని గోమటివేముఁడు చదువుకొనెను.

"కోమటివేముని దానము
భూమి ప్రసిద్ధంబు, కల్పభూజము చెంతన్
బాముున్న పగిది తురగా
రాముండున్నాఁడు చేరరా దెవ్వరిన్"

ఆపద్యమును జదివికొని వేముఁడు భటునివంకఁ జూచి "యేమిరా! అచటఁ దురగా రామయ్యగా రున్నారా?" యనెను. భటుఁడు "చిత్తము! ఆయన పండితులపైఁ గోపము చేయుచున్నాఁడు. నామన భట్టుగారు శ్రీనాథయ్యగారు చెప్పినను నాయన వినుటలే" దని చెప్పెను. వేముఁడు వెనుదిరిగి టంకసాల యొద్దకుఁ బోయెను. అచ్చటఁ దురగా రామయ్య వేమునిజూచి చకితుఁ డయ్యెను. వేముఁడు "రామయ్య గారూ! కుంచము తెప్పించండి. ఇట్లుకా" దని చెప్పెను. రామయ్య చేయునదిలేక కుంచము తెప్పించెను. వేముఁడు కోశాగారమును దెఱ పించి సువర్ణములు పండితులకుఁ గొలిపించెను. రామయ్య చేయునది లేక కొలిచెను. అతని మొగమున నెత్తురుచుక్క లేదు. పండితులందఱు మోయలేక మోయలేక సువర్ణమును మోసికొనిపోయిరి.

## ౧౧

కోమటివేముని హృదయము తేలికపడెను. ఇన్నాళ్ళనుండి యతని తలపైనున్న మహాభారమంతయు నేఁటితోఁదొలఁగి పోయి నట్లయ్యెను. అతఁడు మిగుల నుత్సాహముతో సాయంకాల శివపూ జాదికము ముగించుకొని భోజనముచేసి మేడపై నొంటిరిగా వెన్నెలలోఁ దిరుగుచు నాలోచించుకొనుచుండెను. తాను దన కర్తవ్యమును జక్కగా నెరవేర్చినట్లే. కొలదికాలము క్రిందట నంతయు మోసికొని వచ్చినట్లే రాజకీయములు మిక్కిలి తన్ను గలవరపెట్టినవి. కాని యవి యన్నియు గజరావు తిప్పనాయని యొక్కయు నన్న దేవచోడుని

యొక్కయుఁ బరాక్రమమువల్లఁ మామిడి సింగన్నగారి రాజనీతి శాస్త్ర లమువల్ల, శ్రీనాథయ్యగారి పాండిత్యబలమువల్ల నెక్కడికక్కడ విచ్ఛి పోయినవి. ఇప్పుడు తన పనియంతయుఁ జిక్కు తీసినట్లున్నది. సామి దేవ చోడుఁడు శత్రువులనుండి విడిపింపఁబడెను. రాచవేమునికిఁ బట్టాభి షేకము జరిగెను. గృహరాజుమేడ పూర్తియగుచున్నది. ఇంకఁ దనకు గావలసిన దేమున్నది? ఆమేడ పూర్తియై దానిపైని కందికంత పోత రాజు కటారి స్థాపితమైనచోఁ గొండవీట లక్ష్మీదేవి స్థిరనివాస మేర్ప ఱచుకొనును. అబ్బ! అనవేమారెడ్డికన్న కల నేఁటికి ఫలించినది. ఆమేడ కట్టవలెనని యేముహూర్తమున నాయన సంకల్పించెనో కాని 'యబ్బబ్బ! ఇంతవఱకు దాని కెన్నియడ్డంకులు! ఎన్నియడ్డంకులు! ఇప్పటి కన్నియుఁ దొలగిపోయినవి. ఇంక మేడ పూర్తియైనట్లే యెంచు కొనవచ్చును. అన్నట్లా పెద్దియజ్వగారు గూడ నట్లే చెప్పిరిగదా! ఆయన వేమన్నగారికిఁ గూడ నీమేడ యింతకాలమునకు గాని పూర్తి కాదని యాయన చెప్పెనట. పైగా నిముహూర్త మాయన పెట్టిన దాయె. కాకపోయిన నొకగడియ యాలస్యమైనది. పుష్కరకాలము దప్పినను లగ్నము తప్పలేదు. గదా!"

ఆతలపు వచ్చినతోడనే వేముని మనస్సు చివుక్కు మనెను. అతఁడు "ఔనౌను. పొరపాటు జరిగిపోయినది. ఇప్పుడనుకొనిన నేమి లాభము! ఆతిప్పన్న కుఱ్ఱవాఁడు. వానికి ననుభవములేదు. నేనక్కడ నున్నచో వానిని గత్తి పట్టనిచ్చెడివాఁడను కాదు. దీనివల్ల నేమి కీడు మూడునో? ఏమికీడు మూడుటకును దున్నపోతు మెడమీఁద రెండు కత్తిదెబ్బలు పడలేదు గదా! ఇంకను నయము. ఆవీరన్న యున్నాఁడు కాబట్టి సరిపోయినది. వాఁడొక్కదెబ్బతోనే దానిమెడ తెగఁగొట్టెను గనుక సరిపోయినది. కాకపోయిన గడియ యాలస్యమైనది. దాని

వల్లనైనను బెద్ద దోషములేదు. అయినను మనకిప్పుడే యుపాయము సంభవింపఁగలదు ? చౌండ సామాత్త్యుఁ డారు నెలలవఱకు లేవనేలేఁడు గదా! ఒకవేళ విజయనగరరాజు లెత్తివత్తు రనుకొన్నను వారిపై కి భామినీ సుల్తానును సింగన్నగారు పురికొల్పి వచ్చెను గదా ! ఆభామినీ సుల్తాను రాచకొండ దేవరకొండల వెలమదొరలు మొన్న వసంతోత్సవముల కుపాయనములుగూడఁ బంపిరి. వారి స్నేహము మనకుఁ బెట్టని కోటయై విజయనగరరాజుల యొత్తిడినుండి మనలను రక్షించగలదు. ఇంకమిగిలిన శత్రు వల్లాడరెడ్డి. అతఁడు మాత్రమేమి చేయును? కాకపోయిన దీవిసీమయందుఁ గొందఱి సామంతులను గూడఁగట్టుకొని రాజమహేంద్రవరరాజ్యమున విద్రోహములు లేవదీయునేమో; వాని నీపాటికి నన్న దేవుఁడు మెత్తగాఁ జితుకఁగొట్టియే యుండును. మఱి యదిగాక మనచేతిలో గాటయవేముని కొమరుఁడు కొమరగిరి యున్నాఁడు గదా ! వానిని జేతిలోఁ బెట్టికొని యల్లాడరెడ్డి నాడింప వచ్చును. వారిచేతినుండి సోమదేవు నెట్లును విడిపించు కొంటిమాయె. ఆపిల్ల పెండ్లికూడఁ జేసితినా యింక నేను జేయవలసిన దేమి మిగులును ? అదికూడఁ గొలదికాలములోఁబూర్తిచేయవలయును. ఆయన్న దేవుఁడు వసంతోత్సవములకు వత్తునని వచ్చినాఁడు కాదు. పిన్నుండి రాజును బంపినాఁడు. అదికూడఁ బూర్తిచేసితినా రాజమహేంద్రవరరాజ్యము మనకుఁ బూర్తిగ స్వాధీన మైనట్లే. పెండ్లిసంబంధము రాజ్యమున కెంతైన బలమునిచ్చును. కాటయవేమునికి విద్యానగరరాజులతో నట్టి సంబంధముండియేకదా యతఁడు నన్నింత నేడిపించెను. తెలివియన్నఁ గాటయవేముని తెలివియే తెలివి. ఇటు కొమరగిరి యప్పను జేసికొన్నాఁడు. అటు ప్రౌఢదేవరాయల సోదరిని వివాహ మాడినాఁడు. మఱలఁ దనకూతు ననితల్లిని నల్లాడరెడ్డి కుమారున కిచ్చి దువ్వూరిరెడ్ల నందఱను దనవైపు తిప్పుకొన్నాఁడు. వానిని రాజమహేంద్రవరము

నుండి వెల్లగించుటకుఁ దల ప్రాణము తోఁకకు వచ్చినది. వాఁడు చని పోయినను వాఁడు చేసికొన్న సంబంధముల బల మింకను మిగిలి నన్ను వేధించుచున్నది” అతనికి మనసులో లోపల నెక్కడనో కదలిక పుట్టెను. దూరమున నెక్కడో కహాకహా నవ్వినట్లయ్యెను. క్రమ ముగా నాకదలిక యానవ్వుఁ పెద్దవై యతని ముందుఁ గాటయవేముని తల ప్రత్యక్షమయ్యెను. అతఁడు దానిని లోని కదుముకొనుటకుఁ బ్రయ త్నించెను. కాని యది యెదురుతిరిగెను.

వేమారెడ్డి :— నీవు చాలా రోజులనుండి కన్పడుటలేదు. నేఁడు నేను సుఖముగా నూహించుకొనుచుండ వచ్చితివేమి ?

తల :— నీవు నన్నిన్నిరోజులనుండి తలఁచలేదు. నేను రాలేదు. పాప మెందుకో తలచుకొంటివి గదా యని వచ్చితిని.

వేమా :— నేను నిన్ను దలఁచినది నీకేమి తెలియును ?

తల :— చెప్పితినిగదా : నాకొక్క టేమి యన్నియును దెలి యును. నీలోపలనున్న యూహాలన్నియును దెలియును. నీనాళ్లు నరము లన్నియు లెక్కపెట్టి చెప్పఁగలనని.

వేమా :— అవునవును. నీకొక రూపములేదు. నీవు నామన సులో నున్న వాసనవు. నీవు నిజముగాఁ గాటయవేముని తలవు గావు. నీకు బ్రాణములేదు. నిన్నుదలచుకొన్నప్పుడు నీవు పైకి వచ్చి నామన సాక్రమింతువు. అప్పుడు నామాటలకు నీముఖమున నేనేజవాబు చెప్పి కొందును. ఆసంగతి తెలియనప్పుడు నీవు నన్ను బెదిరించుచుంటి వని భయపడితిని. ఇప్పుడు నా కా భయములేదు.

ఆమాటలకుఁ దల విరుగఁబడి నవ్వెను.

వేమా :— ఏల నవ్వెదవు ?

తల :— నన్నుజూచి భయము లేదనుచుంటివిగదా! అందులకు.

వేమా :— అనుటయేమి, నిజముగానే లేదు. నీవు పట్టినునోభావమవు. నీవూరక యిట్లుకన్పించుచుంటివిగాని యంతకంటె నేమియుఁగాదు.

తల మఱల విరుగఁబడినవ్వి "నీ వబద్ధమాడుచుంటివి నీవు నన్నుజూచి నిజముగా భయపడితివి. కాని యొకటి మాత్ర మొప్పికొందును నీవు భయపడినట్లు నీవెరుఁగ" వనెను.

వేమా :— నేను భయపడలేదు సరిగదా మిక్కిలి ధైర్యముగానున్నాను. అదికాక నేను భయపడినట్లు నాకుఁదెలియకుండు టేమి? నాకుఁ దెలియకుండ నే నెట్లు భయపడెదను.

తల :— అదియే చిత్రము. తెలియక పోవుటయే భయముయొక్క లక్షణము. నీవెట్లుభయపడితివో చెప్పెదను. నేను నీమనసులోని వాసన నంటివిగదా! ఆవాసన దేనినాశ్రయించియున్న దందువు? అది యిప్పుడు నీమనసు నాక్రమించుటకుఁ గారణ మేమందువు. నీమనసు నాక్రమించితినని యొప్పిగొంటివిగదా! ఆక్రమించితిగాన నేను బలము గలదానను. ఆక్రమింపఁబడినది గాన నీ మనసు బలహీనమైనది. ఒప్పి కొంటివా? ఆబలహీనతకు భయము కారణము దాని నాశ్రయించియే నేను నీమనసులో నుండఁగల్గితిని. ఓయీ! మొదటమొదట నా భయము నీకు భయముగానే తెలిసినది. తఱువాత నీవు దాని కలవాటు పడితివి. నీకది ధైర్యముగాఁ గాన్పించుచున్నది.

వేమా :— నీవు చెప్పునది విచిత్రముగా నున్నది. భయము ధైర్యముగాఁ గన్పించు నందు వేమి? రెండు నొకదానికొకటి విరుద్ధ గుణములు గదా?

తల :— పిచ్చివాం డ్లిట్లేయనుకొందురు. భయమునకు విరుద్ధమైన గుణమేదియునులేదు. అన్ని గుణములు భయముయొక్క విలసనములే. కోపము, దయ, ధైర్యము, ప్రేమ, ద్వేషము మొదలైన సర్వగుణ ముల కట్టయడుగున నున్నది భయము. ఆ భయమే యొకొక్కప్పుడు కోపము, నొకొకప్పుడు కరుణ, ధైర్యము నుత్సాహము మొదలైన రూపములనొందును. అది వట్టికామరూపి. నిజముగా నాభయమన్నది లేనిచో వానికే గుణము నుండదు. వాఁడు వట్టి నిర్గుణుఁడు. అదిగాక నీవు ధైర్యముధైర్యమనుచుంటివి. ధైర్యమన నేమోనీకుఁ దెలియునా? ధైర్యమనగా వివేకము. దీని స్వరూప మిదియని తెలిసికొనుట. నీవను కొనుచున్న ధైర్యము వేరు. అది వట్టి మొండితనము. నీవు నిజముగా ధైర్యవంతుఁడ వన్నచో వివేకి వన్నమాట. వివేకివైనచో భయము యొక్క స్వరూపమిది యని నీవు వివేచించి తెలిసికొనవలయును. అది నీవు చేయలేదుగదా! ధైర్యవంతుఁడ వెట్లగుదువు?

వేమా :— నీవు చెప్పినదంతయు నావివేచనయేకదా! నావివేక మంతయు నీముఖమునుండి నాకు నేనే చెప్పుకొనుచున్నాను. మఱి నన్ను వివేకివి కాదందువేమి?

తల :— నిన్నుజూచి నాకు నవ్వవలయునో యేడ్వవలయునో తెలియుటలేదు. నేను జెప్పినదంతయు నీ వివేక మనియే యొప్పుకొంటివి గదా! ఆమాట గట్టిగా నొప్పుకొనుము.

వేమా :— ఒప్పికొన్నచో?

తల :— ఒప్పికొన్న నీ వవివేకివని యొప్పికొన్నట్లే, ఎందుచేత ననగా నీవనుకొన్నధైర్యము ధైర్యముగాకుండ భయమని తేలిపోయినది. గావున.

వేమా :— నన్ను వివేకి వందువు. అవివేకి వందువు. ఒకదాని కొకటి విరుద్ధమైనప్పుడు రెండు నెట్లగుదును ?

తల :— రెండునైతివి కావుననే నిన్ను జూచి నవ్వవలయునో ఏడ్వవలయునో తెలియలేదంటిని. ఓయీ! ఒకటి చూడుము. నీవింత వివేకివా! నీవివేకమంతయు నెంతవఱకు? ఎచ్చటఁ బ్రసరించుచున్నది? ఆ మూలభూతమైన భయమునకు మొప్పము రాకుండు నంతవఱకే. ఆభయ మెక్కడకుఁబోవునో యనుభయముతో దానిని బెట్టెలోఁబెట్టి తాళము వేసికొని నీవివేకమును వెలుగఁబెట్టుకొందువు. కావున నీ వివేకము పని సేయుటకా భయమాధారము. అసలు నీబ్రతుకున కది యాధారము. దానికేమాత్రమైన మొప్పము తగిలినదా నీవివేకము దానిముందు గజగజలాడిపోవును. ఆభయము భయమంతయు నట్టె యట్టిపెట్టుకొని నీవు వివేకివై యూరేగుచున్నావు. ఏమివివేకమయ్యా! ఏమివివేకము!

తలపగులఁబడి నవ్వెను. ఆ నవ్వు వాయుమార్గముల గిలకొట్టెను. వేమున కానవ్వు విని యొడలు జలదరించెను. అతఁడు నిజముగా భయపడుచున్నా ననుకొనెను. అతని మనసంతయు దట్టముగాఁ జీకటి పూతవెట్టిన ట్లయ్యెను. ఆ చీకటిలోఁ గాటయవేముని తలలోని గ్రుడ్లు నిప్పుకణికల వలె మెఱయుచుండెను. దానిపండ్లు క్రకచముల వలెఁ దళతళ లాడుచుండెను. ఆ తల నోరు తెఱచి యావులించగా దాని నోటిలోనికి బయటిగాలి యంతయు మహావేగమునఁ బోయి నట్లుండెను. కోమటి వేమున కది తన్ను మ్రింగుచున్నదా? యనిపించెను. అతఁడు ధైర్యము చిక్కబట్టుకొని దానిని విదలించి పాఱవేయఁ జూచెను. కాని యదిపోలేదు. అతనికి దుఃఖము పొంగివచ్చెను. "నా మన సిందాకటివఱకు నుత్సాహముగా నున్నది. నాకు నీవు కని

గహనమువలె దాపురించితివి. ఆ యుత్సాహమంతయు నాశమొనరించితి" వనెను.

తల :— ఆ యుత్సాహమంతయు భయముయొక్క స్వరూపమే యని చెప్పితిని. నీకది యిప్పటికిఁ దెలిసివచ్చినది. మఱియొకటి చూడుము. నేను చెప్పినదంతయు నీ వివేకమేకదా! నీవివేకము నిజముగా వివేకమైనచో భయమును బోఁగొట్టుటకుమాఱు వృద్ధిఁబొందించినదేమి? కావున నీవివేకముగూడ భయముయొక్క స్వరూపమే. ఎందుచేతననగా? ఇది భయమునుండి పుట్టినది భయములోఁ బర్యవసించినది. కావున నున్న దొక్క భయము.

వేము :— అంతయు గందరగోళముగా నున్నది. మొదటినుండి చివరవఱకు నొక్క పేపూతవెట్టితివి. ఆ పూతలో నీకంప్లు నీపండ్లు మెఱయుచు దాని నింకను దట్టమొనర్చుచున్నది. అబ్బ! ఇంత చిక్కనిభయమెక్కడినుండి వచ్చినది?

తల :— ఆహార నిద్రాభయము లన్నిజంతువులకు సాధారణములు. ఆభయమున్నది యెక్కడనుండియోరాలేదు. అది స్వభావముగనే నీతోఁపాటు జన్మజన్మాంతరములనుండి వచ్చుచున్నది.

వేము :— అది యెట్లుపోవును?

తల :— ఏమో యెట్లుపోవునో నాకేమి తెలియును?. నీకుఁ దెలిసిన కదా నాకు దెలియుట. ఆపెద్దియజ్వ నడుగకపోతివా చెప్పెడివాఁడు. అయిన నీవెందుకడిగెదవులే సర్వజ్ఞచక్రవర్తివైతివి.

హజారమున గంట మ్రోగినధ్వనియయ్యెను. కోమటివేముఁడు వానిని లెక్కపెట్టెను. అప్పటికిఁ బదిగడియల ప్రొద్దుపోయెను. "ఇంతి

యేనా! నేనెంతయో ప్రొద్దుపోయిన దనుకొంటి” ననుకొనెను. అప్పు డొక పరిచారిక మేడిపైకివచ్చి “అయ్యా! మామిడిసింగన్నగారును శ్రీనాథయ్యగారును దర్శనమునకు వచ్చిరని విన్నవించెను.

కోమటివేముఁ డింతరాత్రివేళ వచ్చిరేమని యబ్బురపడుచు వారిని బ్రవేశపెట్టుమని చెప్పెను. మామిడిసింగన్నయు శ్రీనాథుఁడును జంద్రశాలలోనికి వచ్చిరి. వేముఁడు వారి నాహ్వానించి కూర్చుండఁ జేసెను. అతఁడు మామిడి సింగన్నగారివంకఁ బ్రశ్నార్థముగాఁ జూచెను.

మా.సిం :— మహాప్రభూ! శ్రీనాథయ్యగారు తమతోఁ గొంత ముచ్చటించవలసి యున్నదట. అందుచేత నింత రాత్రివేళ వచ్చితిని.

శ్రీ :— ప్రభువులతో నీపదిరోజులనుండి విన్నవించుటకు సమయము దొరకినదిగాదు. మహామంత్రి వారితో నేనప్పుడే మనవి చేసితిని.

కో.వే :— మీరు దేనిని గుఱించి చెప్పుచుండిరో నా కవగత మగుటలేదు.

శ్రీ :— కాటయ వేమారెడ్డిగారి కొమరుఁడు కొమరగిరిని గుఱించి.

కోమటివేముఁడు శ్రీనాథునివంక విచిత్రముగాఁ జూచి “యతఁడు మనబందీగదా యతనిని గుఱించి చెప్పవలసిన దేమి?” యనెను. శ్రీనాథుఁడు మహామంత్రివంకఁ జూచెను.

మా. సిం :— శ్రీనాథయ్యగారు సోమదేవచోడుని విడిపించుకొని వచ్చునప్పుడు ప్రౌఢదేవరాయల వారందుకు బదులుగాఁ గొమరగిరిని విడిపింపవలయునని కోరిరట.

కో. వే. :— శ్రీనాథయ్యగా రందుల కంగీకరించిరా ?

మా. సిం :— అంగీకరించక యేమిచేయుదురు ? ఆ పక్షము వారు మనయెడ నౌదార్యము చూపుచున్నప్పుడు వారియెడ మనముగూడ నట్లే ప్రవర్తింపవలయును గదా ! వారు మనమడిగినది కాదనలేనప్పుడు వారడిగినది మనమెట్లు కాదనగలము! ఆపరిస్థితి చాల సుకుమారమైనది.

కోమటివేముఁడు తలయూపుచు "నౌనౌను. కాని కొమరగిరిని వదలిపెట్టుట మనచేతిలో లేదుగదా! దాని కన్న దేవచోడు డాలోచింపవలయును. న్యాయమున కతఁ డన్న దేవచోడుని బంది. వానిని విడచుట కధికారము మనకు లేనేలే దనెను.

మా. సిం :— అన్న దేవచోడునితో మనమెట్లో సద్దిచెప్పుకో వచ్చును. సోమదేవచోడునిచేత నతనికిఁ జెప్పింతము. అతఁడొప్పికొనక యేమిచేయును ? మన మీపట్టున నౌదార్యము చూపకుండుట యప్రతిష్ఠా హేతువగుటయే కాక రాజనీతిగాదు. దానివల్ల వారందఱుఁ గూడగట్టుకొని మనపైకి సన్నద్ధ మగుదురు.

కోమటివేముఁడు మాటాటలేదు. అతఁ డూరక మామిడి సింగన్న చెప్పుదానిని వినుచు నూకొట్టుచుండెను.

మా. సిం :— మఱియును మహాప్రభూ ! మనకీ వైర మికెంత కాలము ? కాటయ వేమునికిని మీకును ప్రారంభమైన వైరము మీ బిడ్డలతో గూడ నేలసాగవలెను ? మీరు కాటయవేముని సాధించితిరి. అతని తలకొట్టించి తెప్పించితిరి. దానితో వైరము తీరిపోయినది. 'మరణాంతాని వైరాణి ' యనిగదా చెప్పుదురు. మన మింక వారితో సంధిచేసికొని యీవైరమున కింతటితో స్వస్తిచెప్పుట మంచిది. మీరెట్లును యువరాజునకు బట్టాభిషేక మొనరించితిరి.. యువరాజుల

కీవైరముగూడ నిచ్చుట యెందులకు? శ్రీనాథయ్యగారు విజయనగరమునకుఁబోయి వచ్చెనుగదా! ఆయన దువ్వూరుగూడఁ బోగలఁడు. అచ్చట బెండపూడి యన్నమంత్రి యున్నాఁడు. నిశ్శంక కొమ్మన్నకవి యున్నాఁడు. వారితో మాట్లాడి కొమరగిరిని వారికప్పజెప్పి నైరకారణమును బూర్తిగాఁ జంపిరాఁ గలఁడు. ఎచ్చటఁ బరాక్రమము, నీతి వ్యర్థములగునో యచటఁ బాండిత్యము పనిచేయును. మనకుఁ గావలసినది పనిగాని పౌరుషముగాదు. అపౌరుషమైనను మనము చక్కఁగా నెరవేర్చుకొంటిమి. కాబట్టి యెటుచూచినను గొమరగిరిని విడిచిపెట్టుట శ్రేయస్కరముగాఁ దోచుచున్నది.

కో. వే:— ఔనౌను. మీరుచెప్పినది బాగుగనే యున్నది. అట్లే చేయుదము. మీరీసంగతి యువరాజునకుఁగూడఁ జెప్పచేయుట మంచిదేమో. అతఁడుగదా నేఁటినుండి ప్రభువు!

మా. సిం:— నాకుఁ దమదగ్గఱనున్న చనవు యువరాజులయొద్ద లేదు. వారియొద్ద మిక్కిలి చనవుగాఁ దిరుగువాఁడు తురగా రామయ్యగారు. ఆయనతో యువరాజులకుఁజెప్పించి యనుజ్ఞ తీసుకొందును.

కో. వే:— ఆ తురగా రామయ్యగారేదో యీమధ్య నగ్రహారములపైఁగూడఁ బన్ను వసూలుసేయుమన్నారని సమయములవారిపైఁ బన్ను లెక్కువ సేసినారని విన్నాను. సుంకకరణములేమో బలిజసెట్టులను బాధించుచుండిరట. నాయొద్దకప్పుడు నవిరము యెల్లయ్యగారు వచ్చి చెప్పికొన్నారు. మీయొద్దకుఁగూడ వచ్చియే యుందురనుకొంటిని. మామిడిసింగన్న "అవునవు నతఁడు నాతోఁగూడఁ జెప్పెను. కాని యప్పటికి జేయిదాఁటిపోయినది. నేనేమిచేయుటకును వీలులేకపోయెను. రామయ్యగారు సమయములవారికి నగరముల వారికి స్పర్థ

పెంచి పసులబీళ్ళు నగరములవారి కెక్కువ బీళ్ళప్పటికే యమ్మి వేసి నాఁడు. వసంతోత్సవ సామగ్రికి నగరములవారికే బేరమిచ్చి వచ్చి నాఁడు. అప్పటికిని వారికిచ్చిన బేరములో సగముకద్దుచేసి సమయనగుల వారికిచ్చి వారికన్నీళ్ళు తుడువఁ గల్గితిని. అగ్రహారములపైఁ బన్ను మాత్రము రాఁబట్టకుండ నుత్తరువులు పంపితి” ననెను.

కో. వే:— సరే! మీరు రామయ్యగారితో జెప్పించుటకంటె యువరాజునకు నామాటగాఁజెప్పి కొమరిగిరిని విడిపించి శ్రీనాథయ్యగారితో దువ్వూరు పంపివేయుఁడు.

మామిడిసింగన్నయు శ్రీనాథుఁడును సెలవు దీసికొని వెడలిపోయిరి. వేముఁ డాలోచించుచుఁ గొంతసే పట్లె కూర్చుండియుండెను. “అవును. మామిడిసింగన్నగారు చెప్పినదిచాల బాగున్నది. కొమరగిరిని వదలిపెట్టుటయేమంచిది. దానియొ నీవైరము శాంతించును. మాలో మేమీాయంతవైరములను బెంచుకొని యింతపటకుఁ దెచ్చుకొంటిమి. దీని నిప్పటికైనఁ జంపుటమంచిది. గృహరాజును మానలుగురును గలిసి కట్టుగానుండి పూర్తిచేసికొనుఁడని యనవేమారెడ్డి చెప్పెను. కాని మాలోమేము పోట్లాడుకొని దాని కడ్డంకులు గల్పించుకొంటిమి. ఇప్పటికైన నీవైరము చంపి దానిని బూర్తిచేయవలయును. దానిని బూర్తి చేయవలెనని పాపము కొమరిగిరి యెంత ప్రయత్నించినాఁడు! కాని నేను వానిని బూర్తిచేయనిచ్చితినిగాను.”

హజారమున సమయ నివేదన ఘంటమ్రోగెను. అప్పటికి రెండు జాముల ప్రొద్దుపోయెను. ఆలోచనబరువుచేఁ గోమటివేముని మనసునకు నొప్పిపుట్టెను. అతఁడు పీఠముపైనుండిలేచి శాలాంతర్భాగమున శయనాగారములోనికిఁ బోయి పండుకొనెను. అతనికేమియోస్మృతులు వచ్చుచుఁ బోవుచుండెను. వానికొక యనుగతియన్నది లేకుండెను.

క్రమముగాఁ గోమటివేమునికి నిద్రపట్టెను. నిద్రలో నతనికొక స్వప్నము కలిగెను. ఆస్వప్నమునం దతనికిఁ గొమరగిరి కన్పించెను. కొమరగిరి కొండవీట గృహరాజుమేడలో సింహాసనముపైఁ గూర్చుండి సభ తీర్చియుండెను. ప్రక్క ననేక సామంతులు, పాళెగాండ్రు, దండనాథులును గూర్చుండియుండిరి. ఒక ప్రక్క మహావిద్వాంసులనేకులు గూర్చుండియుండిరి. సింహాసనమున కెదురుగా పద్మాకారమును బోలిన రంగస్థలము. ఆ రంగస్థలముపై స్వర్గమునుండి భూమికి డిగ్గిన యూర్వశివలె లకుమాదేవి నిలిచియుండెను. ఆమెకిరు ప్రక్కలఁ దిరస్కృతాప్సరః కన్యాసౌందర్యలగు వారయువతీమణులు నిలిచియుండిరి. రంగమున కిరుప్రక్కల నిద్దరు వైణికులు మద్దెలవాండ్రు గూర్చుండి యుండిరి. కొమరగిరి తాను వ్రాసిన వసంతరాజీయము నుండి యొక శ్లోకమును జదువును. ఆశ్లోకభావమున కనుగుణముగా లకుమాదేవి శరీర మొదిగిపోవును. కన్నులు మెఱయును. బొమలువంగును. పదములు చిణచిణలాడును. ఆశ్లోకభావమంతయుఁ జైతన్యవంతమై సభ్యుల యెదుట మూర్తిగట్టి నిలుచును. ఇట్లొకజాముసేపు వసంతరాజీయ లక్షణలక్ష్యసమన్వితముగా లకుమాదేవి నాట్యమునర్చెను. తఱువాత నామెను గొమరగిరి కౌఁగిలించుకుని తెచ్చి సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టి బంగరుపువ్వులతోడను ముత్యములతోడను. రత్నములతోడను నభిషేకముచేసెను.

తఱువాతఁ గాటయవేముఁడు లేచి కొమరగిరి పాండిత్యమును లకుమాదేవి వైదగ్ధ్యమును బ్రశంసించి యాకొమరగిరి రచించినవసంతరాజీయలక్షణగ్రంథము ననుసరించి తాను గాళిదాసు నాటకత్రయమునకు వ్రాసిన వ్యాఖ్యను జదివి వినిపించెను. అతఁడు చదివినంతసేపును బ్రతివిషయమునఁ దన్ను వెక్కిరించుచున్నట్లుండెను. తన సాహితీజ్ఞాన

మును గాదనుచున్నట్లుండెను. తఱువాతఁ గొమరగిరిలేచి కాటయ వేముని గౌఁగిలించుకొని యతఁడు శ్రీకృష్ణునివలెఁ దన్ను సింహాసనారూఢుని గావించి రాజ్యమును నిస్సపత్నముగాఁ జేసి పాలింపఁ జేయుచుండెనని పొగడెను. కాటయవేముఁడు తనవంక మిక్కిలి గర్వముగాఁ జూచెను. తనకది సహింపరానిదయ్యెను. తాను కోమటిరెడ్డి వంకఁ జూచెను. కోమటిరెడ్డికూడ మొగము మొరకటించుకొని కూర్చుండియుండెను. కాటయ వేముఁడు మఱల నిలుచుండి తనవంకఁ గోమటివేమునివంక తీవిగా జూచుచు ననవేమారెడ్డివారి కలలు నేఁటికి ఫలించినవి. గృహరాజుమేడ మొదటి యంతరువు పూర్తియైనది. ఈసుముహూర్తమున వసంతరాయ బిరుదాంకితులు కొమరగిరిరెడ్డివారు గృహప్రవేశము గావించి లక్ష్మీదేవివంటి లకుమాదేవిచే నాట్యము చేయించిరి. ఈరెండవ యంతరువు కొంచెము కాలములోఁ బూర్తికాఁ గలదు. అందు లక్ష్మీదేవికి స్థిరనివాసము గల్పించి ప్రభువులు తనవారిలోను బరులలోను సాటిలేనివారై కొండవీటి మహాసామ్రాజ్యమును నేకచ్ఛత్రముగాఁ బరిపాలింతురు. రెడ్డిరాజ్యము వారి వంశమునందు స్థిరముగాఁ గలదని చెప్పెను. సభయైపోయెను. తానును గోమటిరెడ్డియుఁ గలసి వెడలిపోయిరి. తాను గోమటిరెడ్డితో నక్కడే చెప్పెను. ఇదిగో! చూచితివా? కాటయవేముని పొగరు. వీఁడు కొమరగిరిచే గృహరాజు మేడను గట్టించి మనయందఱను వానికి సామంతులను జేయఁజూచుచున్నాఁడు. గృహరాజుమేడ నెవరుగట్టిన వారి కోవలో రాజ్యము స్థిరపడిపోవునుగదా యని వీని యాశ. ఈ రాజ్యమునందు మనమందరము సమాన భాగస్థులము. మనమందరమును ననవేమారెడ్డి ప్రక్క నిలిచి యీరాజ్యమును బెంపొందించితిమి. ఇట్టి దీనికిఁ గొమరగిరి యొక్కడే ప్రభువగునట. వానికి మనము సామంతులము గావలెనట! యెంతదురాశ! వీఁడు గట్టునది గృహరాజుమేడగాదు. గాలిమేడ

నేనీమేడను బూర్తి కానీయను. దీనిని బడఁగొట్టించెదన నెను కోమటిరెడ్డి తనమాటలకు సమ్మతించి తానుగూడ సాయపడుదు నన్నాడు. తఱువాతఁ దాను గోమటిరెడ్డిని దివిసీమ నాక్రమించుకొనుమని పురికొల్పెను. కోమటిరెడ్డి యంగీకరించెను. వారిద్దఱును సరేయన్న సరేయనుకొనుచు వెడలిపోవుచుండిరి.

ఇంతవఱకుఁ గల యనుస్యూతముగా సాగెను. తఱువాత గోమటివేమునకు గాఢముగా నిదురపట్టెను. చాలసేపటికతనికి మెలకువ గల్గెను. అతఁడు లేచి గవాక్షమునుండి బయటికిఁ జూచెను. బయట చీఁకటి బాగుగా వ్యాపించియుండెను. అప్పటికి సమయమెంతయైనదో యతనికిఁ దెలియలేదు. కాని యింకను దెల్లవారుటకుఁ జాలరాత్రి మిగిలియున్నట్లు గన్పించెను. కోమటివేముఁడు కన్నులు మూసికొని తనకువచ్చిన స్వప్నమును గుఱించి ధ్యానించుచు నట్లే పండుకొని యుండెను. గవాక్షమునుండి చల్లనివాయువు తెరలుతెరలుగా వచ్చి యతని ముఖమునకు దాకుచుండెను. అతనిమనసున నేదియో చెప్పరాని యొకబాధ కలవరపెట్టుచుండెను. అతనికి బ్రమాగన్నుగా నిద్ర పట్టెను. అతనికి బాహ్యస్మృతి పోయినదిగాని యాంతరస్మృతి ప్రచారమణగిపోలేదు. హఠాత్తుగా నాతని కన్నులయెదుటఁ గొమరగిరిరెడ్డి కన్పించెను. కొమరగిరిరెడ్డిప్రక్కఁ గాటయవేముని తల. కొమరగిరిరెడ్డి తన్నేదియో యధిక్షేపించుచుండెను. కాటయవేముని తల తన్నొకొక్కప్పుడు బెదరించును. ఒకొక్కప్పుడు వేళాకోళముచేయును. వేముఁడు వారిని జూచి ఓహో! మీరిద్దఱును జచ్చిపోయినను జంట వీడలేదనెను.

తల :— మే మెందుకు వీడెదము? విశేషించి నిన్నుగూడ మాలోఁ గల్పుకొనెదము.

కొమరగిరి :— ఒరే! యట్లనెదవేమి? వాఢింకను గొన్నాళ్ళు

బ్రతికి బట్టకట్టవలయు ననుకొనుచున్నాఁడు. పాపమింకను గొన్నాళ్ళు బ్రతుకనిమ్ము.

తల :— ఏమిరా ! మూర్ఖుఁడా ! నిజముగానట్లనుకొనుచుంటివా ? ఇంక నెన్నాళ్ళు బ్రతికెదవు ! బ్రతికి యేమిచేసెదవు ?

వేముని మనసు స్వాధీనము తప్పిపోయెను. అది యతనికిఁ దెలియకుండ సమాధానము చెప్పినది. "గృహరాజుమేడ పూర్తిచేసెదను." కాటయవేమునితల పగలబడి నవ్వసాగెను. కొమరగిరిరెడ్డి చప్పట్లు కొట్టసాగెను.

తల :— పాపము వీఁడు గృహరాజుమేడను బూర్తిచేసికొనునట. ఏమిరా ! అపుడు పడఁగొట్టెద నంటివిగదా ! ఇప్పుడు పూర్తిచేసెద నందువేమి ?

కొమరగిరి :— పడగొట్టుటయుఁ బూర్తిసేయుటయు వీని యిష్టమే. నేను గట్టెదనన్న వీఁడు పడఁగొట్టెదనన్నాఁడు. నేనప్పుడు వీనితో సంధిచేసికొని యాకట్టినది కట్టినట్లు సగములో నాపివైచితిని. ఇప్పుడు వీఁడు గట్టెద ననుచున్నాఁడుగదా నేను బడఁగొట్టెదను.

తల :— ఎట్లు పడఁగొట్టెదవు ?

కొమరగిరి :— ఇదిగో ! యీకాలితోఁ దన్ని పడఁగొట్టెదను.

తల :— అప్పుడు నేను పగలపడి నవ్వెదను. నీవు చప్పట్లు కొట్టుము.

కోమటివేమునకు దుఃఖము పొంగివచ్చెను. అతని మనస్సు కుమిలిపోయెను. అతని కండ్లముందుఁ గొమరగిరి చప్పట్లు గొట్టఁగా గాటయ వేముని తల విఱుఁగబడి నవ్వుచు నల్లరిచేయుచుండెను. కోమటివేముఁడు

చేయునదిలేక వారివంక నట్లే రెండు మూఁడు నిముసములు చూచెను. అతనికి వారిని నమిలి మ్రింగునంత కోపమువచ్చెను. కాని యేమిచేయఁ గలఁడు. ఏమిచేయలేనని తెలిసికొన్నప్పుడతని కాకోపమంతయు దాని పూర్వరూపమైన భయముగాఁ బ్రత్యక్ష మయ్యెను. అతఁడు మీరు మీరెపుడేల వచ్చితిరి? మీరద్దఱును జచ్చిపోతిరిగదా! మరణాంతాని వైరాణి. మీతో నాకు వైరములేదు. నాపైన మీకు వైర మెందుల కనెను. కాటయ వేముని తల "ఇంకను నీవు మరణించలేదు గదా! అందులకు," అనెను.

వేమునకు హఠాత్తుగా మెలకువగల్గెను. అతఁడు కండ్లు తెరచి గవాక్షమునుండి బయటికిఁ జూచెను. బయటఁ జీఁకట్లు పలుచఁబడి బూడిదరంగునకుఁ దిరిగెను. అతఁ డోహో! వేకువయైనది. వేకువ నట్టి స్వప్నమువచ్చిన దేమనుకొనుచు నాచీఁకటిలోనుండి యాకసమువంకఁ జూచెను. బయట నాచీఁకటి నావరించియున్న యాకాశముయొక్క యనంతత్వ మాతని చూపు నాకర్షించెను. అతఁడీ యనంతభావము నీచీఁకటి యెన్నఁడు నాక్రమించలేదనుకొని తల్పము డిగ్గి యేగెను.

౧౨

నాఁటియుదయమునఁ బదిగడియల ప్రొద్దెక్కి తురగా రామయ్య రాచవేముని మందిరమువైపు నడచుచుండెను. ఆకసమున సూర్యుఁడు నాల్గుబారలు పై కెగఁబ్రాకి మెఱుపు విఱిగిన తెల్లని యెండ గాయుచుండెను. ఆ యెండలో నొక గోధుమవన్నె త్రాసు సూర్యుని కెదురుగా నిల్చి పగడవిప్పి యాడుచు నతనికిఁ గన్పించెను. అతఁ డుదయమే దుశ్శకున మైనదని విసివికొనుచు నడచుచుండెను. అతఁడు యువరాజు మందిరమును సమీపించు సరికి నతని కెదురుగా మామిడి సింగన్నగారు, శ్రీనాథయ్యగారును వచ్చుచుండిరి. వారినిజూడగనే తురగా రామయ్యకు

గుండెలో రాయి పడెను. మామిడి సింగన్న చిఱునవ్వుతోఁ దురగా రామయ్యను గుశలప్రశ్న చేసెను. తురగ రామయ్య చిత్తము చిత్తమని తప్పుకొనిపోయెను. అతఁడు గవనుదాఁటి చతుశ్శాలలోనికిఁ బోయెను. రాచవేముఁడచ్చట లేఁడు. తురగా రామయ్య యతని రాకకుఁ గనిపెట్టుకొని కూర్చుండెను. రెండుగడియల యనంతరము రాచవేముఁడు వచ్చెను. అతఁడు తురగా రామయ్యను జూడగనే "రామయ్యగారూ! మీరువచ్చి యెంతసేపైన" దని ప్రశ్నించెను.

రామయ్య :— రెండు గడియలైనది. నేను వచ్చుచుండగా మామిడి సింగన్నగారు శ్రీనాథయ్యగారు గవనియొద్ద నెదురుపడిరి.

రాచవేముడు :— అయినచో మామిడి సింగన్నగారు మీకు సంగతి యంతయుఁ జెప్పియేయుందురు.

తురగా రామయ్య ముఖమునఁ దొందరపాటు గన్పించెను. అతఁడు "ఆసంగతి యేమియో నాకుఁదెలియదు. నేను జాల ప్రొద్దెక్కి బయలుదేరితిని. అప్పటికే యాలస్యమగుటచే సింగన్నగారితో నేను నిలుచుండి మాటాడలే" దనెను.

రా. వే :— అయినచో మీకుఁ దెలియదన్నమాట. మహారాజులు కొమరగిరిని వదలిపెట్టవలయునని నాకుఁ గబురువెట్టిరి. శ్రీనాథయ్యగారు సోమదేవచోడుని వదలించుకొని వచ్చునప్పుడు వానికి బదులుగాఁ గొమరగిరిని వదలిపెట్టించవలయునని ప్రౌఢదేవరాయలు కోరెనట.

ఆమాటలు వినుటతోడనే తురగా రామయ్యకుఁ బై ప్రాణములు పైనపోయినట్లయ్యెను. పదిక్షణములవఱకతనినోట మాట రాలేదు. తఱువాత నతఁడు తన్నుదాను సంబాళించుకొని "మీ రేమంటిరని

ప్రశ్నించెను. రాచ వేముఁడు చిఱునవ్వుతో నేనేమందును? మహా రాజులు కబురుచేసిరిగదా. దానికి వేఱుసమాధాన మేమున్నది యనెను.

తు. రా :— అవునవును. మహారాజునకు మన మెదు రాడలేము. కాని యొకటి చూడుఁడు. ఆ కొమరగిరిని వదలుటకు నిజముగా మన కధికారము లేదు. అతఁ డన్న దేవచోడుని బందిగదా! మఱి వానిని వదలిపెట్టిన మన పథకమంతయు భస్మమైపోయినట్లే. అతఁడు మన చేతిలో నున్నంతవఱకు విజయనగర రాజులు, దువ్వూరి రెడ్లును నణఁగిపడి యుందురు. వదలితిమా! వానిని ముందుబెట్టుకొని యా దువ్వూరి రెడ్లు మఱల మనపైకిఁ గాలుదువ్వుదురు. ఇప్పుడు సింహాచలమువఱకు మన గుప్పిటిలో నున్నట్లే.

రా. వే :— మహారాజులు కబురుచేసిరిగదా! మన మేమిచేయ గలము.

తు. రా :— అవునవును. మనము చేయఁగలిగిన దేమియు లేదు. కాని వానిని వదలిపెట్టుట యెంత తెలివితక్కువపనియో చూడుఁడు! వదలిపెట్టితిమా! ఆ నష్టమును మనము కూడదీసికొనలేము. మీరాగు చూచితిరిగదా! ఈ యుద్ధములక్రింద నెంతధనము వ్యయమైనదో! బొక్కసములోనొక చిల్లిగవ్వకూడ మిగులలేదు. ప్రజలందఱు తక్కువ పన్ను సెల్లించుచు బంగారుగోడలు పెట్టుకొని యున్నారు. నే నమిత శ్రమపడి వారినుండి సరియైన పన్నులు రాఁబట్టితిని. కాని వారికది యెంతో కష్టముగానున్నది. అనవిరము యెల్లయ్య వాఁడిన్నాళ్ళు ప్రభుత్వము సొమ్మెంతయో యన్యాయముగాఁ దిని నాఁడు. ఈ రాజ్యములోని బీళ్ళన్నియు వాఁ డాజన్మాంతముగ గుత్తకుఁ దీసికొనెనట. మఱి యీ రాజ్యములో సగ మగ్రహారములే. వారిపైన దమ్మిడీ రాదు. పైగా నేనెన్నెట్లో కష్టపడి ప్రోగుచేసిన సువర్ణమంతయు నీపండితులు వచ్చి

కుంచములతోఁ గొల్పించుకొనిపోయిరి. అవును మహారాజుల యాజ్ఞ. నను మీఱి చేయఁగలను? నాచేతులతో నేను గొల్చితిని. ఇప్పుడు మఱలఁ గోశాగారములో దమ్మిడీతో సమ్మిడీ లేదు. మఱి దీనికేదో యీ గృహ రాజుమేడ యొకటి తల పెట్టితిని. మఱి యిప్పు డీ కుమార కొమరగిరిని వసలి పెట్టుచున్నాము నాఁటిల నేఁటినుండి యుద్ధములు ప్రారంభము. దీనికంతకు నాఁటిలి ప్రవర్త యొక్కడనుండి వచ్చును? పరమాత్మునికిఁ దెలియవలయును.

రా. వే :— రామయ్యగారూ! మీరు చెప్పినదంతయు నిజమే. మహారాజులవారి దానమునకు మితి, యంచు, లేదు. ఈ బ్రాహ్మణుల యాశకును మితి లేదు. ఒక్కొక్కనికి మూడేసి నాల్గేసి యగ్రహార ములు. మఱి యింకేమి కావలయును? కమ్మని నూవు నెయ్యి చేరలతో ద్రావికొని యెప్పుడును నిద్రమత్తుతో జోగిపోవుదురు. వారి కన్నులకుఁ బ్రపంచమంతయు స్వప్నమువలెఁ గన్పించును. అప్పటినుండి రాజు నొద్దకువచ్చి వేదాంతము మొదలుపెట్టుదురు.

తు. రా :— పోనీ వారా యగ్రహారములు దినుచుఁ గూర్చుండినను బాగుండును. మనమేదో లాంఛనముగాఁ బన్ను వేసిన వారికి బరువై మహారాజువారితో మొర బెట్టుకొందురు. మహారాజులా పన్ను దొలగించుటయె కాక వారికిఁ గుంచములతో సువర్ణమును గొలిచి యిచ్చును. నేనేమి మొత్తుకొనిన నేమిలాభము? మహారాజులకుఁ దోడీ మామిడిసింగన్నగా రొకరు. నేనా యవచి తిప్పయకు వసంతోత్సవముల సామగ్రికి బేరమిచ్చి బీటుల కెక్కువ పాటపాడించి వాని నుండి ప్రతిసంవత్సరముకంటె నాల్గు రెట్లెక్కువ పుల్లరిని బుచ్చుకొంటిని. ఆ బేరములో సగమువరకును రద్దుచేయించి మామిడి సింగన్నగారా సవిరము యెల్లయ్యకిచ్చిరి. దానితో వారికిఁ గన్నులు నెత్తికివచ్చినవి.

రా. వే :— అవునా సవిరము యెల్లయ్య వాలకముచూచిన నాకును నోడలు మండికొనిపోవును. వాని బ్రదుకునకు వాఁడు మహారాజుతో మనపైఁ గొండెములు చెప్పుటయా? వాఁడేదో వీరబలిజ సమయముల కన్నింటికి నాయకుఁడట. ఆసమయములపైని నే రాజ్యముల వారికి నధికారములేదట కాదా? వాఁడే తప్పుచేసిన నూఱకుండవలసిన దేనా?

తు. రా :—వానికట్లు సాగుచున్నది. చూచుచు నూరకున్న మేయుచుఁ బోయెనన్నట్లు వాని నెవ్వరు నదలింపకుండుటచే వాఁడు మితిమీరి పోవుచున్నాఁడు. నేను విడివర్తకులతో పాటు వానిగూడ పన్నియవలయునని శ్రీముఖము పంపితిని. నగరముల నారికంటెఁ బన్నెక్కువ వేసినారని వాఁడొక యభ్యంతరము లేవదీసెను. వాఁ డెట్లును నీయఁడు. వానిని శిక్షింపలసిన దే.

రా. వే :— వానినేకాదు. ఎవరైననరే! పన్నులీయనిచోఁ గఠినముగా శిక్షింపవలసిన దే. బొక్కసములో ధనములేక రాజ్య మెట్లు సాగును.

తు. రా :— ప్రభూ! నేనిదియంతయు విచారించియే ప్రజలను నొత్తిడిచేసి డబ్బుగుంజితిని. కాని యేమిలాభము! మహారాజు లది యంతయు దానములక్రింద వ్యయపెట్టిరి.

రా. వే :— రామయ్యగారూ! జరిగినదేదో జరిగిపోయినది. ఈదానధర్మముల నింతటితో నరికట్టవలెను. మఱి మఱల ధనము సేకరించు నుపాయమేదైన నాలోచింపుఁడు.

తు. రా :— ఏమి యాలోచింపుమందురు? నే నేదో యాలో

చించిన మామిడి సింగన్నగారు దానికెదురుగా నాలోచించి నాయాలో చనము సాగనీయఁడు. ఆయన యీ రాజ్యమునఁ బ్రధానమంత్రి.

రా. వే:-ఆయన యెట్లును పెద్దవాఁడైనాఁడు. ఆయన కేదో చెప్పి నేను సరిపెట్టెదను. పైకిఁ గాకపోయినను నిజముగా మీరే ప్రధానమంత్రి.

తు. రా:- ప్రభూ! నాకీమంత్రిత్వముపై నాసలేదు. నేను చిన్నతనమునుండియు మీ యాస్థానము నాశ్రయించి బ్రతుకుచుంటిని. నేను రాయసముగా మీ యాస్థానమునఁ జేరితిని. అప్పటికి నాకు నిరువది యేండ్లుండును. ఇప్పుడు నా కేఁబది యేండ్లు. ముప్పది యేండ్లు మీ యుప్పుఁబులుసు దిని శరీరమును బెంచుకొంటిని. నా కొక్కటే కోరిక. ఈదక్షిణాపథమెల్లను గొండవీటి రాజ్యముక్రిందికి రాఁగాఁ జూడవలయునని. దానికిప్పుడు మంచిసమయము చిక్కినది. కుమార కొమరగిరి మనచేతికి జిక్కినాడని సంతోషించితిని. కాని దానిని మామిడి సింగన్నగారు భగ్న మొనరించిరి. ధనమున కేమి: ధనమెట్లో ప్రోగుచేసెదను. కాని మరలఁ గుమార కొమరగిరి నెట్లు పట్టుకొనఁగలము? చేతఁ జిక్కినపిట్ట తప్పించుకొని పోవుచున్నదే. చిక్కినపిట్టను జిక్కినట్లుగాఁ బిసికి వేసినను బాగుండెడిది.

రా. వే:- ఇప్పుడు మనము దానిని వదలిపెట్టక తప్పదు. సోమదేవుని వదలి వారు గొంత యౌదార్యము చూపిరి. కొమరగిరినిగూడ వదలి మనముగూడ నౌదార్యమును జూపవలసి యున్నదిగదా!

తు. రా:- ఈ రెండౌదార్యములును మననష్టమునకే వచ్చినవి. ఇప్పుడా సోమదేవుని విడిపింపక పోయిన నేమి మునిగిపోయినది? విడుదలపొంది మన కాతఁ డేమి యొరిగించెను? ఇక నిప్పుడాతఁడు వేమాం

బను బెండ్లియాడి రాజమహేంద్రవరమున సుస్థిరుఁడగును. ఈకుమారగిరిని ముందు బెట్టుకొని దుష్ప్రారిరెడ్లు మనపైకి దూకుదురు. మఱల నంతయు మొదటికి వచ్చినది.

రా. వే :— కొమరగిరిని వదలుట నాకు నిష్టములేదు. మఱి యేమి చేయుదుము. అతని వదలక తప్పదు.

తు. రా :— ప్రభూ! ఏమియైనఁ జేయవచ్చును. కొమరగిరిని మాత్రము వారిచేతిలో వదలరాదు.

రా. వే :— ఏమిచేయుమందురో స్పష్టముగాఁ జెప్పుము. మీ యభిప్రాయము నాకు బోధపడలేదు.

తు. రా :— ప్రభూ! ఏమిచెప్పుటకును దానినిగుఱించి నేను దీర్ఘముగా నాలోచింపవలయును. నేనాలోచించి చెప్పెదను నాకు సెలవిప్పింపుఁడు.

రా. వే :— నేఁటి సాయంకాలమే శ్రీనాథయ్యగారి వెంటఁ గొమరగిరిని దరలించుకొనిపోయెదమని మామిడి సింగన్నగారు చెప్పిరి. కావున మీరీలోపుగనే యేదియోయొకటి నిర్ణయింపవలయును.

తు. రా :— ఏమి నిర్ణయించుటకును నాకిప్పుడు పాలుపోవుట లేదు. సరే కానిండు. ఒకపని చేసెదను. నేనుగూడఁ గొమరగిరితో బయలుదేరి పోయెదను. అచ్చటి పరిస్థితులనుబట్టి యాలోచించి యేదియో యొకటి చేసెదను.

రా. వే :— సరే! అట్లే బయలుదేరిపొండు.

తురగా రామయ్య సెలవుదీసికొని వెడలిపోయెను. అతఁడు హుటాహుటి నింటికిఁబోయి భోజనాదికము నిర్వర్తించి ప్రయాణము

నకు సన్నద్ధుఁ డయ్యెను. అతఁడు బయలుదేరుటకుఁ జెప్పులోఁ గాలు పెట్టెనో లేదో సేవకుఁడొకఁ డాయాస పడుచుఁ బరువెత్తుకొని వచ్చి "అయ్యా! తమరి నున్నవారి నున్నట్లుగా యువరాజువారు రమ్మన్నారని చెప్పెను. తురగా రామయ్య : ఓరీ! యువరాజెవరురా? మహారాజుగా రనుమనెను. సేవకుఁడు చిత్తము, చిత్తము. అలవాటు వల్ల నాకట్లే వచ్చినది క్షమింపుఁడనెను. తురగా రామయ్య నడచుచు "ఓరీ! నేను మహారాజువారి మందిరమునకుఁ బోయెదను. నేను వచ్చు వరకును శ్రీనాథయ్యగారిని బయలు దేరవద్దని చెప్పుము. పొమ్మ" ని వానిని బంపి తాను రాచవేమని మందిరమునకుఁ బోయెను. లోపల రాచవేముఁడు గూర్చుండియుండెను. అతనికన్నులు నిప్పులు గ్రక్కు చుండెను. ప్రక్కనెవఁడో యొక సామాన్యుఁడు గూర్చుండి యుండెను. అతని వేషము గూడ నాగరకముగా లేదు. అతనిమొగమున దైన్యము గూడుకట్టియుండెను. అతని వాలకము చూచి తురగా రామయ్య యతఁడొక సుంక కరణమని గ్రహించెను. రాచవేముఁడు తురగా రామయ్యను జూడగనే "రామయ్యగారూ! చూచితిరా యేమి జరిగినదో" యనెను

రామయ్య :— ఏమిజరిగిన దేమిజరిగినది?

రా. వే :— ఈ సుంక కరణముగారి నడుగుఁడు.

ఆ సుంక కరణముపేరు నాగన్న. అతనిది మోటుపల్లి సమీపమున నొక కుగ్రామము. అతఁడు లేచి నిలువఁబడి రామయ్యకు నమస్కరించి యిట్లు చెప్పెను. "అయ్యా! ప్రభువువారి యాజ్ఞ ప్రకారము మేము వర్తకులయొద్ద సుంకము వసూలు చేయుచుంటిమి. నగరముల వర్తకులు మాకభ్యంతరము చెప్పకుండ సుంకము లిచ్చి వేయుచుండిరి. కాని యీబలిజసెట్లతో మాకుఁ జాల చిక్కు తట

స్థించినది. వారు పూర్వమువలెనే నూటికి మూఁడువంతుల సరకు సుంక మిత్తుమందురు. మీ యాజ్ఞప్రకారము మేము సువర్ణ రూపములో నిమ్మంటిమి. వారు మారివాజుప్రకారము దప్ప మఱియొక విధముగా నీయమనిరి. “నేమేమిచేయుదుము. ఇది రాజాజ్ఞ — మీరీయక తప్ప” దని మేమంటిమి. వారు మీఁదు నూటికిఁ బది టంకముల వంతున సుంకము వేసితిరి. మా కిప్పు డేడు టంకములు పెరిగినది. మే మింత సుంక మేరాజ్యమున నిచ్చుటలేదు. మహమ్మదీయ రాజ్యమునఁగూడ మాకింత సుంకము లేదు. కావున మే మీయమని హఠము చేసిరి. మేము వారిని బలవంతముచేయక తప్పలేదు. అనాఁడు నేనును బెద్దన్నయు రాజన్నయు ముగ్గురము సుంకకరణములము, సెట్టివాండ్రను దలవరులను వెంటఁబెట్టుకొని రేవునకుఁ బోయితిమి. కప్పలియొకటి జోంగొకటి యప్పుడే రేవులోనికి వచ్చినవి. బలిజసెట్లు సరకులు దించుకొనుచుండిరి. మేము సరకులన్నియు దించునందాక యాగి సుంకము కట్టుటకు మొదలుపెట్టితిమి. పది నిముసము లైనతర్వాత నాసంగతి యెవరోపోయి రవాణా సావడియందున్న పెద్దబలిజతోఁ జెప్పిరి. అతనిపేరు సవిరము యెల్లయ్య యట. అతఁడు గబగబవచ్చి మమ్ముఁ దిట్టుటకు బ్రారంభించెను. పెద్దన్నయు రాజన్నయు నతనిని మందలించిరి. అతఁడు మేము సుంక మిచ్చునదిలేదు. మీకు దిక్కున్న చోటఁ జెప్పుకొనుఁడని చేతులలోని పుస్తకములను లాగికొని చించివేసెను. రాజన్న పెద్దన్నలు వాని నాపుటకుఁ బ్రయత్నించిరి. అతఁడు మిక్కిలి కోపముతో నొరనుండి కత్తినిలాగి వారినిద్దఱను నరకివైచినాఁడు. ఈ వార్తను దమకుఁ జెప్పుటకు నే నెట్లో ప్రక్కవాటుగాఁ దప్పుకొని ప్రాణములతో బయటపడితి” నని నాగన్న తన కథనము ముగించి ప్రభూ! మేమీ బలిజసెట్లముందు బ్రతుకునట్లులేదు. మేము కడు పేదవారము. వృత్తివదలుకొన్నచో మాకు గడవదు. ప్రభువులు మాకుఁ

దగిన రక్షణ కల్పించవలయునని తురగా రామయ్య కాళ్ళపైఁ బడెను. తురగా రామయ్య వానిని లేవనెత్తి సముదాయించి "ఓయీ! రేపి పాటికి మోటుపల్లి రేవు లన్నింటికిఁ దగిన కట్టుదిట్టములు చేసెదము. మీ కేమియుఁ బ్రాణాపాయము రానీయము. ఇప్పటికి జరిగిన దేదో జరిగినది. పెద్దన్న రాజన్నల కుటుంబములకు భరణము కల్పించెదము. నీవుపోయి సువారములో భోజనముచేసి మీయూరు పొమ్మని చెప్పెను. నాగన్న సెలవుదీసికొని వెడలిపోయెను.

తురగా రామయ్య రాచవేముని మొగమువంకఁ జూచి, చూచి తిరా? యేమిజరిగినదో! ఈసవిరము యెల్లయ్య యిట్టినాఁడని నాకు మొదటినుండియుఁ దెలియును. ఇదియంతయు మహామంత్రి మామిడి సింగన్నగారు వానియెడఁ జూపిన మెత్తదనమునకు ఫలిత మనెను.

రా. వే :— అవునవును. వానికి మన యలుసు చిక్కినది. మితి మీరిపోవుచున్నాఁడు. నేఁడీ సుంకకరణములను జంపెను. రేపు నన్నే చంపఁగలఁడు. వీనికిఁ దగిన శిక్ష సేయవలయును. ఈసమయములవారి నొక కాలిక్రిందఁ ద్రొక్కిపెట్టి యుంచవలయును. నాయనగారి పరి పాలనములో వీరు దేశమంతయుఁ గొల్లగొట్టి మత్తెక్కియున్నారు. ఆ మదము దింపవలయును.

తు. రా :— మామిడి సింగన్నగారిబలిజెలను నెత్తికెక్కించుకొనిరి. వీరు మహావీరులట. రణరంగరాములు, సంగ్రామభీములు నట. వారిపైనిఁ జౌరులపైన వేయుఁ బన్నులేవియు వేయఁగూడదట. వీరి కంటె నగరములనా రెన్నో రెట్లు నయము. వారు మనము చెప్పినట్లు వింటురు. నేను "గొంచెము సుంకమెక్కువ చేయుచున్నాము. యుద్ధ ములవల్ల నట్లు చేయవలసివచ్చిన" దని అవచి తిప్పయసెట్టికి గబురు

వెట్టితిని. అతఁడందుల కొప్పుకొనుటయే గాక విలువగల వస్తువు లెన్నియో కానుకలు పంపినాఁడు. ఈసమయముల వారితోఁ బోటీకి నిల్చి పసులబీళ్ళ కెక్కువ పాట దెచ్చినాఁడు. వసంతోత్సవ సామగ్రి మనకుఁ జాల తక్కువధరలకు సమకూర్చినాఁడు. కాని యేమిలాభము? నేనుఁజేసినదంతయు మామిడి సింగన్నగారు బూడిదలోఁబోసిన పన్నీరుగ చేసినారు. ఆబేరములో సగము నెక్కువధరల కిప్పించి వీనికిఁ గన్నులు నెత్తికి దెప్పించినారు. అదియంతయుఁ గడ కిట్లు పరిణమించినది.

రా. వే:— రామయ్యగారూ! ఈసారి మన మీ యెల్లయ్యను క్షమించి యూరకుండరాదు. వీనిని వీనిసమయములను బాతాళమునకుఁ ద్రొక్కవలయును. మీ రుపాయ మాలోచించి చెప్పుఁడు. మీగ్రామమున కీ పర్యాయము సింగన్నగారు రద్దురాకుండఁ జూచెదను.

రా:— నేనిదివరకే యాలోచించితిని. ఈసమయములవారిపై నూటికేబదివంతుల పన్ను వేయవలయును. పౌరులిచ్చు పన్నులన్నియును గూడ వీరు చెల్లించవలయును. ఈయనిచో వీరిని గ్రూరముగా శిక్షించి వసూలు చేయవలయును. దానికిఁ దగిన పద్ధతులన్నియు నేను వచ్చిన తర్వాతఁ జూచికొందము. మీరీ లోపల నేమాత్రమును బైకి పొక్కనీయకుఁడు.

తురగా రామయ్య సెలవుదీసికొని వెడలిపోయెను.

## ౧౩

గృహరాజమేడ పైయంతరువు గట్టుటకు మొదలుపెట్టి నెల దినములు గావచ్చెను. నిపుణులగు శిల్పులు నలుబదిమంది పనిచేయుచుండిరి. మేడయొక్క యాకారమంతయు దాదాపు పూర్తికావచ్చెను. కుడ్యములకుఁ బాలగచ్చు చేయుటయుఁ గప్పుపైనిఁ బ్రతిమలు చెక్కు

టయు మిగిలియుండెను. దినదినము కోమటివేమారెడ్డి సాయంవేళల వచ్చి సౌధనిర్మాణమును బరీక్షించి పోవుచుండును. సాధారణముగా నాయనతో మామిడి సింగన్నయు వామనభట్టో యెవరో యొకరు వత్తురు. శ్రీనాథుఁడు కుమారగిరిని వప్పచెప్పుటకు రాజమహేంద్ర వర ప్రాంతమునకుఁ బోయెను గాన నతఁడు వచ్చుట లేదు. శ్రీనాథుఁడు బయలుదేరి కూడ నెల కావచ్చెను. అతనితోఁ గూడఁ గొంతదూరము పోయి తురగా రామయ్య తిరిగివచ్చెను. తురగా రామయ్య తిరిగి వచ్చి పదునైదురోజు లయ్యెను. శ్రీనాథుఁడు లేని కారణమున నీ నెలదినముల నుండియుఁ గోమటివేముఁడు పురాణగోష్ఠి చేయుటలేదు. అతఁడు దినములోఁ జాలభాగ మాలోచనలతోఁ గడపివేయుచుండెను. అప్పుడప్పుడు రెండు మూఁడు దినముల కొక పర్యాయము వేమాంబ వచ్చి సంగీత పాఠములు చెప్పించుకొని పోవుచుండెను. ఆమె యిప్పుడు రాగము నందు రసమేళన మభ్యాసము సేయుచుండెను. కోమటివేమునియొద్ద నామె యున్నంతకాలమును నతని మనస్సు స్వర్గసీమలలో విహరించు చుండును. తక్కిన కాలమంతయు నది యొకవిధముగా నుండును. సాయంసమయములందు మాత్రమతఁడు మహామంత్రితోడను వామన భట్టుతోడను సాహిత్యమును గురించిగాని వేదాంతమును గురించిగాని ముచ్చటించును అంతియకాని యతనికి భావమైన యాలోచనము గొంచెమైన లేదు. అతనికి మిగిలినకోరికెల్ల యొక్కటియె. అది గృహ రాజు మేడను బూర్తి చేయుట. వేమాంబ వివాహమును గురించి యిప్పు డప్పు డతఁడు తలఁచకపోలేదు గాని యది జరిగినట్లే యతఁడు తృప్తి పడుచుండెను.

ఒక దినమున నతఁడు గృహరాజు మేడనొద్దకు వచ్చుసరికి వామనభట్టువరినో యొక వృద్ధబ్రాహ్మణుని వెంటఁబెట్టుకొని వచ్చు చుండెను. వారిని దూరమునఁ జూచి యాప్రక్కనున్న యతఁడు పెద్ది

యజ్వాకావచ్చునని వేముడనుకొనెను. కాని సమీపించుసరి కతఁడు పెద్ది యజ్వాకాదు. ఆయన పొడుగైనమనిషి. కొంచెము స్థూలకాయుఁడు కూడ. ఆయన శరీరము పచ్చగాఁ బండిన కాకరతొళ్లికవలె ముడుతలు పడి యుండెను. ఆయన ముఖమున నొక తేజోరేఖ పరివేషము గట్టి యుండెను. ఆయన వేముని సమీపింపఁగనే ప్రక్కనున్న వామనభట్టిదిగో! మహారాజువారని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు పడమటి సంజ వెలుగునకుఁ జేయి యడ్డుపెట్టి చూచు వేము నాశీర్వదించెను. వేముఁడు వారిద్దఱ నత్యాదరముతోఁ గుశలప్రశ్న చేసెను.

వామనభట్టు :– మహాప్రభూ! ఈయన బ్రహ్మని ష్ఠాంసుఁడు. ఈయన పేరు రామభద్రయజ్వ. పూర్వ మెప్పుడో ముప్పది యేండ్ల క్రిందఁ బ్రభువులు పొట్లపాడు సర్వాగ్రహారముసేసి యిచ్చిరి. ఆయన యప్పటి నుండి యూయూరనివసించుచుఁ దపస్సుచేసికొనుచున్నాఁడు. ఇన్నాళ్ళు ప్రభువులిచ్చిన యగ్రహార మాయనకు నిరాటంకముగఁ జెల్లుచున్నది. పదిరోజుల క్రిందటఁ దురగా రామయ్యగారగ్రహారములో పన్ను వసూలు చేయుచున్నారని నియోగులు బలవంతపెట్టిరట. ఆ పన్ను పంటలో సగమీయవలె నన్నారట. మేము ప్రభువువారితోఁ జెప్పు కొందమని నేదగ్యాంత్రము గోలచేసినను వినక బలవంతముగా బలుపులను గాదెలలోని ధాన్యమును నిండ్లనున్న సువర్ణమును దోచుకొని పోయి రట. ఆవిషయమును దమతో మనవిచేసికొందమని యూ మనవచ్చినాఁడు

వేమునికిఁ దా నేమివినుచుండెనో తెలియలేదు. ఆతని వీనులనే యతఁడు నమ్మలేకపోయెను. అతఁడు రెండుమూడుసారు లిది నిజమా? యిది నిజమాయని తర్కించి పలికెను. వామనభట్టు "మీతో మేమేల యబద్ధము చెప్పెదము: అగ్రహారికులపైననే యింత దౌర్జన్యము జరుగుచుండఁగాఁ దక్కిన ప్రజలపై నెంత జరుగుచున్నదో."

యనెను. వేముఁడు దీర్ఘముగా నిశ్శ్వసించితలయూడించుచు "నౌనౌను. ఇది యంతయుఁ గాలమహిమ. నే నిట్టిమాటలు వినవలసి వచ్చునని కలనైన నూహించి యుండలే" దనెను.

ఇంతలో హఠాత్తుగా నచటి కొక వృద్ధురాలు పరువెత్తికొని వచ్చెను. ఆమె కరువదియేండ్ల వయసుండును. ఆమె తలయంతయు ముగ్గుబుట్టవలె నెరసిపోయి శరీరమంతయు ముడుతలువడి యుండెను. ఆమె యెట్లు రాచనగరునఁ బ్రవేశించినదో యెవరికిఁ దెలియదు. ఆమె కోమటివేముని సమీపించుచుండఁగాఁ బ్రతిహారు లామెను జూచిరి. వారామెనడ్డుకొనుటకుఁబ్రయత్నించిరి. గాని వారామెనుగదియు లోపలనే యామె కోమటివేముని యొద్దకుఁ బరువెత్తికొనివచ్చి పాదములపైఁ బడి గుండె బాదికొనుచు నేడువఁదొడఁగెను. కోమటివేముఁ డామె నోదార్ప ప్రయత్నించెను గాని లాభము లేకపోయెను. ప్రతిహారు లచ్చటకి వచ్చి యామెను దొలగింపఁ బ్రయత్నించిరి గాని వేముఁడు వారిని వారించెను. ఆమె యట్లే యేడ్చుచు నడ్మ నడ్మ నేవియో మాట లనుచుండెను. కాని వాని నన్నిఁటిని నొక పోత పోయుటకు వీలు లేకుండెను. కోమటివేముఁ డామె కేమి జరిగినదో కనుగొని రమ్మని యొకభటుని బంపెను. కొంతసేపటికి వాఁడు తిరిగి వచ్చి యుదయ మెవఁడో భటుని జంపిరట. వాఁడీమె కుమారుఁడు గావచ్చు నని చెప్పెను. ఆ వృద్ధురా లామాటలు విని తానచ్చటి కెదురుగ వచ్చి నది గుస్స తెచ్చుకొని యిట్లు చెప్పెను. 'ప్రభూ ! నా కొక్కఁడే నొక్క బిడ్డ. వాఁడు దసునసలోఁ బుట్టినప్పటినుండి మెలఁగుచుండెను. ఎప్పుడు నా కొక్క తప్పైనఁ జేసినవాఁడు గాఁడు. మీ కొలువులో వాఁడతి విశ్వాసుఁడు. వానిని ప్రభువులు శ్రీనాథునింటికిఁ బంపిరి. వాఁ డచ్చట యుద్ధమునఁ జేసి యెవరో కొందరి బారిఁ బడి చచ్చెను. నగరి

వాకిటి వఱకు గుఱ్ఱముపైన స్వారీగా వచ్చెనట. ఊరిలో గుఱ్ఱము పై నవచ్చినాఁడను నెపమున వానిని బట్టుకొని యువరాజునారు తల తీయించిరి. ఆ మాటలు చెప్పి యాముదుసలి మఱల నావునావురని యేడ్వసాగెను. అతి ప్రయత్నముమీఁద వామనభట్టామె నోదార్చి యావలకుఁ బంపివేసెను. కోమటివేమున కీ వృత్తాంతము విని మతి పోయెను. అతఁ డూరక మాన్పడి నిలుచుండి యాకసములోనికిఁ జూచు చుండెను. ఆయాకాసము యొక్క యనంతత్వము మఱల నాతని మనసు నాహరించెను. అతఁడు చాలకాల మట్లే నిలబడి యా యనం తత్వమును భావించుచుండెను. ఆ ముదుసలి వృత్తాంతము గాని యా రామభద్ర యజ్వ వృత్తాంతముగాని యతని మనసున మెదలుట లేదు. కనీసము వా రచ్చటనున్న స్మృతియైన నతనికి లేదు. ఆస్థితిలో నతఁ డొక గడియకాల ముండెను. హఠాత్తుగా నతని మనస్సునకు బహి స్స్మృతి గలిగెను. అతఁడు తనశరీరమును జూచుకొనెను. ఆ యనంతా కాశమున కతని కీతని యునికియే విచిత్రముగాఁ దోఁచెను. అతఁడు రామభద్రయజ్వవంకఁ జూచి "యయ్యా! మీ రీ యాకాశముయొక్క యనంతత్వమును జూడుఁడు. దీని ముందు మన మెంత యనెను. రామభద్రయజ్వయు వామనభట్టును నతనివంక విచిత్రముగాఁ జూచిరి.

రామ. య:— మహాప్రభూ! తమ యభిప్రాయ మేమియో మా కవగతము గాలేదు.

కో. వే:— నా కిది యేదియో యొక మహాభావ మొక యనంత భావము కొట్టవచ్చిన ట్లెల్లప్పుడు మనసు నాక్రమించుచుండును. ఇది యేదియో యొక మహాసముద్రమువలె నాచుట్టు నీయాకసము చుట్టు కొనిపోవుచున్నట్లు, నీమహాగోళము లన్నియు దానిగర్భమున బంతుల వలెఁ దేలిపోవుచున్నట్లును గోచరించుచుండును. నే నేదో యీగోళ

ములలో గణనమునకురాని యొక యణుమాత్రకమగు గోళముపై నొక మూల నొక శతాంశమునకుఁ బ్రభువను. ఆ ప్రభుత్వమైనను నాకేదో యొక యల్పకాల ఖండ పర్యాప్తిగలది. దానికిఁ బూర్వాపరములందు నా ప్రభుత్వము లేదు. కాలైక దేశమున భూమ్యేక దేశమున నేను నిల్చి యీ యనంతాకాశము నీ యనంతకాలమును జూచి విహ్వలించి పోవుచున్నాను. నాకుఁ జూడగాఁ జూడగా నిదియేదో యింద్రజాలమువలెఁ గన్పించుచున్నది. ఆ పెద్దియజ్వగారు గూడ నట్లే చెప్పెను. ఈ కనిపించునదంతయు వట్టి వార్తమానిక విలసనము, వట్టి యెండమావులు. దీనివెనుక నేదో మహాకాల మున్నదట. అది పరమేశ్వరస్వరూపమట. దాని స్వరూప పరిజ్ఞానమున జీవుఁడీ మృత్యురూపమగు కాలచక్రమునుండి ముక్తుఁ డగునట. ఆ పెద్దియజ్వగారిని నే నప్పు డడుగలేదు. నా సర్వజ్ఞచక్రవర్తిత్వము నన్నడుగనీయలేదు. ఆయన మఱల వచ్చునేమో యనుకొంటిని. రాలేదు. మీరు వచ్చితిరి. మీరు బ్రహ్మవిద్వాంసులుగదా? వర్తమానాత్మకమగు కాలమును మీరి యామహాకాలము నెట్లుదర్శింపనగునో కొంచెము చెప్పెదరా?" యనెను. వామనభట్టును రామభద్రయజ్వయు నతనివంక నప్రతిభులై చూచుచుండిరి. అప్పుడు చెప్పునదంతయు శ్రద్ధగా నాలకించినతర్వాత రామభద్రయజ్వ యిట్లనెను. "ప్రభూ! మీరేదో యొక మహానుభూతిలో మునిగిపోయినారు. వార్తమానిక విలసనము లన్నియు వట్టి యెండమావు లనుట మాబోంట్లకు శాస్త్రసిద్ధమైన విషయము. కాని యనుభవసిద్ధమైన విషయముగాదు. తమ కది యనుభవసిద్ధముగాఁ దోఁచుచున్నది. మీకు మేము చెప్పుట యేమి? చెప్పుట యనఁగా నేదో శాస్త్రీయముగాఁ జర్చించి ముందువెనుకలుఁ గొన్ని దళములు పేర్చి చెప్పెదము. దానివల్ల నేమిప్రయోజనము? ఆ చెప్పిన విషయమును భూతి గోచరమైనప్పుడే దానియందు నిజమైన శాస్త్రీయత దీపించును.

నేనాభూమిక కింకను జేరుకొనలేదు. మీరు నాకుఁ ద్రోవ చూపించితిరి. నేనుబోయి ప్రయత్నించెదను. సెల విప్పింపుఁ” డనెను.

కో. వే :— ఒక్కటి చెప్పుడు. నా కేదో యీ కాలమంతయు భూమిపైని దానినాశ్రయించుకొన్న వస్తువులపైని మాత్రమే యున్నట్లు తోఁచుచున్నది. దీనిని వదలి యాకసములో నీకాలమన్నది లేదు. ఆ యాకాశమునం దీ మహాకాలమున్నదా ? ఆ యాకాసము నీ మహాకాలము నీ రెంటికి నెచటనో ముడి యున్నట్లు నా కనిపించుచున్నది.

రామభద్రయజ్వ :— మీ రేదో గొప్ప మహాయోగములో నుండి మాట్లాడుచున్నారు. మీ ధ్యానబలముచేత నాముడి దాని యంతట నదియే విడిపోగలదు. నిజముగా మీకుఁ జెప్పు నధికారము నాకు లేదు. నేను బోయివత్తును. సెలవిప్పింపుఁడు.

కో. వే :— తురగా రామయ్యగారికిఁ గబురు పంపి నేను మీ సంగతి కనుగొందును. మీరిచ్చట రెండుమూడురోజులుందురుగదా !

రా. య :— మహాప్రభూ ! నాకు దానినిగుఱించి యిప్పుడేమి యును బటింపులేదు. ఇచ్చటికి వచ్చుటవలన నా కంతకంటె మహోప కారము జరిగినది. మీరు దానినిగుఱించి యేమియు మనసున బాధ పడనక్కఱలేదు.

అప్పటికిఁ బ్రొద్దుగ్రుంకు సమయమయ్యెను. వామనభట్టు రామ భద్రయజ్వయు సెలవుదీసికొని వెడలిపోయిరి. కోమటివేముఁ డట్లే నిలువఁబడి వారు గవనుదాఁటి పోవునందాక చూచెను. తఱువాత నతఁడు వెనుదిరిగి గృహరాజుమేడవంకఁ జూచెను. ' గృహరాజుమేడ యంతయు నెత్తుని సంజవెలుంగులుపాఱి రక్తముతోఁ దడిసినట్లు గాన్పించెను. అతఁడాయూహ మనసులోనికి రాగానే యింత రక్తపాత

మునకుఁ గారణ మేముండునులే. ఇది వట్టి యలంకారమే కదా యను కొనెను. అతఁడు తలవంచి జడ్డిగాల బావివంకఁ జూచెను. జడ్డిగాల బావినీళ్ళలో సంజవెలుంగులు ప్రతిఫలించి దానినంతయు రక్తపుమడుగు చేసి చూపించెను. వేముడు తన దృక్కులను దిక్కులకు మలచెను. దిక్కులందుఁగూడ సంధ్యారాగములు రక్తచ్ఛవులు గ్రక్కుచుండెను. అతఁడు "నాచూపులకంతయు రక్తమే కన్పించుచున్న దేమి?" యని యాకసముపైకిఁ జూచెను. అచ్చటమాత్రము సంధ్యారక్తిమ లేదు. వేముఁడవశచిత్తముతో రాజమందిరముపైపు నడచెను.

అతని కారాత్రి మఱలఁ గాటయవేమునితల స్వప్నములో సాక్షాత్కరించెను. ప్రక్క కుమారగిరిరెడ్డి.

కో. వే :- మఱల మీరిద్దఱు వచ్చితిరి. నాతో మీకింకను వైరమేల? కుమార కొమరగిరిని మీరు మఱల నప్పగించితిని గదా!

తల పక పక నవ్వెను. కుమారగిరి చప్పట్లు చరచెను.

కో. వే :— ఎందుల కట్లు గోలచేసెదరు?

తల :— నీవు చెప్పినది నీవే మఱచిపోదువు. 'మరణాంతాని, వైరాణి' యని నీవే చెప్పితివిగదా! నీవు మరణించనిదే నీపైన మాకు వైరమెట్లు పోవును?

కో. వే :— మీరు మరణించితిరిగదా! మీకుఁ బోలే దేమి?

తల :— ఓయీ! మఱల నరవిందమునఁ బడుచున్నావు. మేము మరణించిన మాకుఁ బోవునుగాని నీకెట్లు పోవును?

కో. వే :— అదియేమి తలక్రిందుచేసి చెప్పెదవు? మీరు మరణించితిరి కాన మీపైని నాకుఁ గోపములేదు. నాపైని మీకుఁ గోప

ముండుటకు మీ రసలు లేరుగదా! మీరు నా మనసునందలి వాసనలే నాయె.

తల వెనుకటికంటె నిబ్బడిగా విఱుఁగబడి నవ్వెను. కొమరగిరి చప్పట్లు చరచెను.

తల :— నీవు బలేపండితుఁడవు. మమ్ము వాసనలనుచున్నావు. మాపైని వైరము లేదనుచున్నావు. సాయంతనమేదియో యీ వచ్చిన పండితుని నడలగొట్టినావు. పాప మాయన నిన్ను జూచి మహాయోగి వనుకొన్నాఁడు. నీకీ కాలభావ మాకాశభావ మివికూడ వాసనా ప్రాయములే యని యాయనకుఁ దెలియలేదు. ఆయన యట్లుపోయెను. నీ కిట్లంతయు రక్తపుఁగొల్లు కన్పించినది. ఇదియంతయు నేమున్నది? వట్టి వార్తమానికవిలసనము. వట్టి యెండమావులయ్యా! వట్టి యెండ మావులు.

తల విఱుఁగబడి నవ్వెను. కుమారగిరి చప్పట్లు చరచెను.

కో. వే :— అవునవును. వట్టి యెండమావులని నాకుఁ దెలియును. కాని కాని......తల :— ఆ యెండమావులలో నీళ్ళు త్రావి దాహము తీర్చుకొంద మనుకొందువు పాపము.

కొమరగిరి :— అట్లుకాదురా! అట్లుకాదు. వాని నన్నియు నిజముగా నెండమావులనియే తెలియును. ఒక్కటే. యొక్కటి. ఆ యొక్కటి మాత్రము పరమసత్యము.

తల :— ఏది యా యొక్కటి?

కొమరగిరి :— గృహరాజుమేడ. దానిని వదలి తక్కినదంతయు వట్టి యెండమావులు. వట్టి వార్తమానిక విలసనము. మృత్యుచక్రము.

మఱి యాగృహారాజుమేడయో? అది మహాకాలస్వరూపము. పరమ యదార్థము. దానిని బూర్తిచేసి వీఁడు ముక్తిని బొందును.

తల పకపక నవ్వెను. ఓహో! అందుకనియా? అందుకనియా! వీఁడు దానిని రక్తములో స్నానముచేయించినాఁడు. అబ్బ! అబ్బ! ఓరి! కోమటివేమా! అంతరక్తపాతముచేసి దానిని వట్టి యలంకార మందు వేమిరా?

కో. వే :— అది సంధ్యారాగము పర్వి నాకు రక్తమువలెఁ గన్పించినది. అలంకారముగాక మఱి యేమగును?

తల :— అది మహాకాలరూపము గాదురా? కోమరగిరి? దాని యందు క్షణికమగు సంధ్యారాగము పర్వ ననునేమి వీడు! ఆ మహా కాలమునందు భూతభవిష్యద్వర్తమానములైన విషయ మంతయుఁ బరచఁబడియుండును. దానియందు నీవేమిచేసితివో యదియే నీకుఁ గన్పట్టును. అబ్బబ్బ! నీవుచేసిన రక్తపాతము రక్తపాతమురా? ఇంక ముందెంత యున్నది? అది యంతయు నీ గృహారాజుమేడను ముంచి లేవనెత్తుటకు సరిపోవును.

కోమటివేముని కంటిముందు గృహారాజుమేడ రక్తసముద్రము నందు నడుముబంటిగాఁ గన్పించెను. ఆరక్తము క్రమక్రమముగాఁ బొంగి దానికిఁ బుక్కిలిబంటి యయ్యెను. అది యున్నోత్తు తరంగములు లేపి దాని కిట్టగోడలనొరసి తబకలు గొట్టెను. చివర కామేడ యా రక్త సముద్రమునందు మునిగిపోయెను. ఎంతదూరముచూచిన నా రక్త సముద్రమే. దాని యుత్తాల తరంగములతో తెల్లవాఱునందనుక నాతరం గము లతని మనసునందు లేచుచు విఱుగుచు నుయ్యాల లూగెను.

మఱునాఁ డుదయమునఁ బదిగడియల ప్రొద్దెక్కి మహామంత్రియు శ్రీనాథయ్యయుఁ గోమటివేముని దర్శనమునకు వచ్చిరి. వారిద్దరి మొగములు మ్లానమైయుండెను. కోమటివేముఁడు వారివంక శూన్యముగాఁ జూచెను. అతనికన్నులెఱ్ఱనై నెత్తురు జొత్తిల్లుచుండెను. పదినిముసము లెవ్వరును మాటాడలేదు. ఊరక చిత్రప్రతిమలవలెఁ గూర్చుండిరి. తఱువాత మామిడిసింగన్న మెల్లగా "మహాప్రభూ! ఏమి జరిగినదో వింటిరా ?" యనెను.

కో. వే :— నేనేమియు వినలేదు. మీరు దేనిని గుఱించి చెప్పుచుంటిరో నాకుఁ దెలియదు.

మా. సిం :— మన యాస్థాన గౌరవము మంటఁ గలిసినది. ఆ కుమార కొమరగిరిని దురగారామయ్యగారు తుదముట్టించినారు. శ్రీనాథయ్యగారు వానిని నిశ్శంక కొమ్మన్నగారి కప్పగించిరి. ఆమఱునాఁడే యతఁడు చనిపోయెను. అతనికిఁ దురగా రామయ్యగారు విషప్రయోగము చేయించెనట. అది యేదియో మెల్లగాఁ బనిచేయు విషము. ఇట్లు జరుగునని శ్రీనాథయ్యగా రూహించియుండలేదు. ఊహించినచోఁ దగినజాగ్రత్త పడెడివాఁడే. తురగా రామయ్యగారు కాకరపర్తిదాక శ్రీనాథయ్యగారి వెంటఁబోయి యీదురాగ్మార్గ మాచరించెను. అతఁడు సూదకారులలో నొకనిని గట్టుకొని వానికి విషము పెట్టించెను. తానేమియు నెఱుఁగనట్లు వెనుకకుఁ దిరిగివచ్చెను.

కోమటివేముఁడు గ్రుడ్లప్పఁజెప్పి వినుచుండెను. అతని చూపులలోఁ జైతన్యములేదు. అతఁడు మాటాడుటకుఁ బ్రయత్నించెనుగాని నోటమాట పెగులలేదు. ఆ నో రెవ్వరో పట్టుకొని గట్టిగా నొక్కినట్లతఁడు భావించెను. మఱలఁ బదినిముసములు నిశ్శబ్దముగాఁ గడచెను. శ్రీనాథుఁడును మామిడిసింగన్నయు నీరవులై వేమునివంక జూచు

చుండిరి. వేముఁడు బలవంతముగామాట పెగుల్చుకొని మీరు నాకేల కబురు చేయలే" దనెను.

శ్రీ :– అయ్యో ! కబురుచేయ కేమి ? కబురుచేసితిమి. వాఁడె వాఁడో రేవంతులకుట్టి వాఁడు. పాతికేండ్లుండును. వానిపేరు నాకుఁ దెలియదు. వాఁడు పరమవిశ్వాస్యుఁడుగాఁ గన్పించినాఁడు. వానిచేతఁ గబురంపితిని. వాఁడు రాలేదా ?

కోమటివేముఁ డాతురముగా "వాఁడా వాఁడా ! ఆముదుసలి స్త్రీ కుమారుఁడా ? అవునవును వాఁడే యయి యుండవచ్చును. ఆముదుసలి యానాఁడు నాతోనన్నది శ్రీనాథయ్యగారి యొద్దనుండి వాఁడేదో కబురు తెచ్చినాడని. పాపము వానినిగూడ వాతమూర్చిరి కాబోలు" ననెను.

మా. సిం :– మహారాజా ! రాజ్యమునందంతటఁ బ్రజలందఱు నొక్కపెట్ట ఘోషిల్లుచున్నారు. వారి ధనధాన్య పశుసంపదలు నిర్దాక్షిణ్యముగాఁ గొల్లగొట్టఁ బడుచున్నవి. ప్రభుత్వమంతయుఁ దురగా రామయ్యగారి చేతిలోనికిఁ బోయినది. నేనేమియుఁ చేయలేకున్నాను. నాకు యువరాజులు దర్శనమిచ్చుటయే మానివేసిరి. నేనుగూడ నచటికిఁ బోవుటయే లేదు. ఈమహాఘోరమును మనస్సునైచి యూరకుండ రాదు. దీని నెట్లైనఁ దుదముట్టింపవలెను. ఈరాజ్యమున నుంచుట కష్టమై బ్రాహ్మణు లగ్రహారములు వీడిపోవుచున్నారు.

కో. వే :– నాకిదియంతయు నగమ్యగోచరముగా నున్నది. అంతయు నొక యింద్రజాలముగానున్నది. సింగన్నగారూ ! మనమను కొన్నట్లేదియు జరుగుటలేదు. అదియేదియో యెందుకో మనకన్నుల యెదుట జరజర జరిగిపోవుచున్నది. దానికి మనము చేయగల్గిన

దేమియులేదు. విచారించి ప్రయోజనములేదు. మనమెంతవిచారించినను తుదకు మిగులునది యీవిచారమొకటే. తక్కినదంతయుఁ గాలాధీనము. ఈగోలయంతయు మనకేల ? ఆదింపిన బరువు దింపనే దింపితిని. మఱల నెత్తిపై నెక్కించుకోలేను.

మా. సిం :— ప్రభువులతో విన్నవించితిమి. మీదఁదమ చిత్తము. నేనిన్నాళ్ళు మీయొద్ద మంత్రిత్వము నెఱపితిని. మాతండ్రి ధర్మాన్న వేమన్నగారియొద్ద మంత్రిత్వము నెఱపెను. మాతాత ప్రోలయ వేమారెడ్డివారియొద్ద మంత్రిత్వము నెఱపెను. కాటయవేముని తోడి పగవల్ల నేను మీయొద్ద మంత్రినైతిని. నా కాతనితోడి పగ తీరినది. ఈరాజ్యము నాచేతిమీదుగా నాశముగానేల ? ఈమంత్రిత్వమును వదలిపెట్టి నేను బోవుచున్నాను. నాకు సెలవిప్పింపుఁడు.

కోమటివేముఁడు మాటాడలేదు. పదినిముసములైన తర్వాత నతఁడు మీరెచటికిఁ బోయెదరు ? ఇచటనే యుండురుగదా ? యనెను.

మా. సిం :— నేనిచ్చట క్షణముయుండునదిలేదు. నేనూరక యీలౌకిక్యవృత్తిని బగకొఱకుఁ గొనితెచ్చుకొంటిని. దీనిని వదలి నాపాండిత్యము నాకుండనేయున్నది నాకు సెలవిప్పింపుఁడు. నేను బోయెదను.

శ్రీనాథయ్యయు మామిడి సింగన్నయు సెలవుదీసికొని వెడలి పోయిరి.

౧౪

మఱి పదిదినములుగడచి రాజమహేంద్రవరమునుండి యొక వార్తవచ్చెను. ఆ వార్తప్రకార మల్లాడరెడ్డి గొప్పసైన్యమును గూర్చి

కొని రాజమహేంద్రవరముపైకి నెత్తివచ్చుచున్నాఁడట. అతనికి గజపతిగూడ సాయము పంపుచున్నాఁడట. కుమార కొమరగిరిని విషము పెట్టి చంపించిరని యాప్రాంతపు సామంతులందఱు నన్న దేవచోడునిఁ గంటగించుకొని యల్లాడరెడ్డివైపు చేరిపోవుచుండిరట. రాజమహేంద్రవరమున నాంతరంగికముగా నప్పుడప్పుడు ప్రజలు తిరుగుబాటు సేయుచుండిరట. రాజ్యమునందంతటను నల్లాడరెడ్డి యన్న నాభిముఖ్యము దినదినము వృద్ధిగాంచుచుండెనట. పట్టిసమున వేంచేసియున్న వీరభద్రస్వామిభక్తుఁడును దమ కులగురువు నగు ఘోండెరాయభీమేశ్వరుని నల్లాడరెడ్డి యాశ్రయించెనట. ఘోండెరాయభీమేశ్వరుఁడు నలుబది దినములు నిద్రాహారములు వర్జించి పాశుపత దీక్షలోఁ గూర్చుండి వీరభద్రు నుపాసించెనట. వీరభద్రుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "నీ శిష్యున కనుకూలమగు రోజులు. రాజమహేంద్రవరముపైకి నెత్తిపొమ్మనుము తప్పక జయములభింపఁగల" దని చెప్పెనట. కుమారకొమరగిరి మరణమునకిదితోడై దుర్వారి రెడ్లందఱు నావేశముతో సమకట్టి వచ్చుచుండిరట. అన్న దేవచోడుఁడు తనకు సాయము పంపవలసినదని రాచకొండ దేవరకొండ వెలమదొరలకుఁగూడఁ గబురు చేసెనట.

ఈవార్తవిని రాచవేమునకు మిక్కిలి కోపమువచ్చెను. అతఁడు తురగా రామయ్యకుఁ గబురుపంపిన సంగతియంతయుఁ జెప్పి సైన్యమును సన్నద్ధము సేయుమని యాజ్ఞాపించెను. తురగా రామయ్య "మహాప్రభూ! మన మీమారీ దుర్వారిరెడ్లను దుంపనాశనము చేయవలయును. అప్పుడెట్లును మామిడి సింగన్నగారు పోయి యశ్వపతితో సంధిచేసికొని వచ్చిరిగదా! వారి సాయమునుగూడ మన మిప్పుడుపయోగించుకొనిన మనపని తేలికపడు" ననెను.

రాచవేముడు మామిడి సింగన్నగారికొఱకుఁ గబురు వెట్టెను. కాని యాయన యూరిలో లేఁడు. ఆయన గృహమును విడిచియేఁగి పదిరోజులైనది. ఎచ్చటికిఁబోయెనో యెవరికినిఁ దెలియదు. అదివిని రాచవేమునకు మిగుల నాశ్చర్యము గలిగెను. ఈ మామిడిసింగన్న గారెచ్చటికిఁ బోయినట్లు? ఒకవేళ ఆయనకు నాపైఁ గోపమువచ్చి యుండు. అతఁడిట్లనుకొని ప్రగడయ్యగారికి గబురువెట్టెను. ప్రగడయ్య వచ్చెను. రాచవేముఁడు మామిడి సింగన్నగారిని గుఱించి యడిగెను.

ప్రగడయ్య :- మహాప్రభూ! ఆయన యెచటికిఁ బోయెనో యెపుడువచ్చునో తెలియదు. పోవునప్పుడు చెప్పికూడఁ బోలేదు.

రా. వే :- మఱి మాకాయనతో నిప్పుడు పనిగల్గినది. ఆయనకు మాఱు మీరుపోయి యాకార్యమును నెఱవేర్చవలసి యుండును.

ప్ర :- మహామంత్రియే చేయవలసినచో నది మిక్కిలి గడ్డు పనియై యుండును. అది నాబోంట్లవల్ల నేమగును? తురగా రామయ్య గారిని బంపకపోయితిరా?

రా. వే :- ప్రగడయ్యగారూ! మాపై మీకుఁ గోపమేల! తురగా రామయ్యగారి కాపని ముక్కు మొగము దెలియదు. మీరే పోవలసియుండును.

ప్ర :- ప్రభూ! మేము మీయుప్పు దినుచుంటిమి. మీపై మాకుఁ గోపమెందుల కుండును? కోపముగాని దయగానికల్గిన మీకుఁ గల్గవలయును. మేము సేవకులము. మీనిగ్రహానుగ్రహముల ఫలిత మనుభవించ వలసినవారము.

రా. వే :- మీరేదో మనస్సులోఁ బెట్టుకొని మాట్లాడు చున్నారు. మహామంత్రియందు మాకెప్పుడును గౌరవభావమే. ఆయన

కేవోయకారణముగ మాపైనిగోపము గల్గినది. నే నాయన యెచ్చట నుండెనో వెదకించి యాయన మనసులోని కోపమును బోగొట్టుటకుఁ బ్రయత్నించెదను. ఇప్పుడు గార్యము తలమీఁదికివచ్చి కూర్చున్నది. మీరు పోయి నెరవేర్చుకొని రండు.

ప్రగడయ్య మాటాడలేదు.

రా. వే :— రాజమహేంద్రవరముపైకి నల్లాడరెడ్డి యెత్తివచ్చుచున్నాఁడట. వానికి సాయముగా గజపతి వచ్చుచున్నాఁడట. నేని సాయంతనమే సైన్యములను దీసికొని యన్నదేవచోడునికి సాయము పోవుచుంటిని. మీరు కలబరిగ పట్టణమునకుఁబోయి యశ్వపతులు గూడ సాయమువచ్చు నేర్పాటు గావింపుఁడు.

ప్రగడయ్యమఱల మాటాడకూరకుండెను.

రా. వే :— ప్రగడయ్యగారూ ! మీరు మాటాడరేమి ; ఈ కార్యము మహామంత్రి, తప్పినమీరు, మీయిద్దఱిలో నెవరో యొకరు పోయినఁగాని నెఱవేఱనిది. మీరు కష్టసమయములో సద్దుపడకుండ నూఱకుండిన నెట్లు ?

ప్ర :— మఱేమియులేదు. నే నెట్లును బోయెదను. అన్నగారు పోవలసిన పనిగదా నావల్లనగునో కాదో యని విచారించుచుంటి నంతే. రే పుదయమే బయలుదేరిపోయెదను.

ప్రగడయ్య సెలవుదీసికొని వెడలిపోయెను. తురగా రామయ్య సైన్యములను సన్నాహపెట్టివచ్చి రాచవేమున కాసంగతియెఱిగించెను. రాచవేముఁడు " నేను రాజమహేంద్రవరము పోవుచుంటిని. ఈప్రక్క మఱల విజయనగరరాజు లెత్తివచ్చెదరేమో ? యెట్ల " నెను. తురగా

రామయ్య "మహాప్రభూ! నే నుంటినిగదా యీసంగతి యంతయు నేను జూచుకొందును. మీ రెందులకు మీరుపొండ" నెను. రాచవేము డా సాయంకాలము సైన్యమునుదీసికొని కొండపల్లివైపు పోయెను.

ఆసాయంతనము ప్రగడయ్య కోమటివేముని మందిరమునకుఁ బోయి సంగతి యంతయు నాతనికి నివేదించెను. కోమటివేముని ముఖ మున మార్పేమియుఁ గన్పింపలేదు. అతఁ డది యంతయు మిక్కిలి సామాన్యముగా స్వీకరించెను. కడకుఁ బ్రగడయ్య రాచవేముఁడు తనకుఁ గబురువెట్టి కలబరిగె పట్టణమునకుఁ బొమ్మన్న సంగతి చెప్పెను. అది గూడ నతని కేమియుఁ బట్టలేదు. అతనికిఁ బట్టినదియొ కేయొక యంశము. అది మామిడి సింగన్నగా రెచ్చటికిఁ బోయిరో యెవరికిఁ దెలియదన్నది. ఆమాటవిని కోమటివేముఁడు మిక్కిలి కదలిపోయెను. ప్రగడయ్య కథస మంతయు విన్నతఱువాత నతఁడు మామిడి సింగన్నగా రేమైయుండు నని యడిగెను. అతని కంఠస్వరమునందు గాద్గద్యము పొడకట్టెను. "నేను నాయనయుఁ జిన్నతనమునుండి స్నేహితులము. కాటయవేము నితో కలహించినప్పటినుండి యాయన నాయొద్ద మంత్రిగా నుండెను. కాటయవేముడు నన్ను నిద్రపోనిచ్చినాఁడు గాదు. సింగన్నగారి మంత్రిత్వమువల్ల నే నాకష్టములన్నియుఁ గడచిగట్టెక్కితిని. నిజముగా నాయనయే నన్నీకొండవీటి సింహాసనముపైఁ బెట్టెను. ఆయన ప్రతిభ ముందు శత్రుబలమంతయు నీరై ప్రవహించినది. ఆయనవంటి దక్షుని నేనెచ్చటను జూడలేదు. ఆయన చాలస్వతంత్రుఁడు. నేనిచ్చట క్షణ్ణమైన నుండునది లేదని యాయన చెప్పినప్పు డూఱకోపముచే నన్నాఁ డను కొంటిని. కడ కాయన యన్నంతపనిచేసెను. ఆయన యెచ్చటికిఁబోయి యుండెనో? బహుశః ఆపెద్దియజ్వగారి యొద్దకుఁ బోయియుండును. పెద్దియజ్వగారుగాని యాయన కొమరుఁడుగాని మఱల మనయూరు

రాలేదు. వసంతోత్సవములలో నాయన వచ్చునేమో యని విచారించితిని. శ్రీనాథయ్యగారు తానాయనకుఁ గబురు పంపితిననియు నాయన సన్యసించెననియుఁ జెప్పెను. సర్వవిధముల సింగన్నగారాయనయొద్దకే పోయియుండును. ఆయన పోవునప్పు డననేయన్నాఁడు. ఈలోకమును బగవల్లనే తెచ్చుకొంటిని. దీనిని వదలిన నాపాండిత్యము నాకుండనే యున్నదని." ప్రగడయ్య "నేను గోల్కొండ యగ్రహారమునకు గబురు చేసెదను. అన్నగారచ్చట నున్న దప్పక రాఁగలరు. మఱి యీలోపలఁ గలబరిగె నేను వెళ్ళకుండుట యుక్తమేమో" యనెను.

కోమ. వే:— ప్రగడయ్యగారూ! ఆయనసంగతి మీకుఁ దెలియదు. ఆయన మఱల వచ్చునని నాకు నమ్మకములేదు. ఆయనగూడ సన్యసించియుండుననియే నాతలంపు. కారణములన్నియు నగపడుచున్నవి. ఆయనగాని నేనుగాని పగవల్ల నింత నుమకారము పెంచుకొంటిమి. ఆపగ తీరిపోయినది. మాకు లోకముపైన రుచియేముండును? మామనసు లిదివఱకే సన్యసించెను.

ప్రగడయ్య యొకనిట్టూర్పు విడిచి మఱి నన్నిప్పుడు కలబరిగె పొమ్మందురా? యనెను.

కో. వే:— పొమ్మనుటకు నేనెవఁడను? పైగా దానిని గుఱించి నాకంత పట్టింపులేదు. నాకుఁ గావలసినదెల్ల నొక్కటియే. మీరు మామిడి సింగన్నగారిని జూచుట తటస్థించిన యెడల నొక పర్యాయము వచ్చి నన్ను జూచిపొమ్మనుఁ డంతే.

ప్రగడయ్య సెలవుదీసికొని వెడలిపోయెను.

మఱిపదునైదు దినములుగడచి రాచవేమునిసైన్యము లల్లాడరెడ్డి సైన్యమును వేంగిమండలములోని రామేశ్వరమునొద్ద నెదుర్కొనె

నని వార్తవచ్చెను. అల్లాడరెడ్డి సైన్యము లెక్కకు మిక్కుటముగా నుండి మిక్కిలి యుత్సాహముగా బోరుచుండెనట. అన్నదేవచోడు నికి రాచకొండ దేవరకొండల వెలమలుగూడ సాయము వచ్చిరట. కాని యన్నదేవచోడుండు ద్విముఖమైన గాడి నెదుర్కొనవలసి వచ్చెనట. ఆప్రక్క గజపతి యల్లాడరెడ్డికి సాయముగా రాజమహేంద్ర వరమును ముట్టడించెనట. రాచవేముండీ సంగతి తురగా రామయ్య గారికిఁ జెప్పి యింకను నదనపు బలములు పంపుపేర్పాటు గావింపుడని గబురంపెను.

తురగా రామయ్య రాత్రింబవళ్ళు సైన్యమును సమకూర్చుకొను టతో సతమత మగుచుండెను. ఎక్కటి వాంఛను కై జీతగాండ్రను విశేష ధనమునకుగాని దొఱకుటలేదు. ప్రజలనుండి బలవంతముగా వసూలు చేసిన ధనము కోశగారములునిండి యుండెను. తురగా రామయ్య వెనుదీయక యాధనమంతయు వ్యయపెట్టి సైన్యము ప్రోగుచేసి రామే శ్వరరంగమునకుఁ బంపుచుండెను. మఱిపదిపదునైదు దినములుగడచెను. ప్రగడయ్య కలబరిగెనుండి తిరిగి వచ్చెను. బామినీ సుల్తాను నలుబది వేల గుఱ్ఱపు రాణువను, రెండువేల హాస్తికులను రాజమహేంద్రవరము నకు సాయము పంపునేర్పాటు గావించి వచ్చితినని యతఁడు తురగా రామయ్యతోఁ జెప్పెను. తురగా రామయ్య ప్రాణ మించుక తేలిక పడెను. ఆ సాయంతనము ప్రగడయ్య కోమటివేమునియొద్దకుఁ బోయి యాసంగతి వివరించెను. కోమటివేముఁడు సింగన్నగారిని గుఱించి యడి గెను. ప్రగడయ్య — మహాప్రభూ! నాకాయున జాడ తెలియలేదు. కాని నవులూరునొద్ద పెద్దియజ్వగారి కుమారుఁడు రామచంద్ర జ్యోతి షకుఁడు కన్పించినాఁడు. నేనాయన నడిగితిని. ఆయన " పెద్దియజ్వ గారు సన్యసించి యెటకో వెడలిపోయిరనియుఁ, గాని చాతుర్మాస్యలకు

వారమువానతికిఁ బోనుద్దేశించిరనియు సింగన్నగారాయనతో నున్నచో నప్పు డచ్చటికి రావచ్చుననియుఁ జెప్పె" ననెను. కోమటివేముఁడు "చాతుర్మాస్యాలు ప్రారంభమగుట కింక నెలదినము లున్నది గదా? ఈలోపల నచ్చటచ్చట వెదకింపుఁ" డనెను.

మఱి వారముదినములు గడచినతర్వాత మోటుపల్లినుండి విజయనగరరాజు లెత్తివచ్చుచున్నారని వార్తవచ్చెను. వారికిఁదోడు కంమకూరు రెడ్లుగూడ వచ్చుచున్నారట. మఱియొకవిశేష మేమనగా? ఈమాఱువిజయనగర సైన్యములకుఁ బ్రౌఢదేవరాయలే నాయకత్వము వహించి నడపుచుండెనట. ఈవార్తవిని తురగా రామయ్యను గుండె తల్లడమయ్యెను. అతని కేమి చేయవలయునో తోఁచలేదు. అతఁడు రాయపనాయనికొఱకు గజరావు తిప్పనాయనికొఱకుఁ గబురువెట్టెను. రెండురోజులలో వారిద్దఱును వచ్చిరి. గజరావు తిప్పనాయఁడు మూనిడి సింగన్నగారినిగుఱించి యడిగెను. తురగా రామయ్య "ఆయన యెచ్చటికో చెప్పకుండఁ బోయెననియు బహుశః మతిచలించి యుండవచ్చు" ననియు జెప్పెను. గజరావు తిప్పనాయఁడు "అయినచో రాజ్యభారమంతయు మీపైనే పడినదన్నమాట. ఆయనయున్నచో నాయశ్వపతులను నేదోవిధముగా విద్యానగరముపైకిఁ బురికొల్పి మనకీ బెడఁ దప్పించి యుండెడివాఁడు. మీకేమో వారితోఁ బరిచయములేదాయె" ననెను. రామయ్య తాను బ్రగడయ్యను బంపి యశ్వపతుల సాయమును రాజమహేంద్రవరమునకుఁ బంపినయుదంతమును జెప్పెను. తిప్పనాయఁడు "సరే! నేనును రాయపనాయనింగారును మోటుపల్లి పోవుదుము. అచటికిఁ బ్రౌఢదేవరాయలుగూడ వచ్చుచుండెననుచున్నారు గదా! మనబలము వారి నెదుర్కొనుటకుఁ జాలదు. కొండపల్లినుండి యడనప్పు బలములు పంపుఁడని మాచారెడ్డిగారికిఁ గబురుచేయుఁ"

డనెను. ఆసాయంకాలమేగజరావు తిప్పనాయఁడు రాయపనాయనితోఁ గలసి మోటుపల్లి బయలుదేరెను. మఱునాఁడు మాచారెడ్డికిఁ దురగా రామయ్య కబురుచేసెను. కాని మాచారెడ్డి తన బలములనన్నియు రామేశ్వరము పంపెననియుఁ దాను మాత్రము బయలుదేరి కొండవీడు వచ్చుచున్నాననియు గబురంపెను.

ఇదియిట్లుండగామఱల నిరువురు సుంకకరణములను సమయముల వారు చంపిరని వార్త వచ్చెను. అది వచ్చిన యొక పదిగడియలకు నద్దంకి మండలమునఁ బ్రజలు సుంకరులపైఁ దిరుగుబాటు చేయుచున్నారని వారి నణచుటకు సైనికబలములను బంపవలసిన దని కబురు వచ్చెను. తురగా రామయ్య గిజగిజలాడిపోయెను. ఈయుద్ధముల యెద్దడి తప్పిన తఱువాత నీ సమయముల వారిని బట్టుకొని యురితీయించవలయు ననియు నద్దంకి మండలములోని యూళ్ళ నన్నియుఁ దగులబెట్టించ వలయుననియు నతఁడనుకొనెను. ఆమాటలనుకొనుచుండగా గృహారాజు మేడ కట్టు శిల్పులువచ్చి తమకీయవలసిన ధనమిమ్మని యడిగిరి. తురగా రామయ్య కొండలు దెలియలేదు. అతఁడు "మిమ్ము మేడగట్టుఁ డని యెవరేడ్చినారు ? మీ మేడ మీరు కూలిపోను. దినదినము మీకెక్కడ లేని ధనము గ్రుమ్మరించలేక నుంప తెగిపోవుచున్న" దని విసివికొనెను. వారుపోయి యా మాటలుకోమటివేమునితోఁ జెప్పిరి. కోమటివేముఁడు ప్రగడయ్యకుఁ గబురుపంపి తురగా రామయ్యను మందలించుఁడని చెప్పెను. ప్రగడయ్య "ప్రభూ ! తురగా రామయ్యగారు నాచే మంద లింపఁబడుస్థితిలో లేఁ" డనెను. కోమటివేముఁడు తురగా రామయ్యకుఁ గబురంపెను. తురగా రామయ్య వేమునియొద్దకుఁ బోయెను. వేముఁ డతనిని జూచి "రామయ్యగారూ ! నేను దక్కినయన్ని విషయములు వదలుకొంటిని. ఒక్క గృహరాజుమేడను బూర్తిచేయించవలయునని

మాత్రము నాకున్నది. దీనికిమాత్రము మీరడ్డురాకుఁడు మీరేమో శిల్పులను దిట్టి ధనమీయనన్నారట" యనెను. రామయ్య "మహాప్రభూ! నేను ధనమీయ ననలేదు. అప్పుడేదో పనితొందరలో నుండి విసివికొంటినంతే." యనిచెప్పి తప్పించుకొనెను.

మఱునాఁడు మాచారెడ్డివచ్చెను. ఆనాఁటి సాయంకాలమే విజయనగర సైన్యములు పానుగల్లు దుర్గమును ముట్టడించిరను వార్త వచ్చెను. పానుగలుదుర్గము భామినీ రాజ్యములోనిది. అశ్వపతి యన్న దేవునికి సాయము పోయినాడన్న వార్తవిని ప్రౌఢదేవరాయలు వాని నీ ప్రక్కకు మఱలించుటకై పానుగల్లు దుర్గమును ముట్టడించి యుండునని తురగారామన్న యూహించెను. అచ్చటికిఁ జౌండపామాత్యుఁడు కూడ వచ్చినాఁడట. చౌండపామాత్యుఁడు పూర్వము మోటుపల్లియొద్ద వెన్నిచ్చెను గావున నీమాఱు తనని నటుపంపి ప్రౌఢదేవరాయలిటు మోటుపల్లి వచ్చియుండును. తురగారామన్నకేమి చేయుటకును బాలుపోలేదు. మాచారెడ్డి తానుగూడ మోటుపల్లికిఁ బోవుదుననెను గాని రామయ్య "మీరుగూడ నచటికిఁ బోయినచో నిచట నాకుఁ గాలుసేతు లసలేయాడ" వని వాని నాపెను.

మఱి పదిరోజులైన తర్వాత రామేశ్వరరంగమునుండి మఱియొక వార్త వచ్చెను. ఆవార్త మిక్కిలి సంచలనము గలిగించెను. అల్లాడరెడ్డి రాజమహేంద్రవరమును జక్రబంధములో నిఱికించినాఁడట. అచ్చటికి వార్తలేమియు రామేశ్వరమునకుఁ దెలియుట లేదట. అశ్వపతిసైన్యములను రాచకొండ దేవరకొండ వెలమసైన్యమునుఁ బోలవరమునొద్ద గజపతిసైన్యము లెదిరించి యోడించెనట. దీనికిఁదోఁడు పానుగల్లుముట్టడి వార్తవినియశ్వపతియు రాచకొండ దేవరకొండల వెలమలును దమ బలములను వెనుక కుపసంహరించుకొని పోవు

చున్నారట. విజయోత్సాహమున గజపతి విజృంభించి పోలవరమును
బట్టుకొని రాజమహేంద్రవరముపైకి విరుచుకొని పడుచుండెనట. రాచవే
మని సైన్యము మాత్ర మింకను నల్లాడరెడ్డి సైన్యమును రామేశ్వరము
నొద్ద నిలువరించి పోరుచుండెనట. పోరు మిక్కిలి ఘోరముగా జరు
గుచు నుభయపక్షములవారికి మిక్కిలి నష్టము గల్గుచున్నదట. దీనికిఁ
దోడు సైనికులలో రాత్రివేళల వీరభద్రస్వామి విరుచుకొనిపడి యన్న
దేవచోడుని సైన్యములను నాశనముగావించుచున్నాఁడని వదంతి
యొకటి వ్యాపించెనట. వారందఱునువీరభద్రుఁడు తమపైగూడ నెప్పుడు
విఱుచుకొని పడునోయను భీతితోఁ బ్రాణములరచేతిలోఁ బెట్టుకొని
పోరాడుచున్నారట.

మఱి నాల్గురోజులయనంతరము రామేశ్వర రంగమునుండి రాచ
వేముని సైన్యములు వెనుదిరిగి వచ్చుచుండెనని వార్తవచ్చెను. రాజ
మహేంద్రవరము సంగతి యేమియు నావార్తలోఁ దెలుపఁబడలేదు.
తురగ రామయ్యయు మాచారెడ్డియు నీవార్తవిని మిక్కిలి తల్లడ
పడిరి. రామయ్య "ఇంతధనము వ్యయపెట్టి తుద కోడిపోతిమే" యని
మిక్కిలి వాపోయెను. ఆనాఁటిసాయంకాలమే పానుగల్లు రంగమునుండి
తమకుఁ గొంతసైన్యమును సాయముగాఁ బంపవలసినదని యశ్వపతి
కబురుపెట్టెను. తురగారామయ్య కేమి చేయవలయునో తెలియలేదు.
అతఁడు ప్రగడయ్యకొఱకుఁ గబురుపెట్టెను. ప్రగడయ్య "వారు మన
మడిగినప్పుడు మనకు సాహాయ్యము పంపిరిగదా మనము పంపనిచో
మిత్రద్రోహముగానుండు నొకటి. రెండవది యీనాఁటితో నిది తీరి
పోదు. అశ్వపతి మిక్కిలి బలవంతుఁడు. అతఁ డెప్పుడో యదను జూచి
మనముచేసిన మిత్రద్రోహమునకు మనపైఁ గసి దీర్చుకొనవచ్చును.
మూఁడవది మన మేదో నామమాత్రపు సాయముపంపి మోటుపల్లిపై

నుండి విద్యానగరరాజుల దృష్టి నటు మళ్ళింపవచ్చు ననెను. తురగా రామయ్య కీయూలోచనము బాగుగానచ్చెను. అతఁడు సూచా రెడ్డితో మీరు గొంతసైన్యమును వెంటఁబెట్టికొని యశ్వపతికి సాయముగాఁ బానుగల్లుపోవుఁడు. మహారాజు వారెట్లు దిరిగివచ్చుచున్నారుగదా. వీలునుబట్టి వెనుకనుండి కొంతసైన్యమును బంపెదనని చెప్పెను. సూచా రెడ్డికిఁ దాను యుద్ధరంగమునకుఁ బోవలయుననియే యుండెను. అతఁడు మాఱుమాట చెప్పక మఱునాఁ డుదయమున గొంతసైన్యమును వెంట బెట్టుకొని పానుగల్లు దుర్గమునకు బయలుదేరెను.

## ౧౫

గృహరాజుమేడ నిర్మాణము పూర్తియయ్యెను. మేడపైనిఁ గత్తిగూడుకూడ నిర్మించుట పూర్తియయ్యెను. గోడలన్నియుఁ బాల గచ్చుచేయఁబడి మొగము నీడచూచుకొని బొట్టుపెట్టుకొనవచ్చు నన్న ట్లద్దమువలెఁ దళతళలాడుచుండెను. ఈగోడల కీనునుపెట్లు తెచ్చిరని కోమటివేముఁడుగూడ నా శిల్పుల పనితనమునకు వెఱగుపడెను. మేడ పైనిఁ బిట్టగోడయందు నలంకారముగఁజెక్కిన ప్రతిమలు జీవకళ లుట్టి పడుచు నా శిల్పుల కళానైపుణ్యమును వ్యక్తముచేయుచుండెను. మేడ వలభులనుండి నుంచిముత్తెములు కుట్టఁబడిన చీనిపట్టు గొసెనలు నానా మణిగణస్థగితములు వ్రేలగట్టఁబడెను. ఆ మణుల ముత్తెముల కాంతు లాకుడ్యములపైఁ బ్రతిఫలించి వెన్నెలలుగాయుచు రాత్రులందుఁగూడ నలముకొనువచ్చు చీకట్లను విదలించివేయుచుండెను. పైనిఁగట్టిన కత్తి గూడు స్వర్ణవికారమై మహార్ఘమై వజ్రములు గోమేధికములు నీల ములు పొదుగఁబడి యాగృహరాజునకుఁబెట్టిన మణికిరీటమువలె ధగ ధగలాడుచుండెను. మేడలోపలఁ గుడ్యములపైన గోమటివేమారెడ్డి పైన భట్టవామనుఁడురచించిన వీరనారాయణచరిత్రమునందలి ఘట్ట

ములు చిత్రితములై మణులపొడియంటింపఁబడి మిలమిల మెఱయుచుండెను. పైకప్పునమధ్యమున నొకసహస్రపత్రకమలము రక్తదళవిభాసితము నవరత్నస్థగితమునందుండి మహాలక్ష్మి యావిర్భవించుచున్నట్లు చిత్రితమై యా మణుల వెల్గులు క్రిందివజ్రకుట్టిమమునఁ బ్రతిఫలించి ప్రోగువడిన కాంతులు పొడవై లక్ష్మీదేవియాకృతిమతియై నిలిచినట్లు ప్రతిభాసించెను. ఆపద్మమున కిరుప్రక్కల రెండుశతపత్రములు మణిగణస్థగితములు వజ్రకుట్టిమప్రతిఫలితకాంతినిరూపిత ముల్లగూరి శక్తిపోతురాజరూపావభాసములు చెక్కఁబడియుండెను. ద్వారములు సువర్ణవికారములు నవరత్నస్థగితములు. వానిమధ్యమున స్వర్ణకుంభములు వ్రేలాడగట్టబడియుండెను. వానికి ముత్యాలగొసెనలు వ్రేలుచుండెను. ఆకుంభములందు జూతదళము లుంచిరి. మేడకుఁ బైనినిల్పిన చిత్రప్రతిమలకు నొకదానినుండి యొకదానికి మణితోరణములు లగింపఁబడియుండెను.

ఆ మేడ సౌందర్యమును దిలకించుటకుఁ దలయెత్తి చూచినచో దలగుడ్డయూడి క్రిందఁబడిపోవునంత యెత్తున్నది. మేడ మేడయంతయు నొంటిస్తంభముపై నిలిచియున్నది. ఆ స్తంభము పండ్రెండుబారల పొడవుగలది యేడుమోకులు ముడివైచి చుట్టుకొని వచ్చినచో నొక చుట్టునకు సరిపోవునంతకై వారముగలది. ఏడు తాటిచెట్టులయెత్తుగలది. ఆ స్తంభ మెప్పుడో యరువదియేండ్లక్రిందటఁ దొలుతగా గృహరాజు మేడ గట్టుదమని యుద్దేశము గలిగినప్పుడు ధర్మాన్న వేమన్నగారు కట్టించినది. దానిపైని మొదటియంతరువు కొమరగిరి కట్టించినది. ఆ స్తంభమునకును నా మొదటియంతరువునకును మఱలఁ గ్రొత్తగాఁ బాలగచ్చుచేసి నవరత్నములు తాపిరి. భవనము భవనమెల్ల నిలువెత్తున దాడిమీఫలస్థూలములైన వజ్రములు తాపఁబడి దూరమునుండి

చూచువారికి సహస్రదీప మంటపమువలె వెలుఁగొందుచుండెను. దాని యాకారమంతయు నొకపొడవైన మానిసితలపైఁ బెట్టెపైనిఁ బెట్టెగా రెండుపెట్టెల నెత్తుకొని నిలుచున్నట్లున్నది. అట్టి గృహరాజుమేడను నిర్మించినందుకుఁ గోమటివేమారెడ్డి పరమానందభరితుఁడయ్యెను. మేడ యంతయు బూర్తియైనది మిగిలినదెల్ల నొకటే. నందికంతపోతరాజు కటారి యామెపై గూడులోనుంచి బిగింపవలయును. ఆ కటారి కుత్సవము చేసిగాని యచ్చట బిగించరాదు. రాచవేముఁడును మాచారెడ్డియును బట్టణమునకుఁ దిరిగి రావలయును. కోమటివేముఁడు వారిరాక కెదురు చూచుచుండెను.

పదిరోజులుఁగడచి యొకనాఁటి యుదయవేళ వార్తయొకటి పానుగల్లు రంగమునుండి వచ్చెను. పానుగల్లురంగమున నశ్వపతికిఁ పెద్ద యోటమి సంభవించెనట. పానుగల్లుకోటనుబట్టుకొనుటకుఁ జౌండపామాత్యుఁడెంతయో సైన్యమును నష్టపెట్టి ప్రయత్నము చేసెను. కాని యతనికి సాధ్యపడలేదు. వెలమవీరుల ధాటికి నరపతిసైన్యములు నిలువలేకపోయెను. చౌండపామాత్యుఁడు యుద్ధముచేసి లాభములేదని గ్రహించి భేదోపాయమునకుఁ దిగెను. అతఁడొకనాఁటి రాత్రివేళ నొంటరిగా బయలుదేరి వెలమల స్కంధావారమును జొచ్చెను. సైనికులు వానిని బట్టుకొని రాజునొద్దకుఁ దీసికొనిపోయిరి. రాజుపేరు పినవేదగిరి. పినవేదగిరి చౌండపామాత్యుని నీ విక్కెందుకు వచ్చితివని యడిగెను. చౌండపామాత్యుఁడు "అయ్యా! మీకును మాకును బ్రత్యక్షవిరోధము లేదు. మీరు భామినీసుల్తానులకు సామంతులగుటవల్ల మనకు మనకు యుద్ధము పొసగినది. న్యాయముగా మనమందఱము నొకటి. ఈభామినీసుల్తానులు మనలను జీలదీసి బలహీనులను జేసిరి. మీరును హిందువులు మేమును హిందువులము. ఈ మహమ్మదీయులు మనమతమునకు శత్రు

వులు. వీరు మన దేశము నాక్రమించుకొని మన గుళ్ళు గోపురములు చెడగొట్టి మన దేవతావిగ్రహములు పగులగొట్టి గోబ్రాహ్మణులను హింసించి మనమతమును నాశము చేయుచున్నారు. మీరును గోదేవ బ్రాహ్మణభక్తిపరులు. మీకు మాత్రమది సమ్మతమా? మావిజయ నగరరాజ్యము ప్రధానముగా భారతీయ ధర్మరక్షణమున కేర్పడినది. ఈ మహమ్మదీయుల పక్షమున మీరు మాతో యుద్ధముచేయుట న్యాయముగా లేదు. మనమందఱము గలిసినచో వీరి నీభూభాగము నుండి పాఱద్రోలవచ్చును. మీరు మాపక్షమునఁ జేరవలసిన" దని నచ్చఁజెప్పెను. తెల్లవారుసరికిఁ బినవేడగిరి సైన్యము లెదురుతిరిగి మహమ్మదీయులతో యుద్ధమునకు దిగెను. ఫలితముగా నశ్వపతి యోడిపోయి వెనుకకు బాఱిపోయెను. అశ్వపతి కాయుద్ధమున జనిగిన నష్టమునకు మితిలేదు. అతఁడు పోవునప్పుడు తనకు ద్రోహమొనర్చిన వెలమలను గాలఁబెట్టి నేలరాచెదనని ప్రతిజ్ఞచేసిపోయెను.

ఆ వార్త వచ్చిన సాయంకాలమే రాచవేముఁడు కొండవీటికి దిరిగి వచ్చెను. అతని మొగమున నెత్తురుచుక్క లేదు. రామేశ్వర యుద్ధమునఁ గలిగిన యపజయమునకు నతఁడు కుమిలిపోవుచుండెనుఁ దీనికిఁదోడు గోరుచుట్టుపై రోకంటిపోటువలె నీ వార్తయతని మనసు నేర్చెను. తురగా రామయ్య కతఁడు కబురుచేసి రాజ్యస్థితిని విచారించెను. తురగా రామయ్య "ప్రభూ! ఈసమయమున వారు మఱల నిద్దఱు సుంక కరణములఁ జంపిరి. అద్దంకిసీమలోఁ బన్ను లీయమని ప్రజలు సుంకరులపైఁ దిరుగుబాటుచేసిరి. వారిని రక్షించుటకు నచ్చటికి సైన్యములను బంపవలెను. అదిగాక మనకిప్పుడు డబ్బుతోడి యవసరము చాల నున్నది. కోశాగారమునఁ జిల్లిగవ్వకూడ లేదు. ఈ యుద్ధముల

తోడ నున్న ద్రవ్యమంతయు వ్యయమైపోయినది. దీనికిఁ దోడీగృహ రాజు మేడ యొకటి" యనెను.

రాచవేమున కామాటలు విని యొడలు మండుకొనిపోయెను. "ఆసమయములవారు సుంకకరణములను జంపుచుండగానీ ప్రజలు పన్ను లెగగొట్టి తిరుగుబాటు సేయుచుండగా మీరు హాయిగాఁ బండుకొని నిద్రపోవుచున్నా రన్నమాట" యని యతఁడు మండిపడెను.

తు. రా :— ప్రభూ! నేనొక్కఁడ నేమిచేయుదును? నాకీసైన్యములను సమకూర్చి పంపుటలో నూపిరితీసుకొనుటకైనఁ దీరుబడిలేక యుక్కిరిబిక్కిరియగుచుంటిని. ఈయొక్కటివాండ్రకు నెక్కడ లేనిడబ్బు గుమ్మరించవలసివచ్చినది. వారికిఁ బూర్వముకంటె నాల్గురెట్లెక్కువ జీత మిచ్చిన గాని దొరుకలేదు. బొక్కసములో ధన మిదివఱకే పోయెను. పాపమా యవచి తిప్పయసెట్టి యడ్డుపడి నగరములవారు ముందునాఁటి కీయవలసిన సుంకములు ఫుల్గురికింద నేబదిలక్షల టంకము లిప్పించినాఁడు గనుక సరిపోయినది. ఆడబ్బువచ్చి తలకాచినది కాబట్టి కాని లేనిచో నిటునటు గద్దుకొనలేకపోయెడివాఁడనే. మఱి యిప్పుడు సమయములవారిపైకి నద్దంకిసీమపైకి సైన్యములనుబంపి సుంకములు వసూలుచేయవలయును.

రా. వే :— ఆసైన్యములనుదీసికొని మీరేపొండు. సమయముల వారి యొద్దనుండి నూటి కెనుబదివంతులు వసూలు చేయుఁడు. వారు నయముగా నిచ్చిరాసరే. లేనిచో బలవంతముగా వారియిండ్లన్నియు దోచికొని వస్తుసామగ్రి ధ్వంసము సేయింపుఁడు. అద్దంకిసీమలోఁ బంటలో నెనుబదివంతులు నేలసుంకము వసూలుచేయుఁడు. వారీయనిచో వారి యిండ్లు దోచికొని రండు.

తు. రా :— ప్రభూ ! అటుల జేసినను బదిలక్షలటంకములైనను రావు. ఆ పదిలక్షలటంకములు వచ్చినను గృహరాజుమేడలో లక్ష్మి యమ్మవారిని నెలకొల్పుటకు సరిపోవును. మఱి శేఱువాతిమాట యెట్లో దైవమున కెఱుక.

రా. వే :— ఆ నగరములవారిచే మఱికొంతధన మిమ్మనుఁడు. మీఁదటికిఁ జూచుకొందము.

తు. రా :— ఏమిచూచుకొందము ? ఎప్పటికైన నీచిక్కుండనే యున్నదిగదా ? వారుమాత్ర మెందాక నిత్తురు ? కాబట్టి యది పద్ధతి గాదు. ప్రభూ ! ప్రజలయొద్ద బంగారము చేరుకొనిపోయినది. మన మేదియో యుపాయముచేసి దానినంతయు రాబట్టవలెను. బద్దెన చెప్పి నట్లు కూడబెట్టిన హేమము భూమీశులపాలుగదా !

రా. వే :— వారియొద్ద నీవఱకే నూటికేబదివంతులు సుంకము పుచ్చుకొంటిమి గదా. ఇప్పుడు వేఱ యేయుపాయముచేత ధన మాకర్షింతుము !

తు. రా :— నేనదియే యాలోచించినాను. మన మింతవఱకుఁ బ్రజలపైన నేలసుంక మొకటే విధించుచున్నాము. ఇప్పుడట్లుగాక క్రొత్త సుంకములువిధింపవలయును. ఇంటిసుంకము, వాహనముసుంకము, పెండ్లి సుంకము, పురిటిసుంకము, తలసుంకము నింతవఱకు విధించిన నుత్తమ ముగా నుండును. నేను రేపుదయమే బయలుదేరి యద్దంకిసీమకుఁబోయె దను. మీరు మోటుపల్లి మాదిరెడ్డిగారికి సమయముల వారియొద్ద బలవంతముగా సుంకములు వసూలుచేయుఁడని కబురుచేయుఁడు. నేను రేపుదయమే పోవునప్పుడు క్రొత్తపన్నులు వసూలుచేయుఁడని సుంక కరణముల కాజ్ఞను బంపెదను.

తురగా రామయ్య వెడలిపోయెను.

మఱునాఁడు మాచారెడ్డి పానుగల్లునుండి తిరిగివచ్చెను. అతఁడు దెబ్బతిన్న పులివలె నుండెను. అతఁ "డానాను నే నెప్పుడో యిట్లు జరుగునని యనుకొంటిని. నే ననుకొన్నట్లే మా వెలమలు స్వామిద్రోహ మాచరించిరి. సరే సమయమురాదా! వీరెచ్చటికిఁ బోవుదురు? ఒక ప్రక్క యశ్వపతి, యొకప్రక్క మనము రెండుప్రక్కల రెండుచేతులతో వెలగకాయను బట్టుకొని నొక్కినట్లు నొక్కెదము. అప్పు డీవిజయనగర రాజు లడ్డుపడుదురేమో చూచెదను. ఇప్పుడెందుకులే యని తల యొడ్డి గల వేసికొని వచ్చితిని. ఆ పినవేదగిరి వాని బ్రతుకునకు వాఁడు మనల నధిక్షేపించుటా! సరే కానీలే వానిరోజులు బాగున్నవి. నే నేమిచేయుటకు వీలుతప్పి వచ్చినది. వాఁడు తప్పుకొని పోయినాఁ" డని తల యూచెను. కోమటివేమఁ "డతఁ డేమని యధిక్షేపించె" నని యడిగెను.

మాచారెడ్డి :— మన మేదో నాగలిదున్నుకొను పంటరెడ్లమట. మననాగరికత నాగలినాగరికత యటు. మన ముత్తాత ప్రోలయ యొక వైశ్యుని మోసముచేసి ధనికుఁ డయ్యెనట. ఆవైశ్యుఁడు పిశాచమై బట్టుకొని పీకుకొని తినగా వానిపేరు తరముల వెంటఁ బిల్లలకుఁ బెట్టుకొనునట్లు మ్రొక్కుకొన్నాఁడట. దానితో మనము రాజులమైపోతిమట. నేను నీవన్న దానికి సమాధానము మాటలతోఁ జెప్పి యేమిలాభము లే. మీకు సమాధానము చెప్పుట కిదిసమయముగాదు. నీయిష్టమువచ్చినట్లు ప్రేలుము. నేను మాటాడనంటిని. ఆ మఱునాఁడే యతఁడు విజయనగరరాజు పక్షమునకుఁ దిరిగిపోయినాఁడు.

నాఁటి సాయంకాల మగుసరికి మోటుపల్లినుండి యొకవార్త వచ్చెను. గజరావు తిప్పనాయఁడు రాయపనాయఁడు విజయనగర

సైన్యములను బూర్తిగాఁ దరిమివేసిరట. వారచ్చటనుండియే మాచెర్ల పోయిరట. కాని యాయుద్ధములో నుభయపక్షములవారికి విపరీతనష్టములు సంభవించెనట. విద్యానగర సైన్యములు పోవునప్పు డాప్రాంతముల యూళ్ళనన్నిఁటిని నిర్మూలము గావించిరట. జనులందఱును దినఁ దిండికట్టబట్టలేక హాహాకారములు చేయుచున్నారట. ఇతరప్రాంతముల నుండి కనీసము వారికి నాహారమైనను బంపు నేర్పాటు చేయించనిచో నరాజకమగునని మాదారెడ్డి కబురుచేసెను.

కోమటివేమారెడ్డికీ వార్త లేవియుఁ బట్టలేదు. అవియన్నియు వానిమనసునం దొక వికారమును గల్పించలేదని చెప్పలేముగాని యా వికారములు క్షణమాత్రముండి తేలిపోయెను. అతని కొక్కటియే గాఢమైన విశ్వాసము. గృహరాజుమేడను బూర్తిచేసి యందు లక్ష్మీదేవిని స్థాపించినచోఁ గొండవీట లక్ష్మీదేవి స్థిరపడి రెడ్డిరాజ్యము తనవంశమున స్థిరపడును. ఈయొక్క విశ్వాసము నీయొక్క యాశ యాకసమున నెగ్సిన యతనిదృష్టిని సూత్రముతో బంధించి భూమిపైకి లాగెను. అతనిదృష్టి రెక్కలు గట్టుకొని యాకసము చివళ్ళకు నెగిరిపోవునుగాక; ఎంతదూరమెగిరినను నీసూత్రమును నది త్రెంచుకొనలేదు. ఆ సూత్రము దానిని గ్రిందికి లాగుచునే యున్నది.

ఆ గృహరాజుమేడ కట్టుట పూర్తియైనది. నందికంత పోతరాజు కటారిని బైన బిగించవలయును. ఇంక నాకొంచెము మిగిలియున్నది. మాచారెడ్డి రానే వచ్చినాఁడు. మఱి రెండుమూడు దినములలో మంచిది చూచి యాకొంచెము పూర్తిచేసికొనవలయును.

నాఁటిరాత్రి కోమటివేముఁడు మేడపైని దిరుగుచు నిట్లు తలపోయుచుండెను. అతఁ డొకపరి తలయెత్తి పశ్చిమముగా జూచెను. ఆలుదిక్కున గృహరాజుమేడ యాచీకటిలో ధగధగలాడుచు మణు

కుప్పవోసినట్లు ప్రకాశించుచుండెను. వేమునిమనసు మాచారెడ్డి మాటలవంకకు బర్వెత్తెను. అవునవు నా వేదగిరి యాక్షేపించినది నిజమే. నాచిన్నతనమున మాతాత తన తొడపై నన్ను గూర్చుండ బెట్టుకొని యీ పరుసవేది కథ చెప్పుచుండెడివాఁడు. ఆయన కప్పుడు పదియేండ్లవయసుండెనట. ఆయనతండ్రి ప్రోలయ్య యద్దంకిలో చిన్న భూస్వామియట. ఒక రోజున సాయంకాల మొక వైశ్యుఁడు వారి యింటికి వచ్చెనట. అతఁడరణ్యములలోఁ గొండలలో సాధువులతోఁ జాలకాలము గలిసితిరిగి యదియేదియో యొకమణిని సంపాదించెనట. అది పరుసవేది. తాకినదానినెల్ల బంగారము చేయఁగలదట. ఆ కోమటిపేరు వేముఁడు. అతఁడద్దంకివచ్చి వారియింట దిగెనట. పగ లెల్ల నెచ్చటికోపోయి రాత్రులందుఁ దిరిగివచ్చుచుండెడివాఁడట. అతఁడు దినదినము కొంతబంగార మమ్మి గంజాయికొని పీల్చుచుండుట యాయనతండ్రి ప్రోలయ గుర్తించెనట. ఒకరోజున నతఁ డూరిలోనికిఁ బోయిన సమయము గనిపెట్టి యతనిజోలిలో నెంత బంగారమున్నదో చూతమని వెదుకగా నా పరుసవేదిరాయి క్రిందఁబడి ప్రక్కనున్న రాగి చెంబునకుఁ దగిలి దానిని బంగారముచేసెనట. ప్రోలయగారు దఱువాత వీలుచూచుకొని యీ పరుసవేదిని గాజేసి యింటికి నిప్పంటించెనట. కోమటివేముఁడు తిరిగివచ్చుసరి కేమున్నది? ఇల్లంతయుబూడిదకుప్పయై పడియుండెను. ఆకోమటి తనజోలినిగుఱించి యడిగెనట. ప్రోలయగారు ఓయీ! నాయిల్లే కాలిపోగా రక్షించుకొనలేనివాఁడను నీజోలిని దీసి కొనవచ్చితినా? యింటితోనే కాలిపోయిన దనెనట. ఆ కోమటి "యందులోఁ బరుసవేది యున్నది. అది నీవు గాజేసి యింటికి నిప్పం టించితివి. నా పరుసవేది నాకిమ్మని యల్లరిచేసెనట. ప్రోలయగారు "ఓయీ! పరుసవేదియున్నదో బంగారమున్నదో నాకేమి తెలియును? ఆ బూడిదకుప్పలో నున్న వెదికి తీసికొనిపొమ్ము. లేనిచో నావలె

నేడ్చుచు నూరకుండు మనెనట. కోమటి వేముఁడు వెదకికొని యేడ్చుచు నీవే కాజేసితివి. నామణి నాకిమ్ము. ఈయనిచోఁ జచ్చి పిశాచమనై నిన్ను బిల్లపిల్లతరమునఁ బీకికొనితిందునుసుమా! యని బెదరించెనట. ప్రోలయగారు వానిని లక్ష్యపెట్టలేదు. వాఁ డేడ్చుచుఁబోయి దిగులుతోఁ గృశించి కృశించి చచ్చిపోయెనట. వాఁడు నిత్య మాయన కలలోఁ గన్పించి గుండెలపైఁ గూర్చుండి నిన్ను నీవంశమును నాశనముచేసెదనని బెదరించుచుండెడివాఁడట. ప్రోలయగా రెన్ని శాంతులు చేయించు కొన్నను వానిపీడ వదలలేదట. చివర కతఁడు "ఓయీ! నేనేదో యాశచేఁ దప్పుచేసితిని. దానికిఁ బరిహార మేదో చెప్పుము చేసికొందు ననెనట. ఆకోమటి నాపేరు పిల్లపిల్లతరమునఁ బెట్టుకొనుము. నా పరుస వేదితోఁ బొందిన ధనముతో రాజ్యమును స్థాపించి ధర్మముకొఱకుఁ బాటుపడుము. అడబ్బుతో గోదేవబ్రాహ్మణ పూజనము సేయుచు దానధర్మములు చేయుము. అప్పుడు నీ కేడుతరములదాక యీసంపద నిల్చునన్నాఁడట. ప్రోలయగారు వాఁడు చెప్పిన ట్లొప్పికొనెను. తఱు వాత నాయనకు రెండవకుమారుఁడు జన్మించెను. ప్రోలయగా రాయ నకు వేమునిపేరు పెట్టెను. ఆ ప్రోలయగారి కైదుగురుపుత్రులు. వా రందఱు పరుసవేసి పుట్టించినధనముతో సైన్యమును గూర్చుకొని యద్దంకిలో రాజ్యము స్థాపించిరట. మాతాత యప్పు డప్పుడు నాకీ కథ చెప్పుచుండెడివాఁడు. ఏడుతరములు దాటినతఱువాత దేసటిరెడ్లకు రాజ్యము నిలువదు. వారిలో లక్ష్మి నిలువదని కాబోలు ధర్మాత్ము వేమన్నగారు కామేశ్వరియమ్మవారి నుపాసనము చేయఁగా నామె గృహరాజుమేడనుగట్టి యందు లక్ష్మిని స్థాపించి మీారందఱు సేవించి నచో మీా దేసటివంశమున లక్ష్మియు రాజ్యము స్థిరపడునని చెప్పినదట.

కోమటివేముఁడు ప్రోలయయొద్దనుండి రాచవేముని వేఱకు

దరములు లెక్కకట్టెను. అవి యొక వరుస నైదు వచ్చెను. ప్రోలయ రాయనకొడుకు మాచయ, మాచయకొడుకు కోమటి, కోమటికొడుకు తాను, తనకుమారుఁడు రాచవేముడు, ఈలెక్కప్రకారము గృహ రాజుమేడతో నిమిత్తములేకుండ నా వైశ్యుని మాటప్రకారము నింకను రెండుతరములు గడవున్నది. అయినను దాను గృహరాజుమేడను బూర్తి చేసెనుగదా! తనవంశమున లక్ష్మి యెట్లును స్థిరపడినట్లే, ఆకత్తి స్థాపించుటమాత్రము మిగిలియున్నది. అకొంచెమేకదా! అది రేప తెల్లుంటఁ బూర్తియగును.

కోమటివేముఁడు తల్పముపైఁ బరుండి యట్లే యాలోచించు చుండెను. అతని కొడలు తెలియని నిద్రపట్టెను. ఆ నిద్రలోఁ గొంత భాగము సుషుప్తి. జీవకోటి కిరువదిగడియలు నిద్రాకాల మైనచో వానిలో నే రెండుగడియలో సుషుప్తి యున్న నక్కడికి, జాల నెక్కువన్నమాట. తక్కిన కాలమంతయు జాలభాగము స్వప్నదశగానే గడచిపోవును. ఈయిరువదిగడియలు గూడ సుషుప్తి యుండదనుటకు నియమమేమి? ఇరువదిగడియలు సుషుప్తిలోనుండుట యది మహాయోగి లక్షణము. ఇరువదిగడియ లక్కరలేదు. ఇరువదినిముసములు సుషుప్తి యున్నను శరీరమునకు వలసిన విశ్రాంతి కలుగును. మన మేదో నిత్యము మనకు స్వప్నములు రావని భావింతుముగాని మననిద్దురలో నెక్కువభాగము స్వప్నముగనే గడచిపోవును. ఈ స్వప్నములలో మనము నిద్రించుటకు బూర్వము మనమనసునందు, దిరిగిన యాలోచనమంతయు గోచరించును. తఱువాత దానికి సంబంధించిన పూర్వ పూర్వ సంస్కారములు గోచరించును.

కోమటివేముని మనసు సుషుప్తిదశనుండి స్వప్నదశకు మాఱెను. ఆస్వప్నమున మాచారెడ్డి తన్నుదొడమీదఁ గూర్చుండ బెట్టుకొని

పరుస వేది కథను జెప్పెను. తాను దరములు లెక్కపెట్టుకొని యింకను రెండుతరములు గడవున్న దిగదా యనుకొనెను. ఏదియేది మఱల లెక్కకట్టుమని తనకు దూరమునుండి యెవరో చెప్పినట్లు వినిపించెను. తానన్ని దిక్కులు గలయ వెదకెను. కాటయవేముని తల కహాకహాసవ్వుచు నతనియెదుటఁ గన్పించెను. ప్రక్కఁ గుమారగిరి రెడ్డి చప్పట్లుచరచెను.

తల :— ఏది యేదిరా ? మఱల లెక్కకట్టుము. ఐదుతరములా ? కోమటివేముడు అవునైదుతరములే, ప్రోలయనుండి రాచవేముని వఱకైదుతరములే యని లెక్కపెట్టి చూపించెను.

తల :— బలేలెక్కకట్టితివిరా ! అదీ తెలివి. అట్లుండవలయును. మా కుమారగిరి యేదో వేరేలెక్కకట్టినాఁడులే. ఏమిరా ! కుమారగిరి యా లెక్కకట్టి వీనికిఁ జెప్పుము.

కుమా :— ఎందుకులేరా ! రెంటు రెళ్ళు మూడను వానితో మనము వాదించలేము వానియంతమూర్ఖుఁడు వాడే. వాఁడేమి యొప్పి కొనునా పెట్టునా ?

తల :— ఏమిరా ! మూర్ఖుఁడా యొప్పికొందువా ?

కో. వే :— నాయొప్పికొనుటతో మీ కెందుకులే. మీరు చెప్పున దేదో చెప్పుడు.

కుమార :— సరే ! చెప్పుమంటివిగాన చెప్పెదను. నీవుగట్టిన వరుస తప్పు. లెక్కపెట్టుకొనుము. నేను జెప్పెదను. ప్రోలయ. ఆయన కొడుకు వేముడు. ఆయన కొడుకనపోతారెడ్డి, అనపోతారెడ్డి తమ్ముఁడనవేముఁడు, తఱువాత నేను. నా తఱువాత నీవు. ఎంతమంది యిప్పటికైనారురా ?

కో. వే :— ఆర్గురు.

తల :— ఏడవవాఁడు నీకొడుకు.

కుమార:— మన మార్గురమైపోతిమి.

తల :— ఏడవవాఁడుకూడ నైపోవచ్చినాఁడు.

కోమటివేమునకు వారిగవురిపైని మిక్కిలి కోపము వచ్చెను. అతఁడు "మీరు దొంగలెక్కలుకట్టి నాకమంగళము చెప్పుచున్నారు. అయినను నేను గృహరాజుమేడ కట్టుకున్నానుగదా? మీలెక్కలతో నాకుఁబనేమనెను. తల విఱుగఁబడినవ్వెను. కుమారగిరి చప్పట్లుకొట్టెను.

కోమటివేముఁడు వారివంక, గోపముగాఁ జూచెను.

తల :— ఏమిరా! అట్లు చూచెదవు? ఇల్లలుకగనే పండుగ యైనదనుకొంటివా.

కో. వే :— కాక యేమున్నది? కాకపోయిన నాకత్తియొకటి బిగింపవలసియున్నది. అది రేపటెల్లుంట, బూర్తికాగలదు.

కుమార :— సరే! బాగుగనేయున్నది. నీవుగట్టుకొన్న గాలి మేడలోఁ గూర్చుండి యుయ్యాల యూగుచుందుము. ఆగాలిమేడ నీకన్నుల యెదటనే కరగించివైచెదను.

కుమారగిరి చప్పట్లు చరచెను. కాటయవేముని తల విఱుగఁబడి నవ్వెను. కోమటివేముఁడు "నేను గట్టుకొన్నది గాలిమేడియా? గాలి మేడయా? ఛీ! ఛీ! కాదు కాదు. గృహరాజుమేడ గృహరాజుమేడ." యనుచు నతఁడు బలవంతముగాఁ గన్నులు దెరచి లేచి కూర్చుండి కలయఁజూచెను. గృహరాజుమేడ యతని కాగదిలో గల్పించలేదు. పదినిమిసములకు గాని యతని కది శయనాగారమని గుర్తు రాలేదు.

అతఁడు బయటికి వచ్చి గృహరాజుమేడవంకఁ జూచెను. గృహరాజు మేడ ప్రోగులు పడుచున్న చీఁకటిలో మణికాంతిజ్వాలలు వ్యాపించి మండిపోవుచున్నట్లు కాన్పించెను.

౬౧

మఱునాఁడు పోతరాజు ప్రభకట్టించి మాచారెడ్డి నందికంత బయలుదేరెను. నందికంత యద్దంకి మండలమున నొక కుగ్రామము. పూర్వ మెప్పుడో కోమటివేముని పూర్వు లాగ్రామమున నివసించెడి వారట. వారు పోతరాజుభక్తులు. పోతరాజు వారిని గటాక్షించి వారికులమునకు రక్షగాఁ దన కటారి నిచ్చెనట ప్రతిసంవత్సరము నొక పర్యాయ మా కటారి కుత్సవముచేసి తన గుడియొద్దకుఁ దీసికొనివచ్చి పూజలుచేయువలయునని యతఁడు గట్టడిచేసెనట. కోమటివేముఁడు ... డవీ డాక్రమించినది మొద లింతవఱకును నాకటారిని నందికంత పోత రాజు గుడికిఁ గొనిపోలేదు. తత్పూర్వము కొమరగిరి ప్రతిసంవత్సరము నట్టిపూజ చేయించెడివాఁడు. కోమటివేముఁడు కొండవీటిపై దండ యాత్ర లొనర్చు నపు డాకటారిని గొమరగిరి రాజమహేంద్రవరము పంపెను. కోమటివేముఁడు దానిని మఱలఁ గొండవీటికిఁ దెప్పించుకొను టకుఁ బదునైదేండ్లు పట్టెను.

మాచారెడ్డి నందికంతచేరుసరికి నాల్గుదినములు పట్టెను. ఆయూరివారందఱు నిన్నాళ్ళకు మఱలవచ్చిన కటారిని జూచుటకు గుడి చుట్టునుజేరిరి. మాచారెడ్డి యక్కడఁ బూజలుచేయుచుండగాఁ బోత రాజు గణాచారికి గణముపెరిగి చిందులు త్రొక్కుచు విఱుచుకొని పడి పోయెను. పంబలవాండ్రు గణాచారి తలపైనఁ గొబ్బరికాయలుగొట్టి నిమ్మకాయలుకోసి కోడిపెట్టలు విఱిచి గుగ్గిలము పొగవేసి పంబల

జోళ్ళువాయించి యపరాధములు చెప్పికొనుచు దండములుపెట్టిరి. మాచారెడ్డిచేతఁ గూడ మ్రొక్కించిరి. గణాచారి యాగ్రహోదగ్రుఁడై మండిపడుచు నోరీ! యింతకాలము నాపూజలుచేయలేదు. మీవంశమును నాశనముచేసెదనని కేకలువేయఁ జొచ్చెను. పంబలివాండ్రు మఱలఁ గొబ్బరికాయలుకొట్టి పొగవేసి దండములుపెట్టి స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు. అపరాధమునకుఁ బరిహారమును జెప్పుడు చేసికొందుమనిరి. గణాచారి "నే నూరకున్నను నౌలూరి పోతరాజూరకొనఁడు. ఈకటారి నా కాయనయిచ్చెను. మే మేడుగురుపోతరాజుల మున్నాము. మాయందఱిపైన నాయన ప్రభువు. మీరు గృహరాజు మేడ మొదలుపెట్టి నప్పుడాయనకుఁ బూజసేయలేదు. నాపూజయుఁ జేయలేదు. నౌలూరిపోతరా జగ్నిహోత్రుఁడై మండిపోవుచున్నాఁడు. మాయేడుగురుపోతరాజుల కాయన రెడ్డివంశమును నాశముచేయుమని యాజ్ఞాపించి యేడాదియైనది. అప్పటినుండి మిమ్ముఁగాల్చుకొని తినుచున్నా" మనెను. పంబలవాండ్రు స్వామీ! నౌలూరుపోయియాయనకు బలులిచ్చి జాతరచేసెదము. అంతవఱకు మీరు శాంతింపుఁడని మఱలఁ బొగలువేసి తంతులునడిపిరి. గణాచారి శాంతిఁబొందెను. తఱువాత యథావిధిగా జాతర పూర్తిచేయఁబడెను.

మాచారెడ్డికిగణాచారి మాటలర్థముగాలేదు. తమకులదైవము నందికంత పోతరాజని మాత్రమే యతనికిఁ దెలియును. ఈనౌలూరి పోతరాజుసంగతి యతఁడెప్పుడును వినియుండలేదు. అచ్చటి పంబల వాండ్ర నాయన యాసంగతి యడుగుచుండగా నొకవృద్ధుఁడైన జంగము మాచారెడ్డిని సమీపించి యిట్లుచెప్పెను. "అయ్యా! నా పేరు భీమయ్యదేవర. నాకిప్పు డెనుబదియేండ్లవయస్సు. నేనునాకిరువదియేండ్ల వయసప్పుడు పనిమీఁదఁ గొండవీడు పోయితిని. అప్పుడొక

పెద్ద యుత్సవము జరుగుచుండెను. నేనది యేమని విచారించగా నిట్లు చెప్పిరి. ధర్మాత్మన్న వేమన్నగారు గృహరాజుమేడ కట్టవలెనని సంకల్పించి నౌలూరు పోతరాజునకు జాతర చేయించుటకై ప్రభకట్టించి బయలుదేరుచున్నారు. నౌలూరిపోతరాజుగుడిప్రక్క యేడుమోకులు చుట్టునంత తనర్పు నేడు తాడిచెట్లనిడివియునుగల తుమ్మచెట్టొకటి యున్నది. దానినిగొట్టి తెప్పించి దానిని బునాదివేసి పైన నంత తనర్పును నంతనిడివియుగల స్తంభమును గట్టించి దానిపైన మేడ గట్టించవలయునని యాయన యుద్దేశము. అదిచాలగొప్పయుత్సవము. అట్టి యుత్సవమును నాజన్మమధ్యమునఁ జూచి యుండలేదనెను.

మాచారెడ్డి "యిచటికి నౌలూరెంత దూరముండు" నని యచటఁ జేరినవారినడిగెను. పంబలవాండ్రిట్లు చెప్పిరి. "అయ్యా! అది యిచటికి సరిగాఁ బండ్రెండామడ దూర మున్నది. నౌలూరి పోత రాజుగుడికిఁ జుట్టు పండ్రెండామడ దూరమురో నీయేడు పోతరాజుల గుళ్ళున్నవి."

నౌలూరు రెడ్డిరాజ్యమునకుఁ బడమటిసరిహద్దున నుండెను. అచ్చటినుండి యశ్వపతికి సామంతులైన రేచెర్ల వెలమల రాజ్యము మాచారెడ్డివెంటఁ బెద్దసైన్యములేదు. అతఁడు తగు మాత్రము పరివారముతోనే వచ్చియుండెను. వెలమలతోఁ గ్రొత్తగా వచ్చిన కలహామువలన నతఁడు తగినంత సైన్యములేకుండ నౌలూరు పోవుట ప్రమాదకరమేమోయని భావించెను. కాని కొండవీటికిఁబోయి యచటి నుండి నౌలూరు పోవుదమన్నఁ జాల నాలస్యమగునట్లున్నది. గృహరాజుమేడలో లక్ష్మీవిగ్రహము ప్రతిష్ఠాపించుటకుఁ బెట్టిన ముహూర్తము సమీపించుచున్నది. అతఁడిరువది దినములలో నౌలూరుపోయి

తిరిగి కొండవీడు చేరవలెను. ఆతఁడు కొండవీటికిని నద్దంకికిని వెనుక సైన్యములను బంపవలసినదని కబురు నెట్టి నవులూరు బయలుదేరెను.

మాచారెడ్డి పంపినవార్తవిని రాచవేమున కేమి చేయవలయునో తెలియలేదు. ఒకవేళ యుద్ధమేకల్గినచో నందుకు వలసినంత సైన్యము కొండవీట సన్నద్ధమైలేదు. అతఁ డనవసర ధనవ్యయ మెందుకని యెంచి సైన్యములోని యెక్కటివాండ్రను గైజీతగాండ్రను వదిలి వేసెను. మఱల వారి నందఱను బ్రోగుసేయవలెనన్నఁ గనీసము వారము రోజులైనఁ బట్టును. వారికి జీతము లిచ్చుటకు బొక్కసములోఁ జిల్లి గవ్వలేదు. తురగా రామయ్యనుండిగాని మాదారెడ్డినుండిగాని వారెంత వసూలుచేసిరో యతనికిఁ గబురురాలేదు. కాని యతనికి వారిపై విశ్వాసము మాత్రము బాగుగానుండెను. సరే తఱువాతఁ జూచు కొందమని యతఁడు వెల్లటూరు ప్రాంతములకు నెక్కటివాండ్ర కొఱకును గైజీతగాండ్రకొఱకును గబురుంపించి తన చేతిలో సిద్ధముగా నున్న సైన్యములో గొంతభాగమును నవులూరు పంపెను.

మఱి నాల్గురోజులైన తర్వాత నద్దంకినుండి తురగా రామయ్య తిరిగివచ్చెను. తురగా రామయ్య వచ్చునప్పుడనంతమైన ద్రవ్యమును దెచ్చెను. రాచవేముఁడు తురగా రామయ్యను మిగుల సంభావించెను. రామయ్య "ప్రభూ! నేను జెప్పలేదా! ప్రజలదగ్గఱ బంగారము మురిగిపోవుచున్నది. వారు నయమున నిమ్మన్న నిత్తురా? ఈయ లేమని దొంగయేడ్పు లేడ్తురు. నేను గఠినముగా శిక్షించినను వారు లక్ష్యపెట్టలేదు. బొండకొయ్యలు వేయించితిని. బుజములపై నల్ల గుండు లెత్తించితిని. ముంజేతులకు వెదురు గొడియలు, కంఠములకు నినుప ముళ్ళకాయలతోడి బొగడదండలు వేయించితిని. కొరడాలతో మోదించితిని. అప్పటికి సువర్ణ మంతయు బయటపెట్టిరి. కొండటీ

శిక్షలకుఁగూడ లక్ష్యపెట్టలేదు. కొన్నిగ్రామములు గ్రామములే మొండి సఱచినని. నేనాయూళ్ళనన్నిటిని దగులబెట్టించితిని. ప్రభూ! మనము ప్రజలను లెస్సగా శిక్షింపనిచో వారు తెలుగుమీరిపోవుచున్నారు. వేమారెడ్డి వారిరాజ్యము మొన్నటిదాక భరతుని రాజ్యము. ఇప్పుడు రామరాజ్యమని వారికిఁ దెలియవలెను. ఇంటికొక్కంటికి గుమ్మడి కాయంత బంగారు మీయవలసిన దే. ఆయకాండ్రసందఱను గ్రొత్త పన్నులు వసూలుచేయుమంటిని. ఆ పన్నులీయనివారిని బంధించి నగరమునకుఁ బంపుమంటి" ననెను.

రా. వే :— రామయ్యగారూ! మీరొక్క రాపత్కాలములో దేవునివలె నడ్డపడుచున్నారు. నిజముగా మీఋణము నేను దీర్చుకొనలేను. ఈ కష్టకాలములో మీరింత ధనమును వసూలు చేకుయున్నచో మాపని యేమికావలసియుండెడిదో! నేనింతవ్యయ మనవసరమని యొక్కటివాండ్రను గైజీతగాండ్రను దగ్గించితిని. కాని పిన్నబాబు గారు నవులూరు పోవుచు సైన్యమును బంపుమనుటచే మఱల విడుదల చేసినవారిని జేర్చుకొనవలసి వచ్చినది.

తు. రా :— అవునవును. మాచారెడ్డి వారద్దంకికిని గబురు పెట్టిరి. నాచేతిలోని సైన్యము మూడువంతులు నవులూరు పంపితిని. మీరు పంపకపోయినను బ్రమాదములేదు. అదిగాక నవులూరు మన రాజ్యములోనిదేకదా! ఎటువచ్చి యెటుపోయినను మనము పెద్ద సైన్యమును సమకూర్చుకొనుట మంచిది. మన మిప్పుడు పంచాగ్ని మధ్యమున నుంటిమి.

ఆసాయంతనము మాదిరెడ్డియొద్దనుండి కబురు వచ్చెను. సమయముల వారు పదునెనిమిది ప్రతినిధులు మోటూరునందు సభచేసి తమ్ము బాధించెడి సుంకకరణములను బట్టుకొని చంపిన ముమ్మారి

వారికి బిరుదులిచ్చిరట. వారికిఁ గొండవీటఁ బ్రతినిధిగా నుండి తేము సమయముల వారి కమితమైన సేవచేయుచు వారికి బాధగలిగించు సుంకకరణములను వధించి వీరబలిజ వీరులను సమకూర్చుకొని కొండ వీటి ప్రభువు క్రొత్తగా విధించిన సుంకములను జెల్లించకుండ నెదిరించి నిల్చినందుకు సవిరము యల్లయ్యకు బృథ్వీసెట్టియని బిరుద మిచ్చిరట. సవిరము యెల్లయ్య దానితో నుప్పొంగిపోయి సమయముల వారి ధర్మములను రక్షించుటకుఁ దనప్రాణములనైన నర్పించెదనని ప్రతిన వట్టెనట. వారందఱును నేమైనసరే: క్రొత్తసుంకముల నీయఁగూడ దని తీర్మానించుకొనిరట. మూదిరెడ్డి సుంకము లీయమని తిరస్కరించిన వర్తకులను వేయిమందికిఁబైగా బంధించియుంచెనట. వారి నింక నాల్గైదురోజులలో కొండవీడు పంపునట. కాని వారినాయకు లెవరును జిక్కకుండఁ దప్పించుకొని పోయిరట.

తురగా రామయ్యకీ వార్తవిని నిలువెల్లమండిపోయెను. అతఁడు తలయూచుచు "ప్రభూ! చూచితిరా? యీ సమయముల వారి పొగరు: వీరిని గాలఁబెట్టి నేలరాయవలయును. వీనిశరీరము తూట్లు యొలిపింపవలయును. మూదిరెడ్డి వారి నిటకుఁ బంపుచున్నాఁడు గదా! రానిండు. వారికిఁ దగినశాస్తిచేసెదను. మఱి యీ సవిరము యెల్లయ్య దొఱకకుండఁ దప్పించుకొని పోయినాఁడట. ఎక్కడకుఁ బోవును లెండు. నేను వానిసంగతి యీవఱకే విచారించితిని. వాని భార్యకనఁ గాచుకొన్నదట. పురటిపన్ను వేసి బలవంతముగా వసూలుచేసెదను. అప్పుడభిమానముతో వానియంతటవాఁడే బయటపడు" ననెను.

నాల్గురోజులైన తర్వాత మోటుపల్లినుండి బంధితులైన వర్తకులు గొండవీటికిఁ గొనిరాఁబడిరి. తురగారామయ్య స్వయముగాఁ బోయి వారినందఱను సవిరము యెల్లయ్యనుగుఱించి ప్రశ్నించి

చూచెను. వారందఱును మాకుఁ దెలియదనిన మాకుఁ దెలియదనిరి. తురగారామయ్య వారికి 'మీరు సుంకముల నెగగొట్టుట మంచిది గాదని నయమున భయమునఁ జెప్పిచూచెను. వారు బెల్లముగొట్టిన రాలవలె మాటాడకూరకుండిరి. తఱువాత శిక్షాకాండ ప్రారంభ మయ్యెను. నిందితుల పాదములకు నిగళములు దగిలించి వరుసగానిలు చుండఁబెట్టిరి. గుఱ్ఱపుకొరడాలతోవీపులర క్తము కారువఱకు బాదించిరి. ఎండలో నిలుచుండఁబెట్టి మోయలేని యినుపగుండులు దీసికొనివచ్చి ఱొమ్ములపైఁ బెట్టిరి. వస్త్రము లొలిపించి పట్టుకారులతోఁ బాశ ములు పెట్టించిరి. అప్పటికిని వారేమియు మాటాడలేదు. వారు "మాకు సవిరము యెల్లయ్యనుగుఱించి తెలియదన్నఁ దెలియ" దనిరి.

తురగారామయ్య "ఓయీ! మీకు వారమురోజులు గడు విచ్చుచున్నాను. జాగ్రత్తగా నాలోచించుకొనుఁడు మీరు వడివంగి వచ్చితిరా సరే. లేనిచో మీతిత్తు లొలిపించెదను. మిమ్ము గానుగ లలోవేసి త్రిప్పించెదను. మీయొడళులకు వెంటులు చుట్టించి తల క్రిందుగాఁ గట్టించి తగులఁబెట్టించెదను. మిమ్ముఁ గొఱ్ఱుల వేయించి పచ్చిగుదియలతో మోదించెదను. ఆలోచించుకొనుఁడ" ని వారిని బెదిరించి పంపివేసెను. కొండవీటి నగరమునందును రాజ్యమునందంత టను సైనికులు రాజోద్యోగులు దప్ప దక్కిన వారందఱు గ్రొత్త పన్నియ వలయునయు నట్లీయని వారు క్రూరముగా శిక్షింపఁ బడుదు రనియు నతఁడు చాటింపించెను.

గృహరాజుమేడలోలక్ష్మియమ్మవారినిస్థాపించుముహూర్తము సమాసన్న మయ్యెను. అందఱును మాచారెడ్డిరాక కెదురు చూచు చుండిరి. మాచారెడ్డిరాకకు బదులు నవులూరునుండి పిడుగువంటివార్త యొక్కటి వచ్చెను. మాచారెడ్డి నవులూరు వచ్చుచున్నాఁడన్న వార్త

యెట్లు తెలిసినదో పినవేదగిరికిఁ దెలిసినదట. అతఁడు వేయిమంది యాశ్వికులనువెంటఁ బెట్టుకొని హుటాహుటి నవులూరువచ్చి మాచా రెడ్డి మొగమునఁ గత్తిపెట్టి "ఓహో! రెడ్డమ్మగారూ! "ఇప్పుడు గాదులే: యెప్పుడో యేదో విష్ణుచక్రము చేసెదనంటిరిగదా! అదిచేసి పట్టుకొని వచ్చితిరా? యని వేళాకోళము చేసెనట. మాచారెడ్డి కోడలు మండుకొని పోయియొరనుండి కత్తిదూసి వేదగిరిపైఁ గలియఁ బడెనట. వారిద్దఱెక్కటికయ్య మొనర్చుచుండగా వెనుకనుండి యెవఁడో మాచారెడ్డి నీటెతోఁ బొడిచెనట. మాచారెడ్డి క్రిందఁబడిపోయెనట. పిన వేదగిరి మాచారెడ్డి కంఠముపైఁ గత్తిపెట్టి "యిదిగో! నిన్ను నవు లూరి పోతురాజునకు బలియిచ్చుచున్నాను. ఆయశ్వపతి నడ్డముదెచ్చి కొమ్మని నఱకివైచి యాతలను నందికంత పోతురాజు కటారిని దీసి కొని పోయెనట. పోవునప్పుడు మాచారెడ్డి పరివారమును జూచి యతఁడు "ఓయీ! మీరుపోయి పినవేదగిరి మాచారెడ్డి తలనరకిఁ దన తమ్ము పడిగములో బొమ్మవేయించుకొన్నాఁడని కోమటివేము నితోఁ జెప్పుకొనుఁడు పొండ" ని యదలించెనట.

కోమటివేముఁడీ వార్తవిని మొదలు నరికినచెట్టువలె నిశ్చేత నుఁడై పడిపోయెను. రాచవేముఁడు శివమెత్తి తురగా రామయ్యను బిలిపించి సైన్యము నాయత్త పెట్టుఁడు. ఈ వెలమలను నాశనము చేసె దనని గర్జించెను. తురగా రామయ్య వారు మనపైకి యుద్ధము వచ్చిరా! మనమేదో జాతరకని కొలఁది పరివారమును వెంటఁబెట్టు కొనిపోగా దొంగతనముగా వచ్చి మీఁదఁబడిరి. అప్పుడైన ముఖా ముఖి పోట్లాడిరా? తానుముందు మగవానివలె యుద్ధముసేయుచు వెనుకనుండి యీటెతోఁ బొడిపించినాఁడు. మాచారెడ్డి వీరమరణము పొందెను, మనము దానికై చింతింపనక్కఱలేదు. మనము వారిపైఁ

బగదీర్చుకొనవలసిన దే. కాని దండెత్తుట కిది సమయముగాదు. అటు నుండి యశ్వపతినిగూడఁ బురికొల్పవలయును. ప్రగడయ్యను గలబరిగ మఱల పంపవలయును మీరు తొందరపడకుఁడనెను. రాచవేముఁడు ప్రగడయ్యకుఁ గబురంపి మీరు కలబరిగపోయిరండని కోరెను. ప్రగడయ్య "ప్రభూ! ఈ చిక్కంతయు నీ పదునై దేండ్లనుండి నందికంత పోతురాజు కటారికి జాతరలు చేయనందువలన సంభవించినది గదా? మీ కులక్రమాగతమైన కటారి మీ శత్రువులయొద్ద నుండుట మంచిది కాదు. ముందు దానిని దెప్పించి యీ దేవతలకు శాంతి చేయించవల యును. తఱువాత దండయాత్ర మాట యాలోచింత మనెను.

రా. వే :— దండయాత్ర చేయక యాకత్తి తెచ్చుట కెట్లు సాధ్యమగును అదిగూడ మీరే చెప్పుడు.

ప్ర :— నేను వేఱ చెప్పుట యెందులకు? అన్నగారు రీవఱకే చెప్పిరి. కత్తియుఁ గలమును బనిచేయనిచోఁ బాండిత్యము పనిచేయునని.

రా. వే :— అయినచో వామనభట్టుగారినో శ్రీనాథయ్యగారినో యచటికిఁ బంపుఁడు.

ప్ర :— వామనభట్టుగారిని బంపుటకంటె శ్రీనాథయ్యగారిని బంపుట సుకరము. శ్రీనాథయ్యగారీ వఱకే డిండిమ భట్టారకుని కంచు ఢక్క పగులఁగొట్టించి యున్నారు గదా! ఆప్రసిద్ధి యష్టదిక్కులకు బ్రాకినది. ఆయన యచ్చటికిఁ బోయినంతనే వెలమల యాస్థానమున నున్న పండితులందఱు బ్రహ్మరథము పట్టెదరు.

రాచవేముఁడు శ్రీనాథయ్యను బిలిపించి కర్పూరతాంబూలము పెట్టెను.

## ౧౮

కోమటివేమునకు మాచారెడ్డి మరణము గొడ్డలిదెబ్బయై తగిలెను. మాచారెడ్డి యంతవిచిత్రముగా మృత్యువాతఁ బడునని యతఁడు తలంచియుండలేదు. మాచారెడ్డి మరణముకంటె శత్రువు లొనర్చిన యవమానమునకు నతఁడు కుమిలిపోవుచుండెను. “ ఈయవమానము తనకెందుకుఁ గల్గవలెను? అతని హృదయ మా యవమానమునకుఁ బ్రతీకారము కోరెను. ఆప్రతీకారము చేసికాని యతని మనసూఱడిల్లదు.

వారమురోజులు గడచిన తఱువాతఁ గోమటివేముని మనసునందు దుఃఖావేగ మించుక తగ్గెను. కాని యవమానభారమింకను నతని మనసు నెఱియఁ జేయుచుండెను. అతఁడు తనమనస్సునకేదియో సమాధానము చెప్పికొని యూఱట పొందఁజూచెను గాని యామనసునందుఁ బ్రతీకార వాంఛదట్టమై తోఁచుచుండెను. “ మాచారెడ్డి యేమైన శత్రువులకు వెన్నిచ్చి పాఱిపోయినాఁడా? పినవేదగిరి వానిని వెనుకనుండి పొడిపించి చంపెను. చనిపోయినవాని తలనుగోసికొని పోయిన నదిపెద్ద వీరకార్యమా? నిజముగా దానికి వాఁడే సిగ్గుపడవలెను. దీనిలోఁ బెద్ద యవమానమేమున్నది? అదిగాక యదియట్లు జరుగవలయునని దైవనిర్ణయము. దానిని బ్రహ్మదేవుఁడుగూడ నడ్డుకొనలేఁడు. అదియట్లు జరిగిపోయినది. దానికై తానెందుకు బాధపడవలయును! జరుగవలసి జరిగినదానికిఁ దా నవమానితుఁడైనట్లు భావించుట వట్టి యవివేకము. కన్నులయెదుట జరుగునదంతయు నొక యింద్రజాలము. వట్టి యెండమావులు. ఆ క్షణమున కాసంఘటన కనులయెదుట మిలమిలలాడి భూతములోనికి సురిగిపోయినది. దానికోసము విచారించి ప్రయోజనమేమున్నది? ఇట్టి సమాధానము లతఁ డెన్నియో చెప్పికొనెను. కాని

మనసూఱట చెంపలేదు. ఈ మనస్స్వభావమును జూచి యతఁడు మిక్కిలి యచ్చెరువడెను. ఆ మనసులో నొక వంక నొక పరమవివేక ముద్రప్రత్యగ్రముగా నున్నది. మఱియొకవంకఁ బ్రతీకార వాంఛ కూడు కట్టి పొగ రాజుచుండెను. ఈ వివేకమున కీ వివేకమే. ఆప్రతీకారవాంఛ కాప్రతీకారవాంఛయే. ఈ వివేక మాప్రతీకారవాంఛను జంపలేక పోవుచున్నది. ఈ ప్రతీకారవాంఛకు మూలమేది? ఇది దేని నాశ్రయించుకొని యున్నది?

"ఇది వట్టి సంస్కారము. పరులవమానము చేసిరనుకొనుటవల్ల వచ్చినది. ఆయనుకొనుటకూడ నొక సంస్కారమే. ఈ సంస్కారములు దేనినాశ్రయించుకొని యున్నవి? వీని యన్నింటికి మూల మేది?"

అతనిమనసులో లోపల నెక్కడనో భయము భయమని విని పించెను. దానితోపాటు స్పష్టమైన నవ్వులమోఁత చప్పట్ల సఱఫు వినిపించెను. ఆధ్వనులు క్రమముగా రూపుకట్టి కాటయవేముని తలయుఁ గుమారగిరియును బైకిఁ దేలిరి. కోమటివేముఁడు వారి నిద్దఱనులోనఁ ద్రొక్కికొనుటకుఁ బ్రయత్నించెను. తల విఱుగఁగఁబడి నవ్వుచు "నోయీ! వ్యర్థప్రయత్నమేల చేసెదవు? నీచేతఁ ద్రొక్కఁబడుటకు మేమంత బలహీనులముగా" మనెను.

కో. వే:— మీయిద్దఱ నీవఱకే పాతాళమునకుఁ ద్రొక్కితిని. మీరు నాకంటె బలవంతు లెట్లగుదురు?

తల:— కావుననే నిన్ను మేమిప్పుడు పాతాళమునకుఁ ద్రొక్కు చున్నాము.

కో. వే:- మీరువట్టి సంస్కారములు. మీ కేమైన స్థితియున్నదా పెట్టినదా?

మాకుస్థితిలేకేమి? నీమనసులోనే మాకు స్థితియున్నది. బయట మాకున్ననేమి లేకున్ననేమి? పాపమిన్నాళ్ళు మాచారెడ్డి బయట నుండి నీకుఁ దాళము వేసినాఁడు. ఇప్పుడతఁడు నీమనసునం దొక సంస్కారమై నీకవమానము దెచ్చిపెట్టినాఁడు. పాప మీవుమాచారెడ్డి తల వాఁ డెవఁడో తెగఁగొట్టికొనిపోయె ననుకొంటివిగదా! వాఁడెక్కఁ డకుఁ దీసికొని పోయి నాఁడు? బహుశః వాఁడు దానిని దీసికొనిపోయి కాలితోఁ దన్ని యుండును. ఆకాశమున వ్రేలఁగట్టి కాకులకు గ్రద్ద లకును బలివేసియుండును. కాకపోయినఁ గాల్చి మసిచేసి యామసిని దూర్వారఁ బట్టియుండును.

తల విఱుఁగబడి నవ్వెను. కొమరిగిరి చప్పట్లు చఱచెను.

కోమటివేమారెడ్డికిఁ గాటయవేముని తలను దాను దన్నిన దృశ్యము కన్నులకుఁ గట్టెను. ఆ తలను దాను గాలితో బంతియాట యాడుచుండెను. గజరావు తిప్పనాయఁడతనిని బట్టుకొనెను. ఆతల గోడమూలనొదిగి తన్ను బెదరించుచుండెను. తాను దానినాకసమునఁ గట్టించి కాకులకు గ్రద్దలకును బలిపెట్టించెను. ఆపాపమున కిది ప్రతీకార మేమో? మాచారెడ్డి తలనుగూడ వేదగిరి యట్లే చేయించియుండు నేమో? ఓహో! నాతమ్మునితల నేనుగాఁగిలించుకొని మూర్కొన్న తల పవిత్ర నదీజలములచే నభిషిక్తమైనతల యావేదగిరి కాలికిఁ గందుక ప్రాయమైనదికాఁబోలు. కోమటివేముఁడు దీర్ఘముగా నిశ్శ్వసించెను. తల పగులఁబడి నవ్వుచు "నోరీ! మూర్ఖుఁడా! యెందు కట్లేడ్చెదవు? నీతమ్ముని తలకేమియు ముప్పమురాలేదు. ఆవేదగిరి దానినేమిచేసినను దానిస్థితికేమియు భంగములే" దనెను. కోమటి వేముఁ డావేగముతో "నేదియేది? అదియెక్కడనున్న" దనియడిగెను.

తల:— నేనెక్కడ నుంటినో యదియునక్కడనే యున్నది. ఇదిగో! తీసికొని వచ్చెదను. చూడుము పాపము.

కాటయ వేమునితల కోమటివేముని మనసులో మునిఁగి మాచా రెడ్డితలను బైకిఁదెచ్చెను. మాచా రెడ్డి మొగమంతయు నెఱ్ఱవడి యుండెను. దవుడలు లోపలికిఁ దోసికొనిపోయి పండ్లు పయికివచ్చి ముక్కు తర్జనివోలె బిగిసి చూపులందొక ప్రతీకార వాంఛ రూపు గట్టి యుండెను. ఫాలమునందును గపోలములందును శిరమునందును దుమ్మంటుకొని కాలి తాపులను వ్యక్తముసేయుచుండెను. కాటయ వేమునితల కహకహనవ్వుచు "నోరీ! కుమారగిరీ! నాకుఁగాలుఁ జేతులులేవు. నీకున్నవిగదా: మాచా రెడ్డి తల నొకపటి పై కెగురఁ దన్నుమురా!" యనెను. కుమారగిరి మాచా రెడ్డి తలను జేతులతోఁ దీసికొని పై కెగురఁదన్నెను. అది గిరగిర యాకసములోని కెగిరిపోయి క్రిందఁబడెను. ఆపడ్డ యాఘాతమునకుఁ గోమటివేముని మనసు చింది పోయెను.

తల :— ఓరీ! కోమటివేమా! ఆవేదగిరి తన్నియుండిన నిట్లే తన్నియుండునురా! ఇంతకంటె వేఱయేమిచేయఁగలఁడు! చనిపోయిన వానితలను గోసి తన్నుట యదియొక ప్రయోజకత్వమా? దానికోస మింతవాపోయెదవెందుకు? అదిగాక యిది వట్టివార్తమానికవిలసనము. వట్టియెండమావులు. ఆయెండమావులను జూచి దుఃఖము పొందుచున్నా వంతే. నీవు సృష్టించుకొన్న యెండమావులనుజూచి నీవే భ్రాంతి పొందుచున్నావు. ఏమందువురా? కొమరగిరి?

కొమరగిరి:— మనము వట్టి సంస్కారములమే కాదురామరి మనకొక ప్రాణమున్నదా! ఏమన్నానా?

కో. వే:— అవునవును. నిజముగా మీాకుఁ బ్రాణములేదు. ఆ ప్రాణమును నేనుబోసి మిమ్ము నాయెదుట నిల్పుకొనుచున్నాను. మీా రావిశ్వాసములేక నన్ను బాధించుచున్నారు.

తల :— ఓరీ! పిచ్చివాఁడా! మాకుఁ బ్రాణములు పోయునది నీవుగాదురా! నీభయము. నీభయమే నీకిప్పుడు ప్రతీకారవాంఛ గూడఁ బుట్టించినది. నీభయమే మాచారెడ్డి తలనుగొట్టించినది. నీభయమే నీకది యవమానమని చెప్పినది. ఇంతవఱ కెందుకురా! నీవీ గృహారాజుమేడను గట్టుటకు మూల మీా భయమేగదా. మఱి యింకఁగొంచెము దూరమాలోచింపుము. నీకుఁ బ్రాణముపోసినదిగూడ నీభయమే. ఓరీ! వేమా! ఆభయమే నిన్ను బుట్టించినది. ఆభయమే నిన్ను జంపునురా. ఈ సర్వమున కాయొక్క భయమే కారణము.

కో. వే :— అయినచో నేను వెలమలపైఁ బ్రతీకారము సేయను.

తల :— విఱుగఁబడినవ్వెను. కొమరగిరి చప్పట్లు చఱచెను.

కో. వే :— మీారెందుకిట్లల్లరి చేసెదరు? నేను నిజముగా నాప్రతీకారవాంఛను జంపుకొందును.

తల :—ఓరీ! దానికిఁగూడ భయమేకారణము. ఈ సర్వమునకు భయమేకారణమంటినిగదా! అందులో నది చేరలేదా? నీవు ప్రతీకారము సేయుము దానికి భయమే కారణము. సేయకుండుము దానికిని భయమే కారణము.

కో.వే :— అబ్బ! ఈభయమెచ్చటనుండివచ్చినది? దీనికిఁ గారణ మేమి? అది యెంత యాలోచించినను బోధపడుటలేదు. ఇది యూరక మనసంతయుఁ బొగ క్రమ్మి దట్టముగాఁ జీఁకటి పూఁత వెట్టుచున్నది.

కోమటివేముని మనసున భయము ప్రోగులు ప్రోగులువడి యమావాస్యచీఁకటివలెఁ జిక్కని పూఁతవెట్టెను. ఆ చీఁకటిలో మిణుఁగురు పురుగులవలెఁ గాటయవేముని కనుగ్రుడ్లు మెఱసి యాచీఁకటినే యభివృద్ధిగావించెను. ఆ సమయమున నాతనియొద్దకుఁ బ్రగడయ్యవచ్చి తన్ను రాచవేమఁ డశ్వపతియొద్దకు రాయబారము పొమ్మన్నాఁ డనియుఁ దా నా మఱునటి యుదయమున బయలుదేఱి పోవుచున్నాఁ డనియుఁ జెప్పెను. కోమటివేమఁ డేమియు మాటాడలేదు.

ప్రగడయ్య :— ప్రభూ! తురగా రామయ్యగారు పెద్ద సైన్యమును సేకరించెను. శ్రీనాథయ్యగారు నందికంత పోతరాజు కటారినిఁ దీసికొనిరాఁగానే దండయాత్ర వెడలుటయే. ఆయనగూడ రేపటెల్లుంట రాఁగలఁడేమో: అటునుండి యశ్వపతిని బురికొల్పుమని నన్ను చటికిఁ బంపుచున్నాఁడు.

కోమటివేమఁ డేమియు మాటాడలేదు. ప్రగడయ్య యతనిని జూచి యబ్బురపడెను. అతఁడు "ప్రభూ! మీచేత ననిపించుకొని పోవుదమని వచ్చితిని. తమ యభిప్రాయమును జెప్పుఁడనెను. కోమటి వేమఁ డొక నిట్టూర్పును విడిచి "యేమిచెప్పుటకు నాకేమియుఁ దోఁచుటలేదు. ఎట్లైన నొక్కటియే. ఆ జరుగవలసినదేదో జరుగును. మీకుఁ దోఁచినట్లు చేయుఁ" డనెను. ప్రగడయ్య వెడలిపోయెను. కోమటివేముఁడు దన భయమునుగుఱించి మఱలఁ దర్కించుకొనుటకు మొదలుపెట్టెను. అతనిమనసులోఁ దక్కిన వేమియుఁ బట్టుటలేదు. ఇంత భయమునకుఁ గారణమేమి? దీనికి మూలమేమి? ఇది యెచ్చటినుండి వచ్చెను? ఎట్లుపోవును? ఈ కాలము విప్పిన యీ విలసనములన్నియు నిట్లు కన్పించుటకీ భయమే కారణమా? ఈ కాలమున కావల నొక మహాకాలమున్నదఁట. ఈ కాలమొక మృత్యుచక్రమఁట. ఆ మహాకా

దర్శనమువలన నీ మృత్యుచక్రమునుండి జీవుఁడు ముక్తుఁడగునఁట. ఈ కాలమును మీఱి యీ మహాకాలమును దర్శించుట యెట్లు? అసలీ కాల మెచ్చటినుండివచ్చినది? ఇది క్షణాత్మకముగ జరిగిపోవుచున్నట్లు కన్పించుచున్నది. ఇదిగూడ భ్రాంతియేనేమో? ఇదిగూడ నెండ మావులవలె వట్టి విలసనమేయేమో? దీనికొకస్థితియున్నదా? దీనికిఁ గూడఁ గారణ మీ భయమేనా? ఈ కాలమునకుఁ దుది మొద లున్నదా? ఈభయమునకుఁ దుది మొదలున్నదా? ఈకాలమును మీఱుటయెట్లు? ఈ భయమును మీఱుటయెట్లు? ఈ కాలభావ మీ భయభావము నీరెంటికెచ్చటనో ముడివడియున్నది. ఆ ముడిమాత్రము నాచేతులతోనే యూడఁదీసికొనలేకపోవుచున్నాను. ఓహో! నాకీసను విప్పెవరు విప్పెదరు?

ఇట్టి యాలోచనము కోమటివేముని మనసునందుఁ గలవరము పెట్టుచుండెను. అతఁడట్లే దినములతఱబడి యీ యాలోచనమును గొనసాగించుచుండెను. అతని కేదో స్వప్నజగత్తులోఁ దాను జీవించు చున్నట్లు తోఁచెను. అతనియెదుట ననేక సంస్కారములు రూపు చెంది నిలుచును. అతఁడు వానిచరిత్ర నడిగి తెలిసికొనును. అతఁడు మీ యండజ యునికెచ్చట నని యడుగును. అవి "నీ మనసులోనే నీ భయము నాశ్రయించుకొనియుంటి" మని చెప్పును. అతఁడయ్యో! నేనెన్నియో పుణ్యకార్యములను జేసితిని. ఇవియన్నియు నీభయమును త్తరింపలేకపోయినవని వాపోవును. కాటయవేమునితల బయటికివచ్చి నీవు పుణ్యకార్యములను జేయుటకుఁగూడ నీభయమే కారణమురా యని చెప్పును. ఆభయ మెట్లు పోవునో చెప్పిన దొక్కటియు లేదు. ఆపెద్దియజ్వగారు మాత్రము తన కా కాలభావమును గుఱించి సూచనగాఁ జెప్పెను. కాని యభిమానమువల్లఁ దానప్పు డాయన నడిగి

నాఁడుగాదు. ఆయన యామహాకాలము శివస్వరూపమని చెప్పినాఁడఁట. తానుగూడఁ బరమశైవుఁడే. తనకా రహస్య మేమియు బోధపడలేదు. ఆయన వచ్చిన బాగుండును. అయన కుమారుఁడు చెప్పినాఁడట. చాతుర్మాస్యలు డగ్గఱించుచున్నవి. ఆయన రాఁగలఁడు.

కోమటివేముఁడు పెద్దియజ్వ రాకకుఁ గనిపెట్టుకొని యుండెను.

దేవగిరినుండి శ్రీనాథుఁడు తిరిగివచ్చెను. రాచకొండ దేవరకొండ వెలమదొరలతనిని విశేషముగా గౌరవించి పూజించిరి. అతఁడు తొలుతగా రాచకొండకుఁబోయెను. రాచకొండలో సర్వజ్ఞసింగభూపాలుఁడు పాలించుచుండెను. సర్వజ్ఞసింగభూపాలుఁడు పండితప్రభువు. అతఁడు స్వయముగా ననేకగ్రంథములను రచించెను. రసార్ణవసుధాకరమను నలంకారశాస్త్రగ్రంథము. సంగీతసుధాకర మను సంగీతశాస్త్ర గ్రంథము రత్నపాంచాలిక యను నొక నాటకమును రచించెను. అతనిని లలితకవితా విలాసచతురాననుఁ డనియు లక్ష్యలక్షణవేదియనియుఁ బండితులు స్తుతింతురు. అతని యాస్థానమున ననేక పండిత కవులుండిరి. చమత్కారచంద్రికా కర్త విశ్వేశ్వరకవి. అమరకోశవ్యాఖ్యాత బొమ్మకంటి యప్పయార్యుఁడు నుండిరి. వారందఱు శ్రీనాథుని పాండిత్య ప్రకర్షవినియుండిరి. శ్రీనాథుఁ డచ్చటికిఁ బోవఁగనే వారందఱతనికి బ్రహ్మరథముపట్టిరి. సర్వజ్ఞసింగభూపాలుఁడు శ్రీనాథుని పాండిత్యమునకు మిక్కిలి సంతసించి యతనిని విశేషముగఁ బూజించెను. శ్రీనాథుఁ డతనికిఁ దాను వచ్చిన కార్యము నివేదించెను. సింగభూపాలుఁడు విశ్వేశ్వరకవిచేత దేవగిరికి శ్రీనాథుని బూజించి యాయనకోరిక తీర్చవలసినదని కబురుపెట్టెను. విశ్వేశ్వరకవియు శ్రీనాథుఁడును దేవరకొండకుఁ బోయిరి. అచ్చటఁ బెద్దిభట్టుమల్లినాథుఁడు మొదలైనవారు

శ్రీనాథుని విశ్వేశ్వరుని మిక్కిలి గౌరవించిరి. పినవేదగిరి శ్రీనాథుని మిక్కిలి యాదరించి నందికంత పోతరాజు కత్తినిచ్చి పంపెను.

మఱివారము దినములుగడచి కలబరిగెనుండి ప్రగడయ్య తిరిగి వచ్చెను. ప్రగడయ్య కొనిపోయిన వర్తమానము నశ్వపతి మిగుల నాదరముగా స్వీకరించెనట. అతఁడు "మేమీప్రక్కనుండి రాచకొండ రాజ్యముపైఁబడెదము మీరాప్రక్కనుండి దేవరకొండ రాజ్యమును ముట్టడించుఁడు. వారిని జీలదీసి రెండు యుద్ధరంగము లేర్పాటు చేసిన గాని జయించుట కష్టము. వర్షర్తువు ప్రారంభమగులోపలనే వెలమల నణగద్రొక్కవలయును. మీ రింటికిఁ బోయినవెంటనే దండయాత్ర ప్రయత్నములు సేయుఁ" డని చెప్పెనట. రాచవేముఁడు తురగా రామయ్యతో గజరావు తిప్పనాయనికిఁ గబురు వెట్టుఁడు. దండయాత్రకు సైన్యమంతయు సన్నద్ధపఱుపుఁడని చెప్పెను.

ప్రగడయ్యపోయి కోమటివేమునితో యుద్ధప్రయత్నములను గుఱించి ముచ్చటించెను. కోమటివేముని కేది యెట్లైన నొకటే యనిపించెను. అతఁ డేమియు మాటాడలేదు. దినములవెంట నతనిలో నిష్క్రియత్వము బలిసెను. అతఁ డెవరితోడను మాటాడుటలేదు. భోజన వేళలందు దప్ప నతని కితరజన సంపర్కములేదు. అతఁడు దినములోఁ జాలభాగ మాలోచనలతో గడపివేయుచుండెను. అతని మనసునకుఁ గ్రమముగా బహిస్స్మృతి తగ్గిపోయెను. అతఁ డెల్లప్పు డంతర్ముఖుఁడై యేదియో యాలోచించుచునే యుండెను. అతని మనసు బహిర్ముఖముపొందు సమయములు రెండే రెండు. ఒకటి శివపూజావేళ. రెండవది వేమాంబ పాతమునకు వచ్చినప్పుడు. తక్కిన సమయములం దతఁ డొకసమాధివంటి యవస్థలో మునిఁగిపోయి పుణ్యపాపములను, ధర్మాధర్మములు మొదలైనవానిని గుఱించి తలపోయుచుండును.

అతని మనసున నప్పుడప్పుడు మాచారెడ్డి స్మర్యమాణుఁడై వానితో పాటు వెలమలు చేసిన యవమానము పొంగి ప్రతీకార వాంఛను రేకెత్తించును. దానితో పాటు కాటయవేముని తల యతనిముందుఁ బ్రత్యక్షమై వేళాకోళముచేయును. అంతటితోసరి. అతని యంఁదా ప్రతీకారవాంఛ వట్టియువివేక విలసనమై సురిగిపోవును. దానికంటె నతని మనసులో బలముగానున్న వాంఛ గృహరాజుమేడ యందు లక్ష్మీదేవిని స్థాపించుట. గృహరాజుమేడపై కతని తలఁపుపోయినపు డెల్ల యాకాలభావమూ యాకాశభావమాతని నాకర్షించుచునే యుండెను. కాటయవేముని తల, కొమరగిరి, వేళాకోళము చేయుచునే యుందురు. కాని యతఁడింతవఱకుఁ బూర్తిచేసితిమిగదా: శ్రీనాథయ్య గారు నందికంత పోతరాజు కటారి తేనే తెచ్చెను. దానిని బైగూటి యందు బిగించుట యొకటి మిగిలియున్నది. నవులూరి పోతరాజునకుఁ బూజలు చేయించి యాకొంచెము కొఱవగూడఁ బూర్తిచేసితినా! ఇఁక లక్ష్మీదేవి స్థిరపడును. అప్పుడిక నా కీలోకముతోఁ బనిలేదను కొనును. కోమటివేముఁడు ప్రగడయ్యగారికిఁ గబురంపి ముహూర్తము నిర్ణయింపించుఁడని చెప్పెను. ప్రగడయ్య యొక జ్యోతిషికుని రావించెను. జ్యోతిషికుఁడాషాడ శుద్ధ పంచమి ముహూర్తము నిర్ణయించెను.

ఆషాఢ శుద్ధ పంచమి యింకఁ బదునెనిమిది రోజులుండెను. అనాఁటి యుదయము పదిగడియల ప్రొద్దెక్కునరికి గజరావు తిప్ప నాయఁడు వచ్చెను. తిప్పినాయఁడు రాగానే రాచవేమున కెక్కడలేని బలమువచ్చెను. అతఁడు భేరీతాడనము చేయించి కోమటివేమునియొద్ద కేగి దండయాత్ర సంగతి చెప్పెను. కోమటివేముఁడు "మీరు పోవు నపుడు నందికంత పోతరాజు కటారిని దీసికొని నవులూరు పోతురాజు నకు జాతర సేయించి వెంటనే పంపుడు. ఆషాఢ శుద్ధ పంచమి

ముహూర్తము. ఈలోపలనే కటారిని బంపవలయును. వీరైనచో ముహూర్తమునకు నీవుగూడఁ దిరిగిర" మ్మనెను. రాచవేముఁడు కటారిని దీసికొని ససైన్యముగా నవులూరు వైపు బయలుదేరెను.

## ౧౨

పదునైదురోజులుగడచెను. కోమటివేమునికి యుద్ధరంగమునుండి యెప్పటికప్పుడు వార్తలు తెలియుచునే యుండెను. నవులూరి యొద్ద రాచవేముని సేనలు వెలమలతోఁ దలపడెను. పోరు ఘోరముగా జరుగుచుండెను. ప్రత్యంగుళము నేల కొఱకు వేలకొలఁది వీరుల నుభయ పక్షములవారు బలివెట్టుకొనుచుండిరి. పినవేదగిరి స్వయముగా వెలమ సైన్యములను నడుపుచుండెను. రెండు మూడు పర్యాయములు రాచవేముఁడును బినవేదగిరియుఁ దలపడి యెక్కటికయ్యమొనరించిరి కాని పినవేదగిరిగాని రాచవేముఁడుగాని యొకరికొకరు కొఱుకుడు పడలేదు. ముహూర్తము సమీపించుటచే రాచవేముఁడు నందికంత పోతరాజు కటారిని బంపుచున్నాననియుఁ చినవేదగిరితలతోఁ గాని నేను కొండవీటికిఁ దిరిగి రాననియుఁ గబురంపెను.

ఇట్లు దినదినము నవులూరినుండి యేదియో వార్త వచ్చుచునే యుండెను. ఆనాఁటి సాయంకాలము మఱియొక వార్త వచ్చెను. సోమదేవచోడుఁడు తా నారాత్రికి శత్రుస్కంధావారమునందుఁ జొరఁబడి పినవేదగిరి తల కొట్టితెచ్చుటకుఁ బ్రతిజ్ఞ కావించెనట. ఆ వార్తవిని కోమటివేముఁడు మిగుల నాందోళనము చెందెను. సోమదేవచోడుఁడు మఱల యుద్ధరంగమునకుఁ బోయిన సంగతి తానెఱుఁగనే యెఱుఁగఁడు. అతని నెవరు పంపియుందురు? అన్న దేవచోడుఁ డతనిపైఁ బ్రాణములు పెట్టుకొని యచట నల్లాడ రెడ్డితోఁ బోరుచున్నాఁడు. ఇతఁ డేమో

మఱల యుద్ధ రంగమునకుఁబోయెను పోయినవాఁడేదియో వెనుకనుండి నడుపుచున్నను బాగుండెడిది. ఇతని కీప్రతిజ్ఞలెందుకో ఎవరో రెచ్చగొట్టి యుందురు. వెలమల స్కంధావారమును జొచ్చి బయటపడుట యన్నమాటలుగాదు. మఱలఁ బరిస్థితియంతయు మొదటికిఁ దెచ్చినాఁడు. అతఁడీగండమునుగడిచి బయటఁబడిన బాగుండును. ఉన్నంతలో నేదియో ముహూర్తమునుజూచి యీ వివాహము చేయవలయును. అయినను నిదియంతయుఁదనవెఱ్ఱి. ఏదియెట్లు జరుగవలసిన నట్లుజరుగునని తా నిదివఱ కెన్నిమాఱు లనుకొనలేదు? ఆ దైవ నిర్ణయము మీఱి తానేమిచేయఁగలఁడు? ఏమియుఁ జేయలేఁడని నిశ్చితమైనను నాచేయఁ గల్గుటనుగూర్చి మనసాలోచించును. దానియందుఁ దగులము చెంది దుఃఖపడును. తనయందుఁ గర్తృత్వమన్నది వట్టి భ్రాంతియని తేలిపోయినకూడ మనసునం దాభ్రాంతి తొలఁగక దానిని క్రియాభిముఖముగనే కదలించుచున్నది. మనస్సు యొక్క యీ విచిత్ర స్వభావముకోమటివేమున కాశ్చర్యము గల్పించెను. ఒక ప్రక్కనుండి యొకానొక నిశితమైన వివేకము ప్రతిభాసించుచు నిదియేదో చిత్రవిచిత్రముగాఁ గనులముందు మెఱసి పోవుచున్నది. దీనియందిసుమంతయు యాథార్థ్యములేదు. దీనిని నీవేమియు మార్చలేవని చెప్పుచుండగా మఱియొక ప్రక్కనుండి యయ్యో! పోవుచున్నది పోవుచున్నది పట్టుకొమ్మని యొకప్రచోదన ముద్భూతమై యాభ్రాంతియందు సత్యత్వము దీపించి తన చేయలేనితనము వ్యక్తమై దుఃఖమును బొంగించుచున్నది. ఆ వివేకమున కావివేక మీ యజ్ఞానమున కీ యజ్ఞానము. రెండు రెండు గంగా యమునా స్రవంతులవలెఁ గలిసి ప్రవహించుచున్నవి.

మఱి రెండు దినములు గడచి యొకనాఁటి యుదయమున రాజమహేంద్రవరము నల్లాడరెడ్డి పూర్తిగా నాక్రమించుకొనెననియు నన్న

దేవచోడుడును బిన్నండి రాజును యుద్ధములోఁ బోరుచు మరణించిరనియు వార్తవచ్చెను. కోమటివేముని హృదయములో నొక దుఃఖతరంగము లేచి యొడ్డు మోచి క్రమముగా నణఁగిపోయెను. వేముఁడు గుండె దిటవు చేసికొని యా సంఘటనమును దన సిద్ధాంతములోని కన్వయించుకొనెను. ఆనాఁటి సాయంకాలము రాచవేముఁడు పినవేదగిరి తల తీసికొని భేరీ కాహళ దుందుభి నిస్స్వానములు చెలఁగుచుండగాఁ గొండవీడు వచ్చెను.

మఱునాఁ డాషాఢ శుద్ధ పంచమి. నాఁడు పదిగడియలప్రొద్దెక్కి ముల్లగూరమ్మప్రభ పోతురాజుప్రభ వానిముందు నందికంత పోతరాజు కటారి రాచనగరు నుండి పెద్ద యూరేగింపుగా బయలుదేరెను. ముల్లగూరమ్మకును బోతరాజునకు జాతర యథావిధి గావింపఁబడెను. తఱువాత నందికంత పోతరాజు కటారి గృహరాజుమేడ యొద్దకు నుత్సవముగాఁ గొనివచ్చి యచటఁ బూజలు బలులుతీర్చిరి. తఱువాత యొక శిల్పి యాకత్తిని మేడపైని గూటిలో నమర్పుటకుఁ గొనిపోయెను. కాని కత్తి గూటిలో నమర్చుచుండగా నది జారిక్రిందఁబడి పిడివరకు నేలలోనికి గ్రుచ్చుకొనిపోయెను. అది నిలువుగాఁ బడినది గనుక సరిపోయినది. అడ్డముగాఁబడిన విఱిగిపోయి యుండవలసినదే. కోమటివేమునకుఁగాని రాచవేమునకుఁగాని మొగమున నెత్తురు చుక్కలేదు. ఏదియోయొక మహానర్థము సంభవించునను భావము కోమటివేముని హృదయమున గ్రుచ్చుకొనెను. కాని కోమటివేముఁడు దానిని మెల్లగా బెల్లగించి యా గాయమునకుఁ దనసిద్ధాంతమునుబట్టించి మాన్చుకొనెను. రాచవేమున కొడలు మండుకొనిపోయెను. అతఁ డాశిల్పిని బిలిచి నాల్గు తిట్టెను. వారిలో వృద్ధుఁడగు శిల్పి ముందునకు వచ్చి కోమటివేముని క్షమాభిక్ష వేడుకొనెను.

తఱువాతఁ గత్తి గూట బిగింపఁబడెను. ఆకత్తికొన సోగగా నాకసములోనికిఁబొడుచుకొని మేడమేడ యంతయు దలపాగపై నెమిలి కన్ను తురాయి పెట్టుకొన్న మహారాజువలె గోచరించెను. కోమటి వేముఁడు తలయెత్తి మేడవంకఁ బదిక్షణములు చూచెను. అతని మనసున నానందము పొంగెను. అబ్బ! గృహరాజుమేడ యెన్నాళ్ళకుఁ బూర్తియైనది? ధర్మాన్న వేమన్న కన్న కల లెన్నాళ్ళకు ఫలించినవి. కోమటివేముని కాంక్షకుఁ దృప్తి కలిగెను. ఆ తృప్తితోపాటు నేనీ మేడను బూర్తిచేసితినన్న యహంకార మొకటి తల యెత్తెను. అతని మనసులోని వివేక మా యహంకారముఁజూచి నవ్వెను. అహంకార మణగిపోయి యున్నాననియే యనిపించెను. అతఁడట్లే యామేడ వంకఁ జూచుచుండెను. చూచుచుఁ జూచుచునున్న యతనిచూపులు చివఱకు నందికంత పోతరాజు కటారిపై వ్యాపించెను. ఆ కటారి వెంటఁ దుదకంటఁ బోయెను. కటారితుద మొన తేలి యాకసములోనికిఁ బొడుచుచుండెను. హఠాత్తుగా నతని మనసు నాకస మాకర్షించెను. ఆ యాకస మెచట నెచటనున్నది? ఆకత్తికిఁ జుట్టునున్నది. ఆ మేడపై నున్నది. ఆ మేడచుట్టు నున్నది. కోమటివేముఁడు మహాకాశము లోనికిఁజూచెను. మఱల గృహరాజు మేడవంకఁజూచెను. మఱల నాకసమువంకఁ జూచెను. రెండింటిని గలిపిచూచెను. ఆ యాకసమన్న భూతము నోరు తెఱచి గృహరాజుమేడను గబళించుచున్నట్లుండెను.

మఱి రెండు దినములు గడచెను. నాఁడు సప్తమి. నాఁటి యుదయమునఁ బట్టణమున నొకవార్త పుట్టెను. కొండపల్లిని శత్రువులు ముట్టడించినారని. ఆ వార్త వచ్చిన రెండుగడియలకు నవులూరు యుద్ధరంగమునుండి మఱియొక వార్తవచ్చెను. పినవేదగిరి తమ్ముఁడు లింగమనీఁడను పంద్రెండేండ్ల కుఱ్ఱవాఁడు వెలమ వీరులను గూడఁగట్టుకొని

విజృంభించుచున్నాఁడట. తమ నాయకుఁడగు పినవేదగిరి తల రెడ్లు తెగగొట్టుకొనిపోయినందులకు వెలమలు వీరావేశమెక్కి ప్రాణములకుఁ దెగించి పోరుచున్నారట. వారి ధాటికి రెడ్డి సైన్యములు నిలువలేక వెనుకంజ వేయుచున్నవట. లింగమనీఁడు "కోమటివేముని తల తెగ గొట్టుకొనివచ్చి రెడ్లకుఁ బ్రతీకారము సేయుదును. అంత వఱకు స్నానము సేయ" నని ప్రతిజ్ఞ పట్టెనట. ఆ వార్త కోమటివేముఁడు సొంతము వినెనో లేదో వెనుకనుండి మఱియొక వార్తవచ్చెను. సోమదేవచోడుఁడు శత్రువులతోఁ బోరుచు వీరస్వర్గ మలంకరించెనట. అతఁడు పారిపోవుచున్న రెడ్డిసేనలను బురికొల్పుకొని త్రోసికొనివచ్చుచున్న శత్రువులను బదిగడియలు నిలువరించెనట. కాని తుదకతఁడు రణరంగమునకు బలి యయిపోయెనట. వెలమల ధాటికి రెడ్లాగలేక చెల్లాచెదరై పోవుచున్నారట. లింగమనీఁడు కొండవీటివైపు విఱుగఁ ద్రొక్కుకొని వచ్చుచున్నాఁడట. కోమటివేముఁడీ వార్తవినెను. అతని మనసులో నేవిధమైన వికారము గలుగలేదు. అతని మొగమున మార్పేమియులేదు. అతని చూపులలోఁ జైతన్యములేదు. అతని మనసాడుచుండెనో లేదో యతనికిఁ దెలియలేదు. అతఁడేమి వినెనో గూడ విన్నదాని తాకిడి గడియకాలమైనఁ గాని యతని మనసునకుఁ దాకలేదు. అతఁడు చెదరిపోయిన మనసును గూడఁదీసికొని దానినంత కంటె బలమైన యాఘాతముల సహించుటకు సిద్ధము సెసికొనుచుండెను.

ఆ సమయములో వేమాంబ వీణచేతఁ బట్టుకొని వేమారెడ్డి మందిరమునకు వచ్చెను. కూతుమొగము చూచి వేమారెడ్డి గుండె చెఱువయ్యెను. అతఁడు మనసును బిగ్గపట్టుకొని మొగమునందువిషాదము తోపనీక "యేమమ్మా! నీవిప్పుడు వచ్చితి" వని కూతుఁబలుకరించెను. వేమాంబ మొగమున నొకానొక దివ్యతేజోరేఖ మిలమిల లాడు

చుండెను. ఆమెచూపులందొక యతిలోకమైన యనుభూతి పారవశ్యము గోచరించుచుండెను. ఆమె యమాయికముగా బసిపాపవలెఁ జిఱునవ్వు నవ్వుచు "మఱేమిలేదు నాన్నగారూ! రాత్రి ప్రొద్దుపోవుదాక వీణ వాయించుకొనుచు గూరుచుంటిని మీరు చెప్పిన పాఠము నాకుఁ జక్కగావచ్చినది. మాయామాళవ గౌళ రాగమునఁ గరుణరసమును మేళవించుట నాకుఁ బూర్తిగాఁ గుదిరినది. నే నెంతసే పా రాగమును వాయించితినో నాకే తెలియదు. దానియందు నాకనేక విచిత్రమైన యనుభూతులు గల్గినవి. మీకుఁ గొంచెము పాడి వినిపించి పోవుదమని వచ్చితి న౦తేయని వేమాంబ తండ్రివంక మెత్తగాఁ జూచెను. వేమారెడ్డి కనుగొలకుల బాష్పము లోడికలు గట్టెను.

వేమాంబ :— నాన్నగారూ! ఇదియేమి మీరిట్లు దుఃఖించుచున్నారు? వేమారెడ్డి గద్గదకంఠముతో "నేమియు లేదమ్మా" యని కన్ను లప్పళించుకొనెను. వేమాంబ తండ్రియొద్దకుఁబోయి యొడిలోఁ గూర్చుండి చెక్కిళ్ళు పుణుకుచు "నాన్నగారూ! మీ మనసులో బయటికిఁ జెప్పరాని యగ్ని యేదోయున్నది. మీరు నానాఁటికిఁ గృశించిపోవుచున్నా" రనెను. వేమారెడ్డి కండ్లవెంట బాష్పములు తెరలు తెరలై ప్రవహింపఁజొచ్చెను. అతఁడు పొంగివచ్చెడి దుఃఖము నాపికొనుచు "అమ్మా! నా కన్నుల నీరెండిపోయినది. నా కడుపున నీవు పుట్టి యిన్నాళ్ళకు మఱల నీరు తెప్పించితి" వనెను. వేమాంబ కామాటలలోని యర్థము బోధపడలేదు. ఆమె యావేగముతో "నాన్నగారూ! నేనా? నేనా? మీ దుఃఖమునకు నేనెట్లు కారణమైతి" నని యడిగెను.

కోమటివేముఁడు ప్రమాదపడితినని గ్రహించెను. అతఁడు తన్ను దాను సంబాళించుకొని లేనినవ్వు తెచ్చుకొనుచు "మఱేమియు

లేదమ్మా! నేను సంగీతమునందుఁ జేసిన కృషి నీయందు ఫలించినది. అమ్మా! నీవు నాకడుపునఁ బుట్టుటచే నాజన్మము చరితార్థమైనది. నీవు స్వర్గమునఁ బూచిన పారిజాతపు పూవవు. సరాసరి నాయొడిలో వ్రాలితి వమ్మా! నీయందుఁ దప్పఁ దక్కినచోట నా ప్రయత్న మంతయు వ్యర్థమైనది. ఏదమ్మా! నీ వభ్యసించిన పాఠము నొకపరి పాడి వినిపింపు" మనెను.

వేమాంబ వీణియను మాయామాళవ గౌళ రాగమునకు మేళవించి పాడఁదొడఁగెను. పదిక్షణములు కడచిన తఱువాత వాయుమార్గము స్తంభించి యచటి యాకాశమంతయు సమాధి మంతమై చెలువాఱెను. ఆపాట వేమాంబ పాడుచున్నట్లులేదు. ఆమె వీణెకూడ మీటుచున్నట్లులేదు. ఆమె కను లర్ధనిమీలితములై యుండెను. ఆమె మొగము జ్యోతిర్మయమై ప్రకాశించుచుండెను. కాలము గడచిన కొలఁది యామె మొగము ముక్కుది కన్నది యని వేర్పఱుపరాక యేకాకారమై మిఱుమిట్లు గొల్పుచుండెను. అచట చంద్రశాలాంత రాకాశమంతయు నాదమయమై యమృతబిందు పరిష్యందన మధురమై చెలువాఱుచుండెను. కోమటివేముని మనసునఁ బ్రశాంతి యుదయించెను. అతనిహృదయమునఁ గలఁక యంతయుఁ గ్రమముగా నణఁగిపోయి ప్రసన్నతాభరితమై యుత్ఫుల్ల మయ్యెను. అదియంతయు నొక నాదమయమైన సరసి. ఆ సరసిలో వికసించిన రెండు తామరపూవులవలెఁ దండ్రికూతుండ్రు. వారెంత కాల మట్లుండిరో తెలియలేదు. వేమాంబ పాడుట యయిపోయెను. తఱువాత నొకగడియ కాలమున కామె కన్నులు తెఱచిచూచెను. కోమటివేముఁ డచటలేఁడు. అతఁడు గవాక్షము నొద్ద నిలిచి యాకసములోనికిఁ జూచుచుండెను. వేమాంబ తండ్రితో "నాన్నగారూ! నేను సెలవుదీసికొందు" ననెను. వేముఁడు

దనచూపు మఱలింపకయే తలత్రిప్పెను. వేముఁ డాకాశములోనికిఁ జూచుచునేయుండెను. కొంతకాలమైనతఱువాత నతనిమనసు వెనుకకు మళ్ళెను. ఆ మళ్లుటతో నంతకాల మతని మనసులో నణఁగి పడి యున్న దుఃఖము పడగవిప్పి బుసకొట్టెను. "ఓహో! అంతయు నయిపోయినది. ఇది యిట్లు జరుగునని నేను కలలోనైన నూహించి యుండలేదు. నాకన్నుల యెదుటనే యీరెడ్డిరాజ్య మంతమగుచున్నది. గృహరాజుమేడను బూర్తిచేసితిని గదా యని సంతోషించితిని. కొండవీట లక్ష్మీదేవి కాలు నిలువఁద్రొక్కుకొను ననుకొంటిని. కాని నే ననుకొన్న దానికంతయు వ్యతిరేకమే జరిగినది. అంతయు నయిపోయిన దంతయు నయిపోయినది. రెడ్డిరాజ్యము నా కనులయెదుటనే నశించినది. పంద్రెండేండ్ల కుఱ్ఱవానికిఁ గొండవీడు పాదాక్రాంతమైపోవుచున్నది. ప్రోలయ, ప్రోలయవేముఁడు, అనపోతారెడ్డి, ధర్మాన్న వేమన్నలు పెంచుకొన్న యాశావృక్షము పంద్రెండేండ్లకుఱ్ఱవానిచేతిలో నఱికివేయఁ బడుచున్నది. ఓహో! కాలము. కాలము. ఆ మహావీరు లొక్కొక్క రెంతవారు! ఆ మహావీరులముందు గజపతి గజబలము, అశ్వపతి యశ్వబలము, నరపతి నరబలము, నుప్పెనగాలికిఁ దాటియాకులవలెఁ గొట్టుకొనిపోయినవి. ఆమహావీరుల వంశమిపుడు పంద్రెండేండ్ల కుఱ్ఱ వానిముందు నిలువలేక విఱిగిపోవుచున్నది. దీనికంతయు నెచటనో పెద్దతప్పుపుట్టినది. ఇట్లుజరుగవలసినదిగాదు. ఎచటనో పెద్దపొరపాటు జరిగినది. ఏది యా పొరపాటు? కోమటివేముఁడు కన్నులుమూసికొని యాలోచించెను. కాటయవేమునితల కహాకహానవ్వుచు నాతని యెదుటఁ బ్రత్యక్షమయ్యెను. ప్రక్కన గొమరగిరి చప్పట్లు చరచుచుండెను.

కో. వే :— పెద్దపొరపాటు జరిగిపోయినది. ఏది యాపొరపాటు? ఏది యాపొరపాటు?

తల :— ఏమి పొరపాటు ?

కో. వే :— ఓహో ! మఱలమీరువచ్చితిరి. నన్నేడిపించుటకని వచ్చితిరి కాబోలు ! ఇంకెన్నాళ్ళేడిపించెదరు ? అయిపోయిన సంతయు నయిపోయినది.

తల :— ఏమైపోయినది ?

కో. వే :— రెడ్డిరాజ్యము నాశనమైపోయినది.

తల :— ఏదియేది ? మఱలఁజెప్పుము.

కో. వే :— రెడ్డిరాజ్యము నాశనమైపోయినది.

తల :— వింటివిరా ? కొమరగిరీ !

కొమరగిరి :— ఏదియేది యింకొకమాటు చెప్పుము.

కో. వే :— వీనులార వినుఁడు. రెడ్డిరాజ్యము నాశనమైపోయి నది. కాలూది నిలిచిన ధర్మధేనువు కూలఁబడిపోయినది. సర్వనాశన మైనది. సర్వనాశనమైనది.

కాటయవేమునితల పగులఁబడి నవ్వెను. కొమరగిరి చప్పట్లు చఱచెను.

కో. వే :— ఇది మీకుఁ జాలసంతోషకారణముగ నున్నదా ? మీయుద్దేశమున నాయల్లాడరెడ్డిమాత్రము స్థిరముగా నున్నాఁడను కొనుచున్నారు కాఁబోలును. అదియు నయిపోయినది. ఓయీ ! బలహీన మైపోయిన రాజమహేంద్రవరమును రేపటెల్లుంట నశ్వపతియో గజ పతియో మ్రింగివేయఁగలఁడు.

కాటయవేమునితల యిబ్బడిగా నవ్వెను. కొమరగిరి చప్పట్లు చఱచెను.

కో. వే :— మీరు వట్టియనాథులు. రెడ్డిరాజ్యము నాశనమై పోయినదన్న యేడ్వక నవ్వెద రేమిరా ?

తల :— ఓయీ ! ఇప్పుడేడ్చి యేమిప్రయోజనము ? అంతకంటె నిప్పుడునవ్విన నెక్కువప్రయోజనము. నీవుగూడ మాతోనవ్వుము.

కో. వే :— నాకు నవ్వు వచ్చుటలేదు. ఏడ్పు వచ్చుచున్నది. ఇందులో నవ్వవలసిన దేమున్నది ? ఏడ్వవలయునుగాని.

తల :— మిగిలినదవొక్కటియేకదా ! దానికేమి ? ఎప్పుడైన నేడ్వవచ్చును. అనంతమైన కాలమున్నది. ఈయనంతకాలములో మనమో మనము గాకపోయిన మనపిల్లలోనెట్లును నేడ్తురు. మేము మాత్రమేడ్వలేము. మాకేడ్వలేక నవ్వువచ్చుచున్నది. నీకు నవ్వలేక యేడ్పువచ్చుచున్నది.

కో. వే :— నవ్వలేకయేమి ! నిజముగానే యేడ్పువచ్చుచున్నది.

తల :— అవును. అదియే నేనును జెప్పితిని. నీవుమాతోపాటు నవ్వుమురా యనఁగా నవ్వలేకపోయితివిగదా ! నీవు నవ్వలేకపోయితివిగాని నీతమ్ముఁడు మాచారెడ్డిచేత నవ్వించెదను చూడుము.

మాచారెడ్డితల కోమటివేముని మనసుతోనుండి పైకిఁదేలెను.

కాటయవేమునితల :— ఏదిరా ! ఒకపరినవ్వి వీనికిఁజూపించుము. మాచారెడ్డితల మంత్రదండము చూపినట్లు నవ్వసాగెను.

కా. తల :— ఏమిరా ! చాలా ? ఇంకను నవ్వించమందువా ?

కోమటివేముడు మాచారెడ్డితలవంకఁ జూచి నీవుగూడ నవ్వుచుంటివా ? యనెను. మాచారెడ్డితల యేదియో చెప్పఁబోయెను. కాటయవేమునితల దాని నదలించి "యూరకనవ్వుము మాటాడకు"

మనెను. మూచారెడ్డితల యూరకనవ్వసాగెను. ఆ నవ్వుచున్న యూగూసమునకు దాని గ్రుడ్లు పైకిఁ గ్రక్కుకొని వచ్చుచుండెను. కాటయ వేముని తల "యింతటితోఁ జాలునా? అన్న దేవచోడునిఁ సోమ దేవచోడుని గూడ రప్పింతునా?" యనెను. వారిద్దఱుగూడఁ గోమటి వేముని మనసులోఁ దోఁచినవ్వసాగిరి. కాటయ వేమునితల "యన్నట్టుమఱచి పోయితిని. అసలువాఁడున్నాఁడు పినవేదగిరి వానితలను నవ్వింపవెద నుండు" మనెను. పినవేదగిరి తల పైకివచ్చి పకపక లాడుచుండెను. కోమటి వేమున కానవ్వులువిని మతిపోవుచుండెను. అతఁడు 'మీరందఱు పిశాచములు. నన్నుబట్టుకొని పీకుకొనితినుచున్నారు. మీగోట్లువదలి పోవుదు' రనెను.

కా. తల :— అరె! అరె! మేము వట్టిసంసారములమురా! వట్టిసంస్కారములము. పిశాచములందు వేమి?

కో. వే :— ఈ సంస్కారములే పెద్దపిశాచములు. ఇవి యెట్లు పోవును!

కాటయ వేమునితల పగులఁబడి నవ్వెను. కొమరగిరి చప్పట్లు చరచెను.

కా. తల :— నీకుఁబిశాచములన నేమియో తెలిసినదన్నమాట.

కోమటివేమునిమనసులో నస్పష్టముగా నేదియో జ్ఞాపకమునకు వచ్చెను. అతఁడు దానిని స్పష్టముగాగుర్తునకుఁ దెచ్చుకొనుటకు బాధ పడెను.

కా. తల :— నీవెందుకురా! ఊఁఱక బాధపడెదవు? ఆయస్పష్టముగానీకు జ్ఞాపకమునకు వచ్చినదున్నదే యది స్పష్టముగావచ్చినప్పుడు దానిని లోపలికిఁ ద్రొక్కుకొంటివి. దానినెవఁడైన జుట్టుపట్టుకొని పైకి

లాగుటకు రావలయును. అందాక పంచాక్షరి జపించుచుఁ గూర్చుండుము.

కో. వే:— మీరు సంస్కారములుగదా! మీరు పిశాచములు గారు. కారని తెలిసినఁగూడ నన్ను బాధించుచుంటిరేమి?

కా. తల :— అదియే చిత్రము. ఓరీ! మేము నిన్ను ప్రాణముతో వదలమురా! మా తలలన్నియు నీవు తీయించితివి. మమ్ముఁదెచ్చి నీమనసులోఁ బెట్టుకొంటివి. నీతల తీయించిగాని నిన్ను వదలము. ఊరక పోవుననుకొంటివిరా?

కో. వే :— అదికూడ దగ్గఱకే వచ్చినదిలే.

కా. తల :— రాకయింతవఱకు వచ్చినది యూగునా? ఎందుల కేడ్చెదవుగాని యదియెట్లును జరుగకమానదు. హాయిగా నవ్వుచు ననుభవింపుము. నవ్వుచుఁ జేసినది యేడ్చుచు నంద అనుభవింతురు. అందులో విశేషమేమున్నదిరా? నవ్వుచుఁజేసినది నవ్వుచు ననుభవింప వలయును. అన్నట్లు నీకా పెద్దియజ్వగారు చెప్పినారు గాదురా! కనులయెదుట జరుగునదంతయు వట్టి వార్త మానిక విలసనమని దాని కేడ్చుట యెందుకురా?

కో. వే :— అవునవును. ఆ పెద్దియజ్వగారు చెప్పినారు. ఆలోచించిన నదియంతే. కాని యదియనుభవమునకు వచ్చుటలేదు. అది యనుభవమున కెట్లు వచ్చునో యాయనను నే నడుగలేదు. అన్నట్లాయన రేపేకాదశినాఁటికి నమరావతి వచ్చునట. ఈ త్రోవను వచ్చిన బాగుండును.

ఎవరోవచ్చి కలవరముగఁ బ్రభూ! ప్రభూ! అని పిలిచినట్లయ్యెను. కోమటివేముఁడు కన్నులు తెఱచిచూచెను. ప్రగడయ్య. ప్రగడయ్య

"ప్రభూ పెద్దియజ్వగారును సన్నగారును రేపు మనయూరు వచ్చు చున్నారట" యనెను కోమటివేముని మొగమున సంతృప్తి రేకగా దోఁచెను.

౧౮

మఱునాఁడు పదిగడియల ప్రొద్దెక్కి-కోమటి వేముఁడు గృహరాజు మేడయొద్దఁ బెద్దియజ్వ రాకకు నిరీక్షించుచుఁ బచారుచేయుచుండెను. దూరమున నిద్దఱు సన్యాసులతని కభిముఖులై వచ్చుచుండిరి. వారి ముందుఁ బ్రగడయ్య త్రోవదీయుచుండెను. వారు సమీపించుసరికిఁ గోమటివేముఁడు వారిని బోల్చుకొనఁగల్గెను. వారు పెద్దియజ్వయు సింగన్నయు. సింగన్ననుజూడఁగనే కోమటివేమునికిఁ బ్రాణము లేచి వచ్చెను. అతఁడు సింగన్నగారూ! అని పలుకరింపఁబోయి నాలుక కఱచుకొని వందనము గావించెను. ఆ సన్యాసు లిరువురును నారాయణ స్మరణ గావించిరి. ప్రగడయ్య పెద్దియజ్వగారితో "దమ రాకకై ప్రభువువారు చాలకాలమునుండి నిరీక్షించుచున్నారు. తమదర్శన మీనాఁటికిఁగలిగిన" దనెను. పెద్దియజ్వ మందహాసముతో 'నీనాఁటికి మే మిచ్చటికి రావలయునని పరమేశ్వరోద్దేశము. కాన వచ్చితిమి. మేము చాలకాలముక్రిందటనే యిచటికి రావలయు ననుకొంటిమి. కాని రాఁగల్గితిమా?" యని సింగన్న మొగమువంకఁ జూచెను.

కో. వే :— ఇప్పటికైన నాయదృష్టము పండి మీరు వచ్చితిరి. మఱిరెండురోజు లాఁగినచో మిమ్ము దర్శించు భాగ్యముగూడ నాకుఁ గల్గియుండెడిది గాదు.

పెద్దియజ్వ :— మేము నేఁడిచ్చటకు రావలయునని యున్నప్పుడు మఱిరెండు రోజు లెట్లాఁగెదము?

శో. వే:— అవును మీరప్పుడు చెప్పితిరి. ఏకాలమున కేది యెట్లు జరుగవలయునో యది యట్లుజరిగితీరును. అది యంతయుఁ గాలాధీనము. నేనప్పుడు మిమ్మహంకారముచేత నడుగలేదు. ఈ కాలమన్నది యొక మృత్యుచక్రమనియు దీని కావల నొక మహాకాలమున్నదనియు నామహా కాలపరిజ్ఞానమువలన జీవుఁడీమృత్యుచక్రమునుండి ముక్తుఁడగుననియుఁ జెప్పితిరి. నాకేదో మొదటినుండి యీకాలభావ మీ యాకాశభావము తెగని సమస్యలై బాధించుచున్నవి. ఈకాలమంతయు వర్తమానము గనే భాసించుచున్నది. ఈ దృశ్యజగమంతయు వట్టి వార్తమానిక విలసనమే యని విచారసమకాలమునందు సత్యమైతోఁచినను ననుభవము నందుమాత్ర మాదృశ్యజగమున మనసు తగులముచెంది దుఃఖపడు చున్నది. ఈ వివేకమున కీవివేకము. ఆభ్రాంతి కాభ్రాంతి. రెండును రెండుగాఁ గలిసిపోవుచున్నవి. ఈ భ్రాంతినివదలి యా సత్యము ననుభవమునకుఁ దెచ్చుకొనుట యెట్లో? వర్తమానమును వదలి యా మహాకాలమును దర్శించుటయెట్లో? ఎంతయాలోచించినను నాకుఁ దెలియలేదు. నేను మీకు శిష్యుఁడను నన్నుప్రబోధించి నాకు వెలుఁగు చూపింపుఁడు.

పెద్దియజ్వ:— మహారాజా! ఈవిషయమును మీకుపదేశింప వలయునని యీశ్వరాజ్ఞకలిగి మేమిచటికి వచ్చితిమి. చెప్పెదను వినుఁడు. అసలు కాలము కాల మనుచుంటిమే యది పరమేశ్వరస్వరూపము. సామాన్యుల కా కాలముయొక్క యవగతి యుండదు. ఎల్లజనులకుఁ దెలిసిన కాలము కల్పితము. ఇట్టు కాలము రెండు విధములు. ఒకటి సత్యము, పరమేశ్వరస్వరూపము, అఖండము. దీనినే మహాకాల మందుము. రెండవది. — అసత్యము, కల్పితము, మృత్యురూపము, ఖండము. దీనినే కాల మనుచున్నాము. ఈ ఖండకాల మేగోళమున

కా గోళమున భిన్న భిన్నముగా నుండును. ఆ గోళముయొక్క పరిధిని బట్టి దాని గమనమునుబట్టి యీ ఖండ కాల మేర్పడును. ఈ భూగోళముయొక్క పరిధినిబట్టి గమనమునుబట్టి యిచటి కాల మేర్పడు చున్నది. ఈభూమిపై నివసించు జీవరాసులన్నింటిపై నీకాలము యొక్క ముద్ర యుండును. ఇట్లేగోళమున కాగోళమునఁ గాలము భేదించుచుండును. అందుచేత దీనిని గల్పితమంటిమి. ఆయాగోళముల పరివేషమునుదాఁటి చూచినచో నీకాలములేదుగాన దీనిని నసత్య మంటిమి. ఇది సగము చీఁకటి సగము వెలుగుగా నడచుచున్నది గాన ఖండ మంటిమి. దీని ముద్ర జీవులపై నత్తుకొని జననమరణాదులకుఁ గారణ మగుచున్నది గాన మృత్యు వంటిమి. ఈ భూమిని వదిలిపెట్టి యాకసములో నిల్చితి మనుకొనుఁడు. అచ్చట నిట్టి కల్పితకాలము లేదు. ఆయాకాశముయొక్క స్థితి కాధారమైనది మహాకాలము. దానియం దెప్పుడు వెలుఁగేకాని చీఁకటిలేదు. కావున దానికిగణనములేదు. అందు చేత నదియఖండము. అది పరిధి గమనములచేత నేర్పడుటలేదు గానఁ గల్పితముగాదు. ఈ కల్పితకాలమునకీ గోళములకు నీయాకాశములకు నాధారముగా నున్నదిగాన సత్యము. దానికాధారమైనది వేఱయేదియు లేదుగాన నీశ్వరరూపము.

ఎంతవఱకు మనచూపు లీభూమిని దాని పరివేషమును వీడిపో లేవో యంతవఱకును మన మీమృత్యురూపమైన కాలమునుమీఱలేము. మనచూపు లీభూమిని వీడి మెఘ డాకసముననిల్చునో యప్పుడే మన మీ మృత్యుచక్రమునుండి తప్పించుకొనుచున్నాము. ఈభూమియంతయుఁ జీఁకటి. ఆయాకసమంతయు వెలుఁగు. రాజా! స్వార్థమన్నది మిక్కిలి చెడ్డది. అదిమనచూపును భూమికి లగింపఁజేయును. పైకి లేవనీయదు. ఈ స్వార్థము భయముచేఁ గల్గును. ఈ భయమే యన్నికోరికలకు మూల

భూతమైనది. సర్వజీవుల హృదయములపైన మృత్యురూపమగు నీఖండ కాలముద్ర ముద్రితమైయున్నది. ఈ ముద్రయే యజ్ఞానము. దాని ప్రధమవిలసన మీా భయము. మూలభూతమైన యీా భయము నీస్వార్థము నెపుడువీడునుమో యపుడే యీామృత్యుముద్ర మనపైనుండి తొలఁగిపోవును. మనలను భూమికి బంధించియుంచిన యజ్ఞానసూత్రము తెగిపోయి మనదృష్టి యాకసమునఁ గేంద్రీకృతమై సర్వవ్యాపకమై నిత్యసిద్ధమైయున్న పరమేశ్వర తత్వమును దర్శించుటకు మొదలు పెట్టును. ఈతత్వమును దర్శించినవానికి మఱల చ్యుతియుండదు. ఆ మహాకాలమే పరమశివుఁడు. సర్వేశ్వరుఁడు. శాశ్వతుఁడు నిత్యుఁడు, నిరామయుఁడు. ఆయనకుఁ గాలకాలుఁడనియు, కామజేతయనియుఁ బేళ్ళు. శైవాగమములన్నియు నీరహస్యమునే చెప్పును. పాశుపత కాలాముఖాది శైవమతము లన్నియు జాగ్రతగా విచారించినచో స్వార్థజ్ఞాన ధ్వంసకమగు నీశివార్చనముచే బోధించును. మన మేపని చేసినను నది శివారాధనముగా భావించినచో నీ కాలచక్రమునుండి మనకు ముక్తిగలుగును. ఆ పరమశివుని యనుగ్రహామువలన మనకు మహాకాలస్వరూప దర్శనము గలుగును.

కో. వే :— మీారుచెప్పినదంతయు నాకు లెస్సగా నవగతమైనది. నా జీవితమంతయు మొదటినుండియు నా మహాకాల భావముతో నాకాశభావముతో ముడివడియున్నది. మొదటినుండియు నన్నా శివ భావ మాకర్షించుచునే యున్నది. కాని నేనీ స్వార్థమును నీభయమును నీరాజ్యతృష్ణను వీడలేక మృత్యుగర్తమునఁ బడిపోయితిని. నేనేమి? మేమందఱము పడిపోయితిమి. కాటయవేమఁడు! కొమరగిరి, కోమటి రెడ్డి, నేను, మేమందఱ మీా స్వార్థముచే నీతృష్ణచే నీమొండమావులకై పరస్పరము నిగ్రహించుకొని మాపెద్దలు నిలువఁబెట్టిన ధర్మధేనువును

కూలఁద్రోసికొంటిమి. ధర్మాన్న వేమన్నగారు "నాయనా! మీరు నలువురు కలిసి గృహారాజుమేడను గట్టి యందు లక్ష్మీదేవిని స్థాపించి సేవించుకొనుఁ"డని చెప్పెను. ఆయనమాటలు నాకిప్పు డవగతములైనవి. స్వార్థ మొకటి యడ్డుపడి యాయనమాటల నర్థముచేసికొన నిచ్చినది గాదు. అయ్యో! అయ్యో! నేనీమేడను గట్టితి ననుకొంటినిగాని నిజముగా నాయన కట్టిన మేడను నేను గూలఁద్రోసితిని. అయ్యో! నే నీ స్వార్థముచే మృత్యుగర్తమునఁ బడిపోయితిని. మహాప్రభూ! నాకు నుద్ధరణమంచు నున్నదా!

పెద్దియజ్వ :— రాజా! విచారింపకుము. నీకు నురమున్నైవుఁడవు. ఈ దుఃఖమున్నదే యిదికూడ నాస్వార్థముయొక్క విలసనమే. స్వార్థమన్నను భయమన్నను రెండు నొక్కటే. రెండును జిక్కని యజ్ఞానముయొక్క రెండంచులు. అది యట్లు జరుగవలసి జరిగినది. దానియందు నీకర్తృత్వ మేమున్నది? అయిన నది జరిగినదని మాత్ర మెట్లు చెప్పఁగలము? అది యూరక యట్లు భాసించినదంతే. కాదుకాదు. అది యట్లు జరుగలేదు. అది పట్టి వార్తమానిక విలసనము. రాజా! యీ జగత్తంతయు వట్టి సంస్కారప్రసవము. దానియందుఁ దగులము చెందకుము.

కో. వే :— మహాప్రభూ! అదియే కుదురుటలేదు. ఆ భ్రాంతిని దూరము చేయుమార్గము నా కుపదేశింపుఁడు.

పెద్దియజ్వ కోమటివేముని బద్మాసనముపైఁ గూర్చుండ నియమించి తనకుడిచేతి జొటనవ్రేలతని బ్రహ్మరంధ్రముపైఁ బెట్టి నొక్కెను. కోమటివేముని కన్నులు మూసికొనిపోయెను. అతని శరీరములో నొక మహావిద్యుత్తు ప్రసరించెను. అతనిమనసంతయు నిలిచిపోయెను. నాల్గుగడి

యలకాలమువఱకు నతఁ డొడ లెఱుంగని స్థితిలో నట్లే కూర్చుండెను. తఱువాత నతనికి శారీరక స్పృహ కల్గెను. అతఁడు కన్నులు తెఱచెను. అతనికన్నులు విశదములై స్వచ్ఛములై చూపులు స్వాదుతామయములై యుండెను. అతని మొగము వికసించి యేదియో యతిలోకమైన దివ్యానుభూతి గూడుకట్టి మిలమిలలాడుచుండెను. పెద్దియజ్వ "రాజా! పరమశివుఁడు నీయందుఁ బ్రసన్నుఁడైనాఁడు. మేముపోయివచ్చెద మనెను. కోమటివేముఁడు మొగమునఁ దృప్తితీర లేచి పెద్దియజ్వకుఁ బాదాభివందనము గావించెను.

మఱి మూఁడురోజులుగడచెను. ఈ మూఁడురోజులలోఁ గోమటి వేమున నసేక విచిత్రములైన యనుభూతులు గల్గెను. ఇప్పుడతని మనసు లోనికిఁ గాటయవేముని తలగాని కొమరగిరిగాని వచ్చుటలేదు. అతని మనసు పరిశుద్ధమై దానియం దొక యపూర్వమైన యానంద పరిస్రుతి వాకలు కట్టుచుండెను. దినములోఁ జాలకాల మతఁడు సమాధిలోనే గడపివేయుచుండెను. ఈ మూఁడురోజులనుండి యుద్ధరంగమునుండి యెప్పటికప్పుడు వార్తాహరు లరుగుదెంచి కోమటివేమునకు యుద్ధగతి తెల్పుచునే యుండిరి. కోమటివేమునకవి యేమియుఁ బట్టుటలేదు. దిన దినము లింగమనీఁడు త్రోసికొని వచ్చుచునే యుండెను.

నాఁడాషాఢ శుద్ధైకాదశి. లింగమనీఁడు కొండవీటివఱకుఁ ద్రోసికొని వచ్చెను. విజయనగరరాజుగూడ నతనికి సాయము వచ్చెను. యుద్ధములో గజరావు తిప్పనాయఁడు, వెలుగోటి రాయపనాయఁడు మరణించిరి. గడియగడియకీ వార్త లెవరో వచ్చి వేమునకుఁ జెప్పుచునే యుండిరి. గాని వేముని మనసునం దేవికారమును గలుగుటలేదు. ఏది యెట్లుజరిగిన నొక్కటేయను నుపేక్షాభావ మొకటి తప్ప వేఱేమియు నతని మనసులోలేదు.

రాచవేముని సేనలకు బయట శత్రువులను నిలువరించిపోరుటకు

శక్యముగాకపోయెను. రాచవేమునకు [illegible] రించి కోటతలుపులు మూయించెను. [illegible] వేయించి కోటపైకి ఫిరంగులు బాగుచేయు [illegible].

ప్రగడయ్య కోమటి వేముని యొద్దకు వచ్చి [illegible] వేముని మొగమున మార్పులేదు.

ఆనాడు కోమటివేమునకు [illegible] నము సేయుచు నాటిసాయంకాలమున గృహరాజు మేడ [illegible] బావియొద్దను బచారు సేయుచుండెను. [illegible] యలప్రొద్దుండెను. కోటబైట శతఘ్ని [illegible] మ్రోగుచుండెను. ఆసమయమున [illegible] పరుగునవచ్చి యేడ్చుచు "మహాప్రభూ! [illegible] జులు పరిశీలించి వచ్చుచుండగా [illegible] యెల్లయ్య యువరాజుగారిని [illegible]" అని చెప్పెను. కోమటివేముని మొగమున మార్పులేదు. అతడు "ఈశ్వరేచ్ఛ! ఈశ్వరేచ్ఛ! దీనికి మనమేమి సేయుదుమురా! [illegible]" అనెను. మఱియొక గడియగడచి మఱియొకడు [illegible] వేయి మంది భటులతో లగ్గలకెగ్రాకి కోటలోఁ బ్రవేశించి [illegible] నెల్ల చిత్రవధ సేయుచున్నారను. [illegible] కోటతల్పులు తీయించి శత్రువులకు కోటనప్పగింప నెట్టుచుండఁగా సవిరము యెల్లయ చాటుగాఁబోయి యాతనిని బొడిచిచంపెనని చెప్పెను. కోమటివేముని మొగమున మార్పేమియుఁ గలుగలేదు. అతని చూపులు పశ్చాత్తాపమును వ్యక్తముచేసెను. మఱి పదిక్షణములలో నంతఃపురమునుండి పనికత్తె హారిణి పరుగెత్తుకొనివచ్చి రాణివాస మగ్నిప్రవేశము గావించినదని చెప్పెను. వేముని మనమున మార్పులేదు. అతఁడు వారినందఱను "యిచ్చటనుండి యావలకుఁబొం" డని వారిని బంపివేసెను.

అతఁ డూరక యాకసములోనికి జూచుచు నేదియో వినవలయునని వాంఛించెను.

పదిక్షణములైన తఱువాత నాయాకాశమంతయు వీణానిక్వాణ మధురమై విన్పింపఁజొచ్చెను. ఆ నిక్వాణమధువుచే వాసించి కాఁబోలు నచటివాయువు లమృతపరిమళములు గురియుచుండెను. కోమటి వేముఁడు సమాధిస్థితుఁడై యా వీణానాదముతో నేకత్వము భజించి కూర్చుండెను. అతఁడు కన్నులు తెఱచిచూచుసరికి మలుసంజకెంపు వెల్గులు గృహరాజుమేడపై జేగురులుకొట్టుచుండెను. అతనిని సమాధి నుండి బయటికిఁ దెచ్చినది భేరీనినాదము అతఁడు తనచూపు లావంకకు సారించెను. పండ్రెండేండ్ల కుఱ్ఱవాఁడు లింగమనీఁడు కత్తిడాలు పూని సింగపుఁగొదమవలెఁ దనవంకకు దుముకుచుండెను. మెఱపుమెఱసినట్లు లింగమనీఁడు వేమునిసమీపించెను.

లింగమనీఁడు :— నీవేనా కోమటివేముఁడవు ? నిన్నుజంపి నీతల తెగఁగొట్టుకొని పోయెదను. కత్తిడాలుపుచ్చుకొని యుద్ధమునకురమ్ము.

కో. వే:— నేనుగాదుకోమటివేముఁడు. కోమటివేముఁడెన్నఁడో చచ్చిపోయెను. ఈ దేహముమాత్రము వానిదే, ఈ జీవుఁడువేరు. నేను నీతోయుద్ధముసేయను. కావలసినచో దలయిచ్చెదను. తీసికొనిపొమ్ము.

లింగమనీఁడు :— నీవువట్టి పిరికిపందవు. నిన్నుజంపను. ఇంతపిరికి వాఁడవని తెలిసినచో నింతదూరము వచ్చెడివాఁడనుగాను.

కో. వే :— ఓరి కుఱ్ఱవాఁడా ! నిజముగా నీవు పిరికిపందవు. నేను బిరికిపందను గాను. నీపిరికితనముచేతనే నన్నుజంపుటకు వచ్చితివి.

లింగ :— నేను బ్రతీకారముసేయుటకు వచ్చితిని. నీవు నాయన్న తల తెగఁగొట్టించితివి. దానికిఁ బ్రతీకారముసేయుటకు వచ్చితిని. నన్ను బిరికిపంద యందు వేమి ? నీవలె మూలఁగూర్చుంటినా ?

కో. వే :— ఓయీ! లక్షు చదువవలెను. ప్రతీకారమన్నను, శౌర్యమన్నను, ధైర్యమన్న నివియన్నియు మూలభూతమైన యజ్ఞాన విలసనములు, ఆ యజ్ఞాన మున్నదే భయరూపము. ఆ భయమునకు నీయిష్టమువచ్చిన పేరు పెట్టుకొమ్ము.

లింగమనీఁడు :— నీవుపాపము వేదాంత విచారముచేయుచుంటివి. నీవెట్లును జచ్చితివి నిన్నుజంపినను జంపకున్న నొక్కటే. నిన్నుజూచిన సిగ్గు వేయుచున్నది. ఛి ఛీ! నీవు వట్టి పిరికిపందవు.

లింగమనీఁడు కత్తిని క్రిందఁబాఱవేసెను. సరిగా నాసమయమునకు శతఘ్ని గోళమొకటి గృహరాజుమేడపైని కత్తిగూటిని దూసికొనిపోయెను. ఆదెబ్బకు నందికంత పోతరాజు కటారియూడి లింగమనీనిచెంతఁబడి భూమిలోనికి గ్రుచ్చుకొనిపోయెను.

కో. వే :— ఓయీ! లింగమనీఁడా! నీవుచెప్పినట్లు నేనుబిరికి పందనైనచో నిన్నుజూచినప్పుడే చంపియుండెడివాఁడను. ఇదిగో! చూడుము. నా చేతిలోఁ గత్తిలేదు. డాలులేదు. నామనసులో నిజమైన ధైర్య ముదయించినది. ఆయుధములుపూని నీవలెదానిని నేనుబయటనుండి తెచ్చుకొననక్కరలేదు. నీవేదో గొప్పయనుకొని కత్తిని క్రింద బాఱవేసితివి. నాచేతిలోఁ గత్తియున్న నీవు పాఱవేసెడి వాఁడవుగావు. ఇదియే నీధైర్యముయొక్క స్వరూపము. ఊఱక నన్ను బిరికిపందయందు వేమి?

లింగమ :— నీ విప్పుడైనను యుద్ధమునకు సిద్ధమైనచో నిన్ను గాళ్ళతోఁ జేతులతోఁ జంపగలను. నిన్ను జంపుటకుఁ గత్తిగూడ నెందులకని పాఱవైచితిని.

కో. వే :— నేనుజెప్పినది నీకుఁదెలియలేదు. ఓయీ! నీకుఁజెప్పి కూడ లాభములేదు. నీబోటిబొట్టికాయలకీ విషయముదెలిసెడిదిగాదు.

ఆసలువిషయము నీవునన్ను జంపలేవు. నీవుచట్టిపిరికిపందవు. నన్నుజంపునంత ధైర్యము నీకులేదు. నన్నుజంపకున్నచో నీయన్న పిశాచమై యేడ్చుచుండును. దానికిఁ బ్రతీకారము సేయుట నీకుఁ జేతఁగాదు.

లింగమనీని మనసునఁ బినవేదగిరితోఁచెను. అతనితలఁ దెగిపోయియుండెను రక్తము పైకిఁ జిమ్ముచుండెను. అతనినరల దవుడలు లోపలికిఁ దోసికొనిపోయి పండ్లు బయటికివచ్చి ముక్కు తర్జనివోలె బిగిసి కండ్లు తీక్ష్ణములై మొగమంతయు రక్తముగ్రమ్మి యొకగాఢ ప్రతీకార వాంఛ పరివేషము గట్టియుండెను. లింగమనీని మనసునఁ గోపము ధూమాయితమై చిక్కని పొంత వెట్టెను. అతఁ డావేశముతో నేలలో దిగఁబడిపోయిన నందికంత పోతరాజు కటారిని బెఱికి కోమటివేముని వక్షమునఁ బొడిచెను. కోమటివేముఁడు వెనుకకుఁ బడిపోయెను. అతని చూపులకు భూమి కన్పడుటలేదు. అంతయు నాకసము. కాని యతని చూపులకు నాకసమునకు మీఁదను గృహరాజుమేడ యపగత కిరీటుఁడైన మహారాజువోలెఁ గన్పించెను. కోమటివేముఁడింకను నిదియొకటి యగ్రమున్నదా ! యనుకొనెను. అతఁ డట్లనుకొనెనో లేదో రెండువైపుల నుండి రెండు శతఘ్నిగోళములు తగిలి గృహరాజుమేడ నిలువునఁ గూలిపోయెను.

వేమునిచూపులు నట్టి యాకాశములో దేనికొఱకో తారాడెను. అతనిచూపు లాయనంతాకాశములో బారలుసాచెను. ఆయాకసమంతయు వెల్గు. వేమునిచూపు లాయాకాశము తుట్టతుదల కీడ్చికొని పోయెను. ఇంక నాకాశము మిగిలిలేదు. ఉన్నదెల్ల వట్టివెల్గు. అచ్ఛమైనవెల్గు. వేమునిచూపు లా యనంతమైన వెల్గులో లీనమయ్యెను.

సంపూర్ణము

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము